The one and only Magazine devoted to Humour & Music



పేజీలు : 68+8
వెల : రూ.10

# హాసం

హాస్య-సంగీత పత్రిక

16 - 31 జనవరి 2002



వేటూరికి
అక్షరాభిషేకం
చేసిన సిరివెన్నెల

సెంటర్‌స్ప్రెడ్‌లో

ఎంత బావుందో

ఓ చిన్నదాన

YOU LOVE ME

పాటల
పుస్తకాలు

ఎన్టీఆర్ వర్ధంతి సందర్భంగా
స్పెషల్ పేజీలు అదనంగా ...



జనవరి 29
వేటూరి సుందర్రామ్మూర్తి
జన్మదిన సందర్భంగా
సంగీత సాహిత్య
ప్రియులందరి తరపున
శుభాకాంక్షలతో...
హాసం



# ఇవీ సంగతులు

## హాస్యం



## సంగీతం



**ఎన్.టి.ఆర్. ఫొటోల కర్టెసీ:**

కవర్‌పేజీ - శ్రీ భూషణ్,

63, 64, 66, 67, 69- పేజీలు - శ్రీ నందగోపాల్

75వ పేజీ శ్రీమతి ఘంటసాల సావిత్రి

సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా

'ఎంతబావుందో', 'ఓ చినదానా'

సినిమా పాటల పుస్తకాలు

'సెంటర్‌స్ప్రెడ్'లో



8 పేజీల ప్రత్యేక కానుక: ఎన్.టి.ఆర్. పద్యాలు, అరుదైన పాటలు

ముఖచిత్రం: ఎన్.టి.ఆర్.

కవర్ డిజైన్: ఈరంకి

# ప్రయోజనవాక్యం

హాసం
కేవలం
'అట్ట' హాసం మాత్రమే కాకుండా
ఆపాదమస్తకం
'ఆహా' సం!!!
-బ్రహ్మానందం
మూవీ ఆర్టిస్ట్, హైదరాబాద్

'హాసం' జనవరి సంచిక చూశాను. సుమారు 15 సంవత్సరాలకు పైగా సినిమా సంగతులను ఆసక్తిగా చదువుతూ, పదిలంగా దాస్తూ, వ్యాసాలు రాస్తున్న నాకు చాన్నాళ్ళక్రితం ఆగిపోయిన విజయచిత్ర, సినిమారంగం వంటి పత్రికలను గుర్తుకు తెచ్చింది మీ హాసం, సంగీతకారులు, కమేడియన్ల గురించిన సమాచారం విలువైనది ప్రధానంగా ఈ సంచికలోని 'చిత్రగుప్త' వ్యాసం మరెన్నో సంగతులు తెలిపిందో! వి.ఏ.కె. రాసిన వ్యాసం బావుంది. వి.ఏ.కె. గారితో తెలుగు సినిమా చరిత్రను సంపూర్ణంగా రాయిస్తే సాధికారికంగా ఉంటుందని నా సలహా. పాత పాటలపై వివరణ పదికాలాల పాటు దాచుకోదగింది. మీ ప్రయత్నం ప్రశంసనీయం. అభినందనలు.

-హెచ్.రమేష్‌బాబు,
ఫ్రీలాన్స్ జర్నలిస్టు, నాగర్‌కర్నూల్

**1-15** జనవరి 2002 సంచికలో సింధుభైరవి రాగం ఆధారంగా వెలువడిన హిందీ చిత్రాల పాటలు ప్రచురించారు. చాలా సంతోషం. కాని "ఇన్సాఫ్‌కా మందిర్ యే భగవాన్ కాఫర్ హై" పాట మీరు ప్రచురించినట్లు "షబాబ్" చిత్రంలోనిది కాదు. ఈ పాట "అమర్" చిత్రంలోనిది. (రఫీ/షకీల్ బదాయిని / నౌషాద్.) ఇటువంటి పొరపాట్లు పొరపాటుగానైనా ప్రచురించవద్దని మనవి. ఎందుకంటే యీ/ మా పత్రిక చాలా విషయాలు తెలియజేస్తుంది.

-ఎస్.శ్రీనివాసరావు,
ఎమ్మిగనూరు

**నిజమే... పొరపాటే...! మీరే కరెక్టు....!!**

**-ఎడిటర్**

'హాసం' పత్రికా సంపాదకులకు నమస్కారములు. హాసం ప్రారంభ సంచిక నుండి రెగ్యులర్‌గా కొని చదువుతున్నాను. 'హాస్య సంగీత' పత్రికగా మీరు పరిచయం చేసినా... సాహిత్య గుబాళింపు కూడా ఉండటం ఆనందించతగ్గ విషయం.

తనికెళ్ళ భరణిగారి రచనలలో మల్లాది రామకృష్ణ శాస్త్రి గారి స్థాయిని మించి తెలుగు తేనె జాలువారుతోంది. మేం చదివే రోజుల్లో సాక్షి వ్యాసాలు కొరుకుడుపడని జీడి పాకంలా ఉండేది... వాటిని 'తెనిగించి' (అనొచ్చా?) వ్యావహారికానికి మార్చి అక్షరాల వెంట పరుగులు తీయిస్తున్నారు. పాత సినీసాహిత్యాన్ని పరిచయం చేస్తూనే పాత తరం సంగీత దర్శకుణ్ని పరిచయం చేయడం పత్రికకు నిండుతనం వచ్చింది.

**-పేరిచర్ల రామకృష్ణంరాజు,**
**ధర్మవరం**

'హాసం' 'పక్షపక్ష' ప్రవర్ధమానవుతున్నందుకు చాలా సంతోషం. వెనకటికి కీ.శే. వి.వి.రాఘవయ్య గారి "జ్యోతి" మాసపత్రిక వచ్చిన మొదట్లోను - ఆ తర్వాత కొంతకాలం చాలా సంతోషించాను. అదే సంతోషం మళ్ళీ కలుగుతోంది. ఆ పత్రిక మన "తెలుగు పాండవులు" బాపు, ము.వెం. రమణ, వి.ఎ.కె.రంగారావు, నండూరి రామ్మోహనరావు, రావి కొండలరావు గార్ల ఉమ్మడి ఉత్సాహ పతాకం క్రింద వచ్చింది. (సమాసం ఆరుద్రగారిది). పాండవుల్లో నలుగురు - బాపు -రమణ, రావి కొండలరావు, వి.ఎ.కె.రంగారావు గార్లు మన పత్రికల్లో దర్శనమిస్తున్నారు. నండూరి రామ్మోహనరావుగారు కూడా "క్వైళాయుధం" (ఇది శ్రీ.శ్రీ. గారిది) అందుకుంటే బావుణ్ణు. మళ్ళీ పంచ పాండవదర్శన భాగ్యం కలిగేది.

వి.ఎ.కె.రంగారావు గారంటే నాకు ప్రాణం. ఆయన నిశిత పరిశీలనా దృష్టిని అభినందిస్తున్నాను. సీరియల్ వల్ల మిగతా శీర్షికలకు చోటు తక్కువ కాకుండా -లోటు రాకుండా చూడండి.

-యన్.కె.రామారావు, నల్లగొండ

మీ "హాసం" పత్రిక చాలా చాలా బాగుంది. ఇలాగే ఉంటూ శతజయంతి చేసుకోవాలని కోరుకుంటున్నాను.

డెభ్భయ్యవ పడిలో ఉన్న నేను 'హాసం' పత్రిక ఎప్పుడు వస్తుందా? అని ఎదురు చూస్తున్నానంటే, ఇంక చిన్నవయసు వాళ్ళ సంగతి చెప్పక్కరలేదు.

'హాసం' రాగానే నా చిన్ననాటి, నాకిష్టమైన పాటలు జోక్సు అన్నిరకాల హాస్యాలతో నామదిలో ఉన్న 'దిగులును' త్రోసి వేసి నా చేతుల్లో ఇమిడి నన్ను నవ్వించి, నా వల్ల ఇంకా కొంతమంది చదివి నవ్వించేలా చేస్తోంది. ఈ పత్రిక ఉంటే ఇంక ఆహారం కూడా అక్కరలేదనిపించింది. ఇంత మంచి పత్రికను ప్రచురిస్తున్న మీ కందరికి ధన్యవాదాలు.

-ఒక సోదరి.

జనవరి 1-15 సంచికలో వంగర గారి గురించి రావి కొండలరావు గారి వ్యాసం బాగుంది. వంగర గారి గురించి నాకు తెలిసిన యింకో హాస్యోక్తి రాస్తాను. "టెక్నిక్" అంటే ఏమిటి? అంటే "ఆ ఏముందీ! టెక్కూ ప్లస్ నిక్కూ" అనేవారట. ఇది వంగరి గారి అల్లుడు (వాళ్లది మా వూరి పక్కవూరే) చెప్పిన విషయం.

-"నిశాపతి"
హైదరాబాద్.

నూతన సంవత్సరంలో ప్రథమ సంచిక 'హాసం'... ఎప్పటిలాగే హాస్య సంగీత లాలలనలతో మమ్ముల నొక, ఊపు ఊపేసింది. "అతి తెలివి తేటల స్పెషల్" హ్యూమర్‌బాక్స్‌లో కడుపుబ్బ నవ్వింపజేశాయి. అవి అందించిన కర్త ఎవరో?! రాజాగారా? ముఖ్యంగా ప్రముఖుల జయంతి... వంటి వాటిని గుర్తెరిగి సందర్భ, సంయమన, సమయస్ఫూర్తిగా స్పందిస్తూ, అందిస్తున్న వారివారి రచనలు అలరింప జేస్తూ, ఆకట్టుకొంటున్నాయి. సరేకానీ, గత పక్షంలో పింగళి, సావిత్రిగార్ల స్మృతుల్ని దరి చేస్తూ, ఆపాతమధురాలు అందించగా, ఈ పక్షం నవయువ క్రేజీ మ్యూజిక్ స్టార్ ఎ.ఆర్.రహ్మాన్ గారి పాటల్ని అందించి, యువతరం గుండెల్లో 'హాసం' సుస్థిర స్థానం కైవసం చేసుకొంది. అయితే... "చికుబుకుచికుబుకురైలే..." పాట "ప్రేమికుడు"లోదికాదు. "జంటిల్‌మేన్"లోది. అందరికీ తెలుసనుకోండి. ఇటువంటి చిన్న పొరపాట్లు 'హాసం' లో రారాదని నా భావన.

మీ
**-నేమాన సుభాస్‌చంద్రబోస్,**
**శ్రీకాకుళం**

అశోక్‌కుమార్ వ్యాసంలో ఎస్.డి.బర్మన్ గురించి చెప్పిన వారు (అశోక్‌కుమార్ కావచ్చు) పొరబడ్డారు. 'మషాల్' (1950)కి పూర్వం చేసిన ఏడు హిందీ చిత్రాలలో దోభాయ్ (1947), 'షబ్‌నమ్' (1949) అన్నివిధాలుగా, విద్య (1948) సంగీత పరంగా ఘన విజయం నిర్మించిన చిత్రాలు. మరింక బొంబాయిలో స్థానం చిక్కక పోవడం ఏమిటి? అతి సాధారణంగా కూడా పోని 'మషాల్' వల్ల చిక్కడమేమిటి?

శాంతారాం ప్రభాత్‌కి తీసిన 21 మూకీలలో ఒకటి మాత్రం సాంఘికం. టాకీలలో పదవదే సాంఘికం. తన సొంత రాజ్‌కమల్ కళామందిర్ పతాకాన మెదటి సాంఘికం డా॥ కొట్నీస్ (1946) ఆ బ్యానర్‌లో ఆరవ చిత్రం. తక్కినవన్నీ పౌరాణికాలు, జానపదాలు, చారిత్రకాలు, భక్తుల గాథలు.

-వి.ఎ.కె.రంగారావు, చెన్నై

సంపుటి :1 సంచిక: 8

16-31 జనవరి 2002

పేజీలు: 76

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 8

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

హైదరాబాదులో ఉస్తాద్ బిస్మిల్లాఖాన్‌కి ఎదురైన చేదు అనుభవం నుండి కొన్ని పాఠాలు నేర్చుకోవలసిన అవసరం ఉంది. సాక్షాత్తూ ముఖ్యమంత్రి వచ్చి ఉస్తాద్‌ని కలిసి పరిస్థితి చక్కబరచడంతో సరిపోయింది కానీ లేకపోతే భారతరత్న బిరుదు పొందిన మహోన్నత కళాకారుడు అవమానభారంతో హైదరాబాదు నుండి మరలవలసివచ్చేది. దీనికి ఎవరు ఎన్ని కారణాలు చెప్పినా ఈ విషాదం మరిచి పోయేది మాత్రం కాదు.

ఇక్కడ గాయపడినది ఒక కళాకారుడి హృదయం, కళాభిమానుల మనోభావాలు! సమాజంలో ఎలా మెలగాలో తెలియకపోతే ఒక కళాకారుడికి ఎటువంటి అనుభవాలు ఎదురవుతాయో మరొక్కసారి చాటిచెబుతోంది ఈ ఉదంతం. కాంట్రాక్టర్లు నాటకాలు ఆడించే రోజుల నుండి ఇటువంటి సంఘటనలు అనేకం జరిగేవి. 'రెండో దుర్యోధనుడిగా ఫలానా సినీ నటుడు' అని ప్రచారం చేసుకోవడం, వాల్‌పోస్టర్లు ముద్రించడం, చివరికి అనుకోని కారణాల వల్ల ఆయన రాలేకపోయారని స్టేజిపై ఓ టెలిగ్రాం చదవడం - ఆయన బదులు స్థానిక నటుడు ఆ వేషం వేస్తాడని ప్రకటించడం! ఇటువంటి సందర్భాలలో ప్రేక్షకులకు ఒళ్లుమండి హాల్లో కుర్చీలు విరక్కొట్టిన సంఘటనలు ఎన్నో! అయినా కాంట్రాక్టర్లు వాళ్ల పద్ధతులు మార్చుకోలేదు.

ఇలాంటి సంఘటనల వల్ల కళాకారులు పెద్దగా ఏదీ నేర్చుకున్నట్టు కనబడదు. చాలా సందర్భాలలో నిర్వాహకులు వాళ్లని సంప్రదించకుండానే, ఎటువంటి ఒప్పందం కుదుర్చుకోకుండానే వాళ్ల పేర్లు వాడేసుకుంటున్నా వీరు అభ్యంతర పెట్టిన దాఖలాలు కనబడవు. ఏదో కొద్దిపాటి అడ్వాన్సు పుచ్చుకుని ప్రదర్శనకు వస్తే, వసూలు చేసుకున్న డబ్బు పట్టుకుని మధ్యవర్తులు ఉడాయించగా ప్రేక్షకుల కోపానికి గురి అయి అష్టకష్టాలు పడ్డ అనుభవాలు చాలామంది కళాకారులకున్నాయి.

ఇంకోరకం స్పాన్సర్లు ఉంటారు. ఫలానా ఊళ్లో, ఫలానా దేశంలో 'మీ పేర నైట్ ఏర్పరచాం రండి' అని సినీతారలను పిలుస్తారు. అక్కడ ఎవరెవరో పరిచయం అయి ఫోటోలు దిగుతారు. తర్వాత కొన్నాళ్లకు ఆ పెద్దమనుష్యులు మరీ పెద్దమనుష్యులు కారనీ, అండర్‌వరల్డ్ తాలూకు డాన్‌లనీ వార్తలు వస్తాయి. దాంతో ఈ సినీమా తారలకూ అండర్‌వరల్డ్‌తో సంబంధాలున్నాయని ప్రచారం సాగుతుంది. ఇక్కడ డబ్బు సరిగ్గానే ముట్టినా ఇమేజి పోతుంది. తర్వాత్తర్వాత చాలాసార్లు చాలామందికి సమాధానం చెప్పకోవలసిన పరిస్థితి కళాకారులకు ఏర్పడుతుంది.

కళాకారుడికి తనదైన ఒక ప్రపంచం ఉంటుంది. చాలా కేసుల్లో అది ఊహా ప్రపంచం. అందుకే చాలా మంది కళాకారులు సమాజంలో ఇమడలేక తాగుబోతులు కావడమో, సమాజాన్ని తృణీకరించడమో ('ప్యాసా'లో 'ఏ దునియా అగర్ మిల్‌భీ జాయేతో క్యాహై' పాట ఈ సందర్భంలో గుర్తుకువస్తుంది) జరుగుతుంది. అటువంటి మనస్తత్వం కలవారు లౌకిక జ్ఞానం ఎలా అలవరుచుకో గలుగుతారు? అలవరుచుకోలేక పోవడం వల్ల వారి మానాన వారు ఇబ్బంది పడితే అదొక దారి. కానీ వారు కళాకారులు కావడం చేత జాతి మొత్తం వారిని తమ ఆస్తిగా, కీర్తిపతాకంగా భావించడం వలన వస్తుంది చిక్కు. అలాభావించి వారి అవమానాన్ని తమ అవమానంగా కళాభిమానులు భావిస్తారు కనుక కళాకారులు తమ కోసం కాకపోయినా అభిమానుల కోసమైనా మరింత జాగ్రత్తగా వ్యవహరించాలి.

ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ ఉదంతాన్ని ఆమూలాగ్రంగా పరిశీలిస్తే ఆయన ఎంత అమాయకంగా వ్యవహరించారో తెలుస్తుంది. ఆయనకు పంపిన ఆహ్వానం అతి కాజువల్‌గా ఉంది. పూర్తి డబ్బు ముందుగా చెల్లించబడలేదు. వసతి సౌకర్యాలపై ముందుగా అవగాహన లేదు. ఆయనను ఆహ్వానించిన ప్రైవేటు సంస్థకు, ప్రభుత్వానికి మధ్య లిఖితపూర్వకమైన ఒప్పందమేదీ లేదు. ముందు అనుకోని షరతులు తర్వాత విధించారని వాదించే పరిస్థితి ఎందుకు రావాలి? ఒక ప్రైవేటు సంస్థ ఇంతమంది కళాభిమానుల మనోభావాలతో చెలగాట మాడగలిగిందంటే, ఆ వీలు కలిగించినందుకు ఆ కళాకారులతో పాటు ఈ వివాదానికి సంబంధించిన వ్యక్తులందరూ కూడా ఆత్మశోధన చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.



# విమానము నోరులోని యంత్రము

**-పరుచూరి గోపాలకృష్ణ**



అడగటం ఆలస్యం...
క్వాలిటీ ఏ మాత్రం తగ్గకుండా
గంటలో కథ రాసెయ్యగల
సత్తా శ్రీ పరుచూరి గోపాలకృష్ణ
గారిది... ఆ సంగతి ఈ కథ
మరోసారి ఋజువు చేస్తుంది.
ఈ కథపై మీ అభిప్రాయాన్ని
పంపవలసిన చిరునామా


**పరుచూరి గోపాలకృష్ణ**
**సినీ రచయిత**
**8-2-293/82/సి-1,**
**ఫిల్మ్‌నగర్, రోడ్ నెం.7**
**జూబ్లీహిల్స్,**
**హైదరాబాద్-500 033.**


పరుచూరి గోపాలకృష్ణ మెప్పపొందిన ఉత్తరాన్ని తరువాత సంచికలో ప్రచురించటమే కాక ఆ లేఖ పంపినవారికి ఆరు నెలల పాటు 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతాం.

ఆ రోజు అలసిపోయి ఇంటికి వచ్చాను. సామాన్యంగా గేటుదాటి అడుగు గుమ్మంలో పెట్టేలోపే "కాఫీ తాగుతారా" అని అడుగుతుంది మా ఆవిడ... అదే 'హాసం' మొదటి సంచిక ద్వారా మీకు తెలిసిన బుజ్జి. అలా అడగడంలో నా మీద అభిమానం కంటే కాఫీ మీద ఆమెకు ప్రేమ ఎక్కువన్న సంగతి నాకు తెలిసినా తెలియనట్లు నటించి 'అలాగే' అంటాను.

అసలు విషయం ఏమిటంటే ఇలాంటి పర్సనల్ విషయాలు పదిమందిలో చెప్పకోగూడదు గాని, ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు ఎనిమిది మంది భార్యలను కట్టుకుంటే ఆ ఎనిమిది గుణాలూ వున్న ఒకే ఒక్క భార్యను ఈ గోపాల కృష్ణుడు కట్టుకున్నాడని నా నమ్మకం. నేను ఏదయినా భరించగలను కానీ మా ఆవిడ అలిగి మాట్టాడకుండా వుంటే భరించలేను. అందుకే నా ఫీలింగ్స్‌ని దాచేస్తూ వుంటాను.

ఇంతకు చెప్పొచ్చేదేవిటంటే ఆ రోజు నేను గుమ్మం దాటి లోపలికి వచ్చినా 'కాఫీ' మాట ఎత్తలేదు. పుట్టిన రోజు దగ్గరకు వస్తోంది. నాతో ఏదో ఒకటి కొనిపించడానికి సీను స్టార్ట్ చేస్తోందా అని అనుమానం వచ్చింది. సీరియస్‌గా టి.వి. చూస్తోందామె.

"ఏంటీ సీరియస్‌గా వున్నావ్. ఏవన్నా బ్యాడ్ న్యూస్ విన్నావా?" అన్నాను అటునుంచి నరుక్కు వద్దామని.

"ఇంగ్లీష్ క్లాసు అయ్యిందా?" అంది.

"ఎనిమిదింటికి అయిపోతుంది. ఎనిమిది పదికి ఇంట్లో వున్నాను" అన్నాను.

(ఈ మధ్య నేను ఇంగ్లీష్ నేర్చుకుంటున్నాను లెండి. అంటే అసలు రాదని కాదు. మాకు 'పరుచూరి బ్రదర్స్' అని పేరు పెట్టి ఆ పేరు ద్వారా ఈరోజు తింటున్న అన్నం పెట్టిన అన్నగారి జ్ఞాపకార్థం ఒక పుస్తకం ఇంగ్లీషులో రాయాలని సంకల్పం. నేను తెలుగులో వ్రాసేస్తే మాకు ఇంగ్లీష్ నేర్పుతున్న హనుమంతరావుగారు నాలుగు రోజుల్లో ట్రాన్స్‌లేట్ చేసి ఇస్తారు. కాని ఆయనే సలహా ఇచ్చారు. మీ ఇద్దరి అనుబంధం రాష్ట్రం మొత్తానికి తెలుసు మీ గుండె లోతుల్లో నుండి వచ్చే ఆ మాటలు మీ మాటలయితేనే బాగుంటుందని. అందుకే రోజూ రాత్రి ఏడు గంటల నుంచి ఎనిమిది గంటలవరకు ఇంగ్లీష్ నేర్చుకుంటున్నాను. ఆ పుస్తకం రాయడం ఆవిడక్కూడా మహాఇష్టం)

"ఫెడరేషన్ పనులు పూర్తయ్యాయా?"

ఏంటో కత్తులు నూరుతోంది. ఈ మధ్య మా చలన చిత్ర కార్మిక సమాఖ్య వాళ్ళు నన్ను ఏకగ్రీవంగా అధ్యక్షుడిగా ఎన్నుకున్నారు. అప్పట్నించీ ఆవిడకోసం కేటాయించిన గంటల్లో కూడా నేను ఆవిడకు అందుబాటులో వుండడం లేదు. అయినా మార్క్సిస్ట్ నాయకుడి కూతురు కాబట్టి కార్మికుల కోసం కష్టపడడం ఇష్టమే. ఏ రూట్‌లో వస్తుందో అర్థం కావడం లేదు. "పొద్దున్న ఫోన్‌లో చెప్పేసాగా... శివకృష్ణ, కల్యాణ్ చూసుకుంటారు" అన్నాను.

"సిట్టింగ్‌లు అయిపోయాయా...?"

ఈ మధ్య కొంచెం బిజీ ఎక్కువై రోజుకి రెండు మూడు సిట్టింగ్‌లకు వెళ్ళాల్సి వస్తోంది. ఏంటీ అన్నీ అయిపోయినాయా అని అడుగుతోంది కొంపదీసి ఏదైనా దుర్వార్తా?

"అన్నీ అయిపోయినయ్‌గాని... ఏంటి కొశ్చిన్ మీద కొశ్చిన్ వదులుతున్నావ్.... ఎవరన్నా పోయారా?"

"నా పరువు పోతోంది" అంది సీరియస్‌గా.

"నీ పరువా....? ఎవరు తీస్తున్నారు?"

"మీరే"

"నేనా"

"లేకపోతే ఏంటి 'హాసం' రాజాగారు ఇప్పటికి అరవై సార్లు ఫోన్ చేసారని వందసార్లు చెప్పాను. ఆయనతో మాట్లాడారా?"

"అరె మరిచిపోయానోయ్"

"మీకేం మీరు తేలిగ్గా చెప్పేస్తున్నారు. ఆయన ఏమన్నారో తెలుసా.... ఇందాక... ఏవనుకోవద్దమ్మా.... అసలు మీరు ఆయనకు నిజంగా చెబుతున్నారా అని అడిగారు. అక్కడికి మీరు మంచివాళ్ళు నేను చెడ్డదాన్ననేగా".

"ఛ ఛ ... అదేం కాదు. నేనిప్పుడు ఫోన్ చేస్తాను"

"చేసినప్పుడు మా ఆవిడ వందసార్లు చెప్పింది, నేనే మరిచిపోయాను అని చెప్పండి" అంది సీరియస్‌గా.

"అలాగే" అని ఫోన్ అందుకుని చెయ్యిబోయి పెట్టేసాను.

"అదేంటి... మళ్ళీ ఏమొచ్చింది" అంది సీరియస్‌గా.

"అదే ఆయన కథ అడుగుతున్నారు... ఇన్నిసార్లు ఫోన్ చేసిన మనిషికి హలో చెబితే ఏం బాగుంటుంది ప్లాటు దొరికింది అని చెబితే సంతోషిస్తాడు" అని ఆలోచించడం మొదలెట్టాను.

"కాఫీ తాగుతారా?" అంది.

"ఆ పని చెయ్... మెదడుకి ఈ లోపు నేను కొంచెం మేతవేస్తా.... కాఫీ కుడితిలాగా పోస్తే ఏదో ఒక ప్లాటు అందకపోదు" అని టి.వి. చూస్తున్నాను.

"ప్లాటు ఆలోచిస్తానని మళ్ళీ టి.వి.చూస్తారేంటి" అని కట్టేయబోయింది. సెప్టెంబరు 11వ తారీఖున డబ్ల్యు.టి.సి.ని విమానం కొడుతున్న దృశ్యం కనిపిస్తుండగా టి.వి. కట్ చేసింది.

"ప్లాటు దొరికింది" అన్నాను.

"ఏది బడితే అది రాయబోకండి. 'హాసం' ఫారిన్‌లో కూడా చదువుతున్నారంట".

"లేదు లేదు... అద్భుతమైన ప్లాట్ దొరికింది".

"ఈసారి దేనిమీద రాస్తున్నారు?"

"విమానం మీద"




"సరిపోయింది మొన్న కుక్క మీద... ఇవాళ విమానం మీదా!?"

"అవును అది కుక్క విశ్వాసము గల జంతువు. ఇది - విమానము నోరులేని యంత్రము"

"ఏంటీ... హాసానికి కథా...? అయిదో తరగతి పిల్లలకి పాఠమా?"

"నువ్వెళ్లి కాఫీ తీసుకురా... ఈ లోపు నేను ఆలోచించుకుంటాను" అన్నాను.

"ముందు రాజాగారికి ఫోన్ చెయ్యండి" అంటూ వెళ్ళింది.... ఫోన్ చేసాను.

"హలో నేను పరుచూరి గోపాలకృష్ణ"

"అమ్మయ్య" అన్నారు రాజాగారు.

"అదేంటండి బాబూ... దొంగ దొరకగానే పోలీసోడు అన్నట్లు, కనిపించని వస్తువు కనిపించగానే పిల్లాడు అన్నట్లు 'అమ్మయ్య' అన్నారేంటి?"

"అమ్మో.... అయ్యో అనవలసిన వాణ్ణి... మీరు దొరికారు గనుక 'అమ్మయ్య' అన్నాను... ఇంతే".

"ప్లాటు దొరికింది"

"ఇకనేం ఇల్లు కట్టేయండి"

"చెప్పనా"

"వద్దు మహానుభావా.... మీకేవన్నా రాయడం కొత్తా... ముందు రాసెయ్యండి" అన్నారు రాజాగారు.

పొగలు కక్కుతున్న కాఫీ తెచ్చిపెట్టింది బుజ్జి.

ఆ పొగల్లో నుండి నాకు విమానం పొగలు కనిపించాయి.

***

అతని పేరు కుటుంబరావ్. పేరుకి తగ్గట్లు పెద్ద కుటుంబమే. అయిదుగురు కూతుళ్ళు కాపురానికి వెళ్ళిపోయారు.

ఆరో కూతురికి కూడా పెళ్ళి చేసేసాడు.... కాపురానికి పంపించటమే మిగిలి వుంది.

అంటే ఆ కాపురం ఆషాడమో, శూన్యమాసమో మూలంగా ఆగలేదు...

వరకట్నం మూలంగా ఆగింది.

పాపం కుటుంబరావ్ అనుకున్నట్లు అనుకున్నవన్నీ ఇచ్చాడు కాని పెళ్ళి కొడుకు మోటారుబైక్ కొనిమ్మని అడిగాడు. కొనిచ్చే పరిస్థితి లేక కుటుంబరావు చేతులెత్తేసాడు. కూతురు పుట్టింట్లోనే వుండి పోయింది. అల్లుడు అతని ఇంట్లోనే వుండిపోయాడు.

పాపం ఒకప్పుడు వెంకటగిరి ప్రాంతంలో ఎవరన్నా గట్లు మీద నిలబడి కుటుంబరావ్‌ని 'మన పొలాలు ఎక్కడిదాకానండి' అంటే "అదిగో దూరంగా తాటి తోపు కానొస్తుందే... అడదాకా" అని కొంచెం గర్వంగానే చెప్పేవాడు. ఒక్కొక్క కూతురు పెళ్ళిపీటల మీదకు ఎక్కడం ఒక్కొక్క చెక్క అతని పేరునుంచి మారి పోవడం జరిగింది. ఇప్పుడు ఆఖరి కూతురికి ఇచ్చేయగా పదెకరాలు మిగిలి వుంది. పెళ్ళి అప్పు వేరే వుంది.

అలాంటి కుటుంబంలో ఈరోజు ఎంతో ఉత్సాహంగా వుంది. ఎందుకంటే వాళ్ళ అల్లుడు వస్తున్నానని కబురు చేసాడు. కామాక్షి కుటుంబరావు కూతురు. వెంకట్రావ్ భార్య. పెళ్ళయిన ఇన్నాళ్ళకి వస్తున్నానని కబురు చేసే

సరికి మైసూర్ శాండిల్ సబ్బు మొత్తం అరిగిపోయేదాకా స్నానం చేసి, కళ్ళకు కాటుక పెట్టుకుని ముఖానికి దట్టంగా పౌడర్ రాసుకుని, నుదుట తిలకం దిద్ది, వాలు జడలో మంచి వాసన వస్తున్న మల్లెపూలు పెట్టి క్షణానికోసారి గుమ్మం దగ్గరకు వస్తోంది.

ఈ ప్రపంచంలో ఏ వ్యక్తికయినా తనను చిన్నచూపు చూస్తే కోపం వస్తుంది. అదేంటోగాని మన భారతదేశంలోఆడపిల్లలకి పెళ్ళి పీటల మీద నుంచి లేవబోయిన మొగుణ్ణి చూసినా, పెళ్ళయ్యాక కట్నం ఇవ్వలేదని ఏడిపించే భర్తను చూసినా కోపం రాదు. అందుకు వారికి పాదాభివందనం చెయ్యాల్సిందే.

ఎన్ని మహిళా సంఘాలు గొంతెత్తి అరిస్తే మాత్రం బాధితురాలయిన మహిళ గొంతెత్తనిదే ఈ వరకట్న సమస్య తీరుతుంది?

అల్లుడి మీద కుటుంబరావు కోపం తెచ్చుకోలేదు. ముద్దుగా పెంచుకుంటున్న ఎర్ర పుంజుని కసక్కున మెడకోసి తన కూతురి కాపురానికి తగిలిన దిష్టి తీసి, మసాళా దట్టించి వేయించి, గారెలు కూడా వండిస్తున్నాడు. అతని ఇల్లాలు మహాలక్ష్మి ఇన్నాళ్ళకి కూతురు బతుకు కడతేరుతున్నందుకు "ఊరు కొన్నంత" ఆనంద పడిపోతూ వంట చేస్తోంది. అందరి చూపులు ఏదో ఒక సమయంలో ఇంటి ముందున్న రోడ్ మీదే వున్నాయి.

డగడగ సౌండ్ చేస్తూ.... కొత్త మోటారు సైకిల్ మీద అల్లుడు వెంకట్రావ్ వస్తున్నాడు.

"ఏమేవ్ అల్లుడు వస్తున్నాడు... నీళ్ళు పట్రా"

"ఉదయాన్నే పెట్టిన ఆ గుమ్మం ముందే గంగాళంలో నీళ్ళు అల్లుణ్ణి చూసిన సంబరంలో నీళ్ళు కానొస్తున్నట్లు లేదా" అంది మహాలక్ష్మి.

తనూ సంతోషపడుతూనే కామాక్షి పరిగెత్తుకుంటూ వెళ్ళి అద్దంలో మరోసారి ముఖం చూసుకుని మళ్ళీ పరుగెత్తుకుంటూ వచ్చి గుమ్మం దగ్గర నిలబడింది.

మోటారు సైకిల్ వచ్చి ఆగింది.

ఓరగా తలుపు చాటునుంచి చూసింది.

మనసు మంచిది కాదు గాని సినిమాల్లో ఈరో లెక్కనుండాడు అనుకుంది. అమ్మో మొగుడి మనసు మంచిదిగాదు అని అనుకోగూడదు. అని మనసులోనే చెంపలేసుకుంది... పెళ్ళినాటి కంటే కొంచెం ఒళ్ళు చేసాడు అనుకుంది.

చెంబుతో తనే నీళ్ళు ముంచి "దా అల్లుడూ... చాన్నాళ్ళకి మా మీద దయ కలిగింది. దా కాళ్ళు కడుక్కో' అన్నాడు కుటుంబరావు.

"వచ్చింది కాళ్ళు కడుగుకోటానికి, కాపురం చెయ్యటానికి కాదు" అని పెడసరంగా సమాధానం చెప్పేసరికి దింపుతున్న కూరచట్టి చురుక్కున కాలింది మహాలక్ష్మికి... 'అమ్మా' అంది వాళ్ళమ్మను తలచుకుంటూ.

"ఇది చూసినావా కొత్త మోటారు సైకిల్... మా రెడ్డి దగ్గర అప్పు చేసి కొన్నా. నలభై మూడు వేల ఆరు వందల యాభై రూపాయలు. ఏ రోజు కడితే ఆ రోజు ఇదే బండి మీద నీ ఇంటికి వచ్చి నీ కూతుర్ని మా ఇంటికి తీసుకువెళ్తా".

"అది కాదల్లుడూ"

"వద్దు... చెప్పుకుంటే దేశంలో వుండే వంద కోట్ల జనానికి ఎవడి ఇబ్బంది వాడికుంటుంది.... నా ఇబ్బంది నాది".

"అట్టా కాదల్లుడూ పదెకరాల చేను ఈ ఏడు దిష్టి తగిలేంతగా పెరిగింది. ఎకరానికి ముప్పై బస్తాలు కాడికవుతాయ్. అప్పు మెల్లగా తీర్చుకుంటా... కోత కోసి, కుప్ప నూర్చి అట్టనే అమ్మేసి ఆ డబ్బు పట్టుకొచ్చి ఇస్తా.... నా గౌరవం దక్కించు".

"అక్కర తీరగానే అల్లుడు అడ్డగాడిదతో సమానం అని నేను చదువుండాన్లే మావా... ముందు పైకం పంపు ఆ తర్వాతే గదిలో గెడేసేది." అని మోటారు సైకిల్ తిప్పుకుని వెళ్ళిపోయాడు. ఏడుస్తున్న కామాక్షిని అక్కున చేర్చుకుంది మహాలక్ష్మి. దింపి వచ్చిన చట్టిలో వున్న కోడి మాంసం కుక్క ఆనందంగా బొక్క సాగింది.

* * *

బరువుగా చేనువంక నడిచి వస్తున్నాడు కుటుంబరావ్. "ఏంది కుటుంబరావు... చేను తెగ దిగబడి ఇవ్వబోతుంటే మొఖం అట్టా ఏల్లాడేసేవేంది? కొంచెం నవ్వు" అన్నాడు సుబ్బారెడ్డి.

"ఏంది నవ్వేది తడిక ... మొత్తం పంటంతా అల్లుడు కాజేయడానికి జూస్తాండుగదా.... ఇక ఈనకి బొక్కేదే దక్కేది" అన్నాడు రామిరెడ్డి అంటూ వుండగా పై నుంచి ఒక విమానం బాగా కిందగా ఎగురుతోంది.

"ఇదేంది రెడ్డి... ఇమానాలు దిగేది తిరపతిలో గదా మన ఎంకటగిరి పొలాల మీద దిగే మాదిరి వస్తావుండాదేందని" అంటున్నాడు.

ఇంతలో ఇంకా కిందకు వచ్చేసింది.

చుట్టుపక్కల పొలాల్లో వాళ్ళు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

కుటుంబరావు చేల్లో లాండవుతోంది... విమానం...

"అమ్మో నా చేను" అంటూ పరిగెత్త బోయాడు.

"ఓరి నా పాసుగూల! అదేవన్న సైకిల్ బండనకున్నావా ఇమానమయ్యా" అంటూ అరిచాడు.

విమానం క్రాష్ లాండింగ్ అయ్యింది... మొత్తం పంటంతా నాశనం చేసుకుంటూ...

హడావుడిగా డోర్లు తెరిచారు. అందులో నుంచి కొంతమంది దిగుతున్నారు.

'ఓ ... ఇమానం ఇమానం' అంటూ చుట్టు పక్కల నుంచి వేల మంది పరుగెత్తుకుంటూ వచ్చేసారు.

కొన్ని వేలమంది పాదాల కింద పడి ధాన్యం... మనుష్యులు తినే అన్నం మట్టిలో కలిసి పోతోంది... "నా చేను" అని రాబోతున్న కుటుంబరావ్‌ని నెట్టేస్తున్నారు.. దిగే వాళ్ళలో సినిమా వాళ్లున్నారు... రాజకీయ నాయకులున్నారు.

తెరమీద కనిపిస్తే ఈల వేసినట్లు సినిమా వాళ్ళను చూసి ఈలలు వేస్తూ.. డ్యాన్స్‌లు చేస్తున్నారు జనం. కొందరయితే అప్పటికప్పుడే డప్పులు కొట్టుకుంటూ వస్తున్నారు. వాళ్ళ కళ్ళ ముందు వాళ్ళు అభిమానించే దేవుళ్ళు కనిపిస్తున్నారు. దేవతలు కనిపిస్తున్నారు. వాళ్ళు యముడి సింహద్వారం దాకా వెళ్ళి తిరిగివచ్చారని వీళ్ళకు తెలియదు.

కుటుంబరావ్‌కి మాత్రం కూతురి చెంగు నుంచి తెగిపోతూ వున్న అల్లుడి బ్రహ్మముడి కనిపిస్తోంది. తీసి గూట్లో పెట్టేస్తున్న తాళి బొట్టు కనిపిస్తోంది. తగలబడిపోతున్న శుభలేఖ కనిపిస్తోంది... అలాగే కుప్పకూలి పోయాడు.

****

ఆ తర్వాత చాలా నెలలు గడిచిపోయాయి....

విమానం దింపిన పైలెట్‌కి సన్మానం జరిగింది.

కుటుంబరావ్ నష్టపరిహారం కోసం ఆఫీసుల చుట్టూ తిరుగుతున్నాడు.

విమానంలో ఇంపార్టెంట్ పార్ట్స్ అన్నీ తీసుకువెళ్ళిపోయారు.

రెక్కలు తెగిన పక్షిలా అక్కడే పడి వుంది.

ఎంక్వయిరీ ఇంకా పూర్తి కాలేదు.

మళ్ళీ కుటుంబరావ్ ఆఫీసుకు వెళ్ళాడు.

"నువ్వే కుటుంబరావ్ అనీ... ఆ చేను నీదేననీ మాకు గ్యారంటీ ఏవిటయ్యా?"

"నేనే సార్"

"రేషన్ కార్డుందా"

"లాగేసుకున్నారు సార్"

"నేనేం చెయ్యలేను. నువ్వే కుటుంబరావ్ అని కలెక్టర్ ఆఫీసుకెళ్ళి లెటర్ తీసుకురా... ఆ చేను నీదేనని సబ్ రిజిస్ట్రార్ ఆఫీసు నుంచి దస్తావేజు లెటర్ తీసుకురా... విమానం దిగినప్పుడు నీ చేను పంట మీదే వుంది అని మీ వూరి ఎం.ఆర్.ఓ. దగ్గర నుంచి లెటర్ తీసుకురా..." అంటూ డజను లెటర్లు తెమ్మన్నాడు.

ఒకతను పక్కగా వచ్చి మెల్లగా... "ఇవన్నీ తేలేకపోతే పది వేలు లంచం తీసుకురా" అన్నాడు.

అసలే సగం తెలివున్న కుటుంబరావు మెల్లగా ఇంటికి బయలుదేరాడు.

***

ఇంటికి వచ్చేసరికి ఇంటి ముందు జనాలు మూగి వున్నారు. కుటుంబరావు అదిరి పడ్డాడు.

కొంపదీసి కూతురేం అఘాయిత్యం చేయలేదు కదా...

అనుకుంటూ వస్తుండగా "హిహిహి" అని నవ్వుకుంటూ పరుగు తీసింది కామాక్షి....

"ఏవయ్యింది" అన్నాడు భయంగా, అనుమానంగా.

"నీ అల్లుడు ఇంకో పెళ్ళి చేసుకున్నాడంటయ్యా. ఆ వార్త విని నీ కూతురు పిచ్చిదైపోయింది" అంటూ బావురుమంది.

కామాక్షి పరుగుతీస్తోంది.

పరుగెత్తి

పరుగెత్తి...

పరుగెత్తుకుంటూ చేను దగ్గరకు వచ్చింది.

"అయ్... విమానం... ఓయ్ విమానం..." అని ఎండిపోయిన చేలో డాన్స్ చేసింది. అక్కడే కొందరు పిల్లలు విమానం ఎక్కి ఆడుకుంటుంటే.... "రేయ్ దిగండి... ఇది నా విమానం. దీన్ని నా తాళి బొట్టు పెట్టికొన్నా... దిగండి" అని గసిరింది.

"ఇమానమా ఇమానమా నా కాపురం ఎందుకు చెడిపోయింది!?" అని అడిగింది....

***

ఏం సమాధానం రాయాలో తెలియక పెన్ను పక్కన పెట్టాను.

"అయిపోయిందా" అని అడిగింది బుజ్జి

"ఆఖరి పేజి రాయాలి" అన్నాను.

"ముందు నాకు థాంక్స్ చెప్పండి"

"ఎందుకు"

"ఇందాక నేను టి.వి కట్టేసిప్పుడు విమానం వచ్చి బిల్డింగుల్ని గుద్దే సీను చూసారు. అదే కథగా రాసారు గదా"

"లేదు" అని రాసిన కథ చెప్పాను.

"అప్పుడలా జరిగిందా?"

"కథలెప్పుడూ జరగవు... జరిగినట్టు రాస్తాం"

"అప్పుడు మీ అన్నయ్య కూడా వున్నారుగా అందులో... అడగండి"

"ఇప్పుడు తను కాశీలో వున్నాడు... చిరంజీవి గారి సినిమా షూటింగ్‌కి వెళ్ళాడు. కథ పూర్తి చేస్తే రాజా సంతోషిస్తాడు."

"నాకు పుట్టినరోజు నాడు పాతికవేలు గిఫ్ట్ ఇస్తానంటే ముగింపు చెబుతాను"

"సరిపోయింది... బ్లాక్‌మెయిలింగా?"

"లేదు... ఒక్కోసారి మీకు తట్టనివి నాకు తడుతూ వుంటాయి కదా"

"అలాగేలే చెప్పు..."

ఆవిడ ఇలా చెప్పింది...

"పిచ్చి కామాక్షి ఇంకా అడుగుతూనే వుంది విమానాన్ని. ఈ నాటికీ అడుగుతూనే వుంది

'నా కాపురం చెడిపోటానికి కారణం ఎవరు?' అని. ఆ పిచ్చి తల్లికి తెలియదు విమానానికి నోరుండదు, అది నోరు లేని యంత్రం ...

వుంటే...

దీనికి కారణం అందులో ప్రయాణీకులా?

దాన్ని తోలిన పైలట్లా?

నష్టపరిహారం అందించని ప్రభుత్వమా? పిచ్చి ఆనందంలో పంటను మట్టిలోకి తొక్కేసిన ప్రజానీకమా? అని అడిగితే.

"కాదమ్మా... వరకట్నం నిషేధింపబడిన ఈ దేశంలో అధిక కట్నం ఇవ్వలేదని నిన్ను వదిలేసి ఇంకో పెళ్ళి చేసుకున్న నీ మాజీ మొగుడిదీ" అని చెప్పివుండేది.

"థాంక్స్ బుజ్జీ గొప్పగా చెప్పావ్"

"నేనెప్పుడూ అలాగే చెబుతా.... మీరే అర్థం చేసుకోరు. బంగారం కొంటానికి బయలు దేరుదామా?"

"అవును... విమానం నోరులేని యంత్రం"

****

(ఈ కథ జరగలేదు. అంతా కల్పితమే. ఇది ఎవర్ని నొప్పించటానికి, వొప్పించటానికి రాసింది కాదు.. కేవలం హాసం పాఠకులను మెప్పించటం కోసం మాత్రమే....)

-పరుచూరి గోపాలకృష్ణ

## జస్ట్ ఫర్ ఫన్



శ్రీనివాస శిరోమణి, అతడి భార్యామణి ఎప్పట్లాగే ఆ రోజు కూడా పోట్లాటేసుకున్నారు. ఇద్దరి మధ్య తీవ్ర స్థాయిలో ఘర్షణ జరిగింది.

శిరోమణి ప్రాణం విసిగిపోయి, మోకాళ్ల మీద కూలబడి, రెండు చేతులూ పైకెత్తి, శూన్యంలోకి చూస్తూ, 'దేవుడా! నన్ను తొందరగా తీసుకుపో' అని గావుకేక పెట్టాడు.

భార్యామణి కూడా పతిదేవుడి అడుగుజాడల్లో అవే విన్యాసాలు చేసి "దేవుడా! నన్ను కూడా తీసుకుపో" అంటూ ఓ కేక పెట్టింది.

శిరోమణి అర్జెంటుగా నిలబడి, రెండు చేతులూ జోడించి, కళ్ళు మూసుకుని "దేవుడు సార్! నా విషయం పెండింగులో ఉంచి ముందు ఆవిడ మొర ఆలకించండి స్వామి" అని ప్రార్థించాడు బహుభక్తిగా.

-గోపి



# 16-31 డిసెంబరు 2001లో శ్రీ చింతపల్లి రమణ రాసిన

# కిచెన్‌కిట్  కథకు వచ్చిన స్పందన

అభిమాన రచయిత

చింతపల్లి రమణగార్కి నమస్సుమాలు. అభిమాన పాఠకులకోసం 'హాసం' పత్రిక ప్రముఖ సినీ కథా రచయితలచే ప్రత్యేకంగా కథలు రాయిస్తుందని అర్థమైన మరుక్షణం... ఆ పరంపరలో మా అభిమాన రచయితే హాసంలో నవ్వుల పువ్వులు పూయిస్తాడన్న ఆలోచన అద్భుతంగా తోచింది. అది మొదలు... ఎదురు తెన్నులు...! ఫలించాయి. ఆశ నిరాశ కాలేదు...!!! అభిమానం అనిర్వచనీయమైన భావమై పురికొల్పగా మిమ్మల్ని పలకరించి 'కిచెన్‌కిట్' అభిప్రాయాలను మీతో పంచుకోవాలన్న ఆశతో ఈ ఉత్తరం.

"నవ్వుతూ బతకాలిరా" అంటు ఆసక్తిరేపి చక్కనైన పసందైన శైలిలో పదాలగారడి చేసి నవ్వుల జల్లులు కురిపించారు. సున్నిత హాస్యాన్ని రంగరించిన సరితప్పని మాటలతో యదార్థాలను ఎరుక చేసి చురకలంటించారు. భుజాలు తడుముకునేలా చేసారు.

ఆడాళ్ళ 'మాటా-మాటా' కయ్యాన్ని 'దెబ్బకు దెబ్బ, ప్రాణానికి ప్రాణం' లెవెల్లో కలరిచ్చి వారి తిట్ల పురాణాన్ని పూర్తిగా విప్పిచెప్పక - చెప్పినట్లుగా క్లుప్తంగా సీనిదని చెప్పినతీరు చాలాబాగుంది. అదేరీతిగా రాంబాబు చిన్నపెద్దమెదడులోని అయిడియాలను అల్లరిగా వాడిబాబు ఓల్డు బ్లేడు గోడుని - కుంజన తగవులీలని పట్టు సడలనీక కొనసాగించి ఆద్యంతం నవ్వుల మయం చేసారు.

ఆపై రాంబాబు కుర్ర చేష్టలతో ఊపందుకున్న కథ ఊహించని మలుపు తిరిగి కాంచన వ్యవహారం, వరకట్నం సమస్యలతో భారంగా నిట్టూర్చేలా చేసిన చివరకు యం.బి.బి.యస్ పెద్దమనిషితో ఫక్కుమనేలా చేసారు - హ్యాట్సాఫ్.

కళ్ళు అక్షరాల వెంట పరుగు తియ్యగా - పసందుగా, విందుభోజనమారగించినంత తృప్తిగా చకాచకా ముగించేసి, అయ్యో... అప్పుడే అయిపోయిందేమిటా అని - తనివితీరక మళ్ళీ... మళ్ళీ మొదటికొచ్చేసాను.

అభిమాన రచయితచే అద్భుతమైన కథ రాయించిన 'హాసం'కు కృతజ్ఞతలు.

ఇలాగే! ఇంకా... ఇంకా.... మీ హాస్య రచనలను హాసంలో ఆశిస్తూ

ఇట్లు
మీ అభిమాని డి.నర్సింహ్మారావు,
గొల్లపల్లి, మం: దేవరకొండ, జి: నల్లగొండ.

చింతపల్లి రమణగారికి ముందుగా
నూతన సంవత్సర శుభాకాంక్షలు.

16-31 డిసెంబర్ హాసం పత్రికలో మీరు వ్రాసిన 'కిచెన్‌కిట్' కథను చదివి నేను హాస్యాన్ని ఆనందంగా ఆస్వాదించాను. తనకు తెలియకుండానే కథలోని రాంబాబు పాత్ర పేల్చే 'బాంబు'లకు బలై విలపించే కథా పాత్రలను చాలా సహజసిద్ధంగా మలిచారు.

కథ ప్రారంభంలో వచ్చే 'నవ్వుతూ బతకాలిరా' అని ఎవరైనా అంటే ఎందుకు 'పక్కవాడి ఏడుపు చూసా' అని ప్రశ్నించే రాంబాబు మాటకు 'నీ కళ్ళకు నేను కబురుపెడితే వచ్చే దాన్లా కనపడుతున్నానా' అని కుంజన పాత్ర అన్నప్పుడు రాంబాబు 'బాబు' "కబురుపెట్టక పోయినా వస్తావా' అని అన్నప్పుడు నవ్వును ఆపడం నా వల్ల కాలేదు. కథలో 'టైటిల్ రోల్' అయిన రాంబాబు చేసే రీసెర్చిలను ఫ్రెండ్స్ ఎగతాళి చేయడం అర్జంటుగా అమ్మాయిని ప్రేమించాలని రాంబాబు నిర్ణయించుకోవడం ఆ కారణంగా అమ్మాయికి ఆశయాలకు ఆటంకం ఏర్పడటం ఆ విషాదానికి రాంబాబు కారణం కావడం కథలోని సెంటిమెంట్‌లో కూడా హాస్యం క్లిక్ చేయడం అభినందనీయం. 'కిచెన్‌కిట్'లో రాంబాబు పాత్ర ద్వారా బాధలకు సరైన వారికి మేలు చేయాలని రాంబాబు తయారుచేసిన 'కిచెన్‌కిట్' ఫార్ములా ద్వారా కూడా రాంబాబు వ్యక్తిత్వ లక్షణాలను చిత్రీకరించడం కూడా బాగా సరిపోయింది. కథ చదివిన తరువాత నాకు. రాంబాబు కన్నా 'రాంగ్ బాబు' అని పెట్టుంటే బావుణ్నిపించింది. చివరిగా మీ కలం నుండి ఇలాంటి హాస్య రసగుళికలు మరిన్ని జాలువారాలని ఆశిస్తున్నాను.

**-షేక్ మహ్మద్ అలి, రాజమండ్రి**

కొన్ని కథల పేర్లు చూడగానే విషయం ఇదయి వుండచ్చు అని చూచాయిగా తెలిసిపోతూ వుంటాయి. కాని హాసం 16-31 డిసెంబరు సంచికలో శ్రీ చింతపల్లి రమణగారికి 'కిచెన్‌కిట్' మాత్రం చివరవరకూ ఎక్కడా వ్యక్తీకరించబడని సస్పెన్స్ (విషయ పరంగా) కలిగి ఆసక్తి కలిగించింది.

ప్రారంభంలోనే రచయిత "నవ్వుకు దూరంగా ఏడుపుకు దగ్గరగా ఏడిపిస్తూ బ్రతికాడు'' అంటూ రాంబాబు పాత్రను పరిచయం చేసి పాఠకులను ఆకట్టుకొంటాడు. యుకేజీ-కొబ్బరిలౌజ్, కొన్నాయన ఉష్ అని ముద్దుగా - కన్నావిడ ఉష్ అని నిట్టూర్పుగా అంటూ ప్రాస ప్రయోగాలతో తన రచనను పాఠకులు చివరంటూ చదివేలా చేసుకొంటాడు. రాంబాబు జీవితాన్ని యౌవనదశ వరకూ నాలుగు ముక్కలు చేసి నాలుగు సందర్భాలు సృష్టించి అనునిత్యం మనం చూస్తున్న, వింటున్న అంటున్న విశేషాలు (బుష్, లాడెన్ ఇత్యాదివి)తోనే అతి చాకచక్యంగా ఓ ప్రక్క కథ చెబుతూనే మరొక ప్రక్క తనదైన హాస్య రసాన్ని గుప్పిస్తాడు రచయిత. వాడుకలో వున్న విశేషణాలు (నరం లేని నాలుక, నిప్పులు మీద చిందులు తొక్కడం కొళాయి దగ్గర రభస, అసెంబ్లీలాగా) సందర్భోచితంగా వాడుకొంటూ తన రచనకు మేకప్ చేస్తాడు.

అలా అని రచయిత పూర్తిగా హాస్యం మీదే ఆధారపడ్డాడా అంటే సామాజిక, రాజకీయ, ఆర్థిక, పారిశ్రామిక, విద్యారంగ, కార్మిక రంగాల అంశాలు కూడా అంతర్లీనంగా కనపడి చదువరులను అబ్బురపరుస్తాయి. కొన్ని అద్భుత పద ప్రయోగాలు (ఉషని కొన్నాయన - కట్నం మీద, అనాదిగా వస్తున్న ఆచారం - అప్పుమీద, అతన్నికన్నావిడ (వెనుకటి తరం మీద, అసెంబ్లీ లెవల్లో.... రాజకీయ, సాంఘిక పరిస్థితుల మీద) మనను బాగా ఆకట్టుకొంటాయి.

చివర్లో మనిషి సృష్టించిన వేర్వేరు పరికరాలు ఆకాశంలో సగానికి (మహిళలకు) ఎలా కన్నీటి ఆయుధాలు అయ్యాయో చెబుతూ వాటి సరసన తన కిచెన్‌కిట్ నుంచడానికి రాంబాబుకు యిష్టపడలేదు అంటూ "చలం ఆడదానితో బాపు సీతతో పినిసెట్టి పల్లె పడుచులో'' వంటి ప్రయోగాలతో తన రచనకు పదహారణాల తెలుగు తనాన్ని మెరుగులద్దుతాడు. రచయిత.

ఆ 'రమణ' గారి బుడుగు స్థాయిలో కాకున్నా ఈ 'రమణ' గారి రాంబాబు భూత భవిష్యత్ వర్తమానాలన్నిటిని స్పృశిస్తూ మనమనస్సులో తనకంటూ ఒక స్థానాన్నేర్పరుచుంటాడనటంలో ఏ మాత్రం సందేహం లేదు.

**-జి.ప్రభాకర్‌రావు, ఇ.ఇ., హైదరాబాద్.**

**వచ్చిన ఉత్తరాలలో పై మూడు బాగున్నాయని వాటిలో డి. నర్సింహ్మారావు రాసిన లెటర్ బహుమతికి అర్హమైనదని చింతపల్లి రమణ తెలిపారు. ప్రకటించిన ప్రకారం బహుమతి గ్రహీతకు 6 నెలల పాటు 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతున్నాము. తక్కిన ఇద్దరికి 'హాసం' 16-31 జనవరి 2002 సంచికను సముచితంగా పంపుతున్నాము.**

**-ఎడిటర్**

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త, లలిత సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**శ్రీ ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

# పడవ నడపవోయ్

ప॥ పడవ నడపవోయ్ పూల పడవ నడపవోయ్

1. చ॥ చుట్టిన తెరచాపనెత్తి గట్టిగ చుక్కాని పట్టి
ఒరగనీక సురగనీక తరగలపై తేలిపోవ ॥పడవ॥

2. చ॥ చక్కని రాయంచనంచు చుక్కల తలుకెంచుకొంచు
మిన్నుమన్ను కలుపుచున్న కన్నులలో సాగునంట
ఊరుదాటి ఏరుదాటి కడలి నాల్గు కడలుదాటి
చీకు చింతలోని వింత లోకానికి చేరునంట ॥పడవ॥

**రచన:** వింజమూరి శివరామారావు
**గానం:** డా॥ పి.బి.శ్రీనివాస్
**సంగీతం:** డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ
**రాగం:** ఖరహరప్రియ 22వ మేళకర్త — రాగ్ కాఫీ (హిందుస్తానీ సంగీతం)
**తాళం:** త్రిశ్రగతి - దాద్రా (హిందుస్తానీ సంగీతం)
ఆరోహణ: స రి గ మ ప ద ని స
అవరోహణ: స ని ద ప మ గ రి స

షడ్జము, చతుశృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి ధైవతం, కైశికి నిషాదం - యీ రాగంలోని స్వరాలు.

కర్ణాటక సంగీతంలోని ప్రముఖమైన రాగాలలో ఖరహరప్రియ కూడా ఒకటి. శాస్త్రీయ సంగీత పద్ధతి ప్రకారం కాక, యీ రాగాన్నీ లలితంగా మలచి సరళమైన మనోహరమైన బాణీని కూర్చారు స్వరకర్త బాలమురళీగారు. ఈ గీతం ఆకాశవాణి ద్వారా సుమారు నాలుగు దశాబ్దాలుగా అనేకసార్లు ప్రసారమై శ్రోతలను అమితంగా ఆకట్టుకుంది. ఆద్యంతం భావుకతతో సాగే శివరామారావుగారి యీ గీతానికి "చీకు చింతలేని వింత లోకానికి చేరునంట" అనే పంక్తులతో యిచ్చిన ముగింపు సార్థకతను చేకూర్చింది. రసవత్తరమైన బాలమురళీగారి బాణీకి శ్రీనివాస్‌గారి గానం సరిజోడై భాసించింది.

## ఖరహరప్రియరాగంలోని చిత్రగీతాలు

ఈ రాగంలో ఎక్కువగా చిత్ర గీతాలు మనకు కానరావు.
"సంగీతలక్ష్మి"లో - 'పాటకు పల్లవి ప్రాణం' (పల్లవి మాత్రం)
"మిస్సమ్మ"లో - 'బాలనురా మదనా' (సుశీల గానం -ఎస్. రాజేశ్వరరావు సంగీతం)
"స్వాతికిరణం"లో - 'సంగీత సాహిత్య సమలంకృతే' (ఏసుదాస్ గానం - కె.వి. మహదేవన్ సంగీతం)
'మంచుపల్లకి'లో 'మేఘమాదేహమా మెరవకే ఈ క్షణం' (యస్.జానకి గానం - రాజన్ - నాగేంద్ర సంగీతం)

## వింజమూరి శివరామారావు

శ్రీ వింజమూరి శివరామారావుగారు ఆంధ్రదేశంలోని ప్రముఖ గేయ కవులలో ఒకరు. దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి మేనల్లుడైన శివరామారావుగారు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో స్క్రిప్టు రైటర్‌గా చాలా కాలం పని చేశారు. అసంఖ్యాకమైన ఆయన లలిత గీతాలకు ఎంతోమంది స్వరకర్తలు సంగీతాన్ని అందించారు. "నటరాజా శివసాంధ్యనటా" (రాగమాలికగా పి.బి.శ్రీనివాస్ మున్నగువారు పాడారు). "శ్రీ పురాణధాత్రికి" (ఎన్.సి.వి.జగన్నాధాచార్యులు, శ్రీరంగం గోపాలరత్నం పాడారు) "నల్లని వాడా నే గొల్ల కన్నెనోయ్" (సాలూరి హనుమంతరావు సంగీతంలో రావుబాలసరస్వతి పాడారు), "ఏలానవ్వెదవది యేల" (స్వీయ సంగీతంలో బాలమురళీగారు పాడారు), "రావేలనే జాబిలి" (బాలమురళీగారి సంగీతంలో పి.లీల గానం), "ఓ నవభారత జాతిపితా" (స్వీయ సంగీతంలో చిత్తరంజన్ గానం), "ఓయ్ తుమ్మెదా" (గోపాలరత్నం పాడారు), "పడవ నడపవోయ్" (బాలమురళీగారి సంగీతం, పి.బి.శ్రీనివాస్ గానం) "వందనం అభివందనం అందుకొనుమీ కృష్ణవేణి" (గోపాలరత్నం, వింజమూరి లక్ష్మి పాడారు).

ఇవే కాక యింకా "వందనమాంధ్ర మహాజననీ" "విరిసినవి చేమంతులు" (పాలగుమ్మి విశ్వనాథం గారి సంగీతం) మొదలగు గీతాలు శ్రోతల హృదయాలను చూరగొన్నాయి. లలిత గీతాలే కాక ఆయన ఎన్నో సంగీత రూపకాలు, నాటికలు వ్రాశారు.

ఆయన రచించిన లలిత గీతాల సంపుటి "కల్పవల్లి"ని 1958లో ప్రచురించారు.

# డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ



అనన్యసామాన్యమైన విద్వత్తుతో, అసాధారణ ప్రతిభతో, భారతదేశంలోనే కాక, ఖండ ఖండాంతరాలలో సైతం కర్ణాటక సంగీత సౌరభాలను వెదజల్లిన మహావిద్వాంసులు, వాగ్గేయకారులు అయిన డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారు విజయవాడ, మద్రాసు, హైదరాబాదు ఆకాశవాణి కేంద్రాలలో సంగీత శాఖ ప్రయోక్త **(Producer)** గా 1950, 60 దశకాలలో పని చేశారు. ఆ సమయంలో స్వరకర్తగా ఎంతోమంది కవులు రచించిన లలిత గీతాలకు, సంగీత నాటికలకు సంగీతాన్ని సమకూర్చి లలిత సంగీతాన్ని సుసంపన్నం గావించారు. కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజు, బసవరాజు, వింజమూరి శివరామారావు, సి.నా.రె., దాశరథి మొ॥ వారి గీతాలకు ఆయన కూర్చిన హృద్యమైన బాణీలు ఆకాశవాణి ద్వారా ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి. "ఆకసమున చిరుమబ్బుల చాటున" (బసవరాజు), "వెదకివేసారినా వెర్రి బ్రతుకెపుడేని" (కృష్ణశాస్త్రి), "నువ్వటే నువ్వటే" (అడవి బాపిరాజు), "అదిగదిగో రాజఘట్టం" (వింజమూరి శివరామారావు), "అమ్మాభూదేవి" (బసవరాజు), "ఈ వసంతాలలో" (సి.నారాయణరెడ్డి) - యిలా ఎన్నో లలిత గీతాలకు మధురాతిమధురమైన సంగీతాన్ని కూర్చి, కొన్నిటిని ఆయనే పాడి మరెన్నిటినో ఎంతోమంది గాయనీగాయకుల చేత పాడించారు. 1957లో ఆయన హైదరాబాదు కేంద్రానికి ప్రొడ్యూసర్‌గా వచ్చినప్పుడు నాచేత "ఆకసమున చిరుమబ్బుల చాటున", "వెదకివేసారి", "నువ్వటే నువ్వటే" అన్న బసవరాజు, కృష్ణశాస్త్రి, బాపిరాజు పాటలేకాక "ఏలానవ్వెదవదియేలా" అనే వింజమూరి శివరామారావుగారి గీతాన్ని కూడా పాడించి ఆ రికార్డింగులో స్వయంగా ఆయన వయోలా కూడా అత్యద్భుతంగా వాయించి కార్యక్రమాన్ని కడురమ్యంగా తీర్చిదిద్దారు. ఆయన ఆకాశవాణిలలో లలిత గీతాలు పాడడమే కాక, "హోనాజీబాల", "రామదాసు", డా॥ నారాయణరెడ్డి గారి "రామప్ప" మొ॥ అనేక నాటికలలోను, సంగీత రూపకాలలోను నటించి పాటలుపాడారు. విజయవాడ కేంద్రంలో "భక్తిరంజని" కార్యక్రమాన్ని ప్రారంభించినది బాలమురళిగారే. శ్రీ బాలమురళీగారు నాకు గురువుగారు. వారి వద్ద సంగీతం నేర్చుకున్నాను.

## డా॥ పి.బి.శ్రీనివాస్

ప్రతివాది భయంకర శ్రీనివాసాచార్యులు (పి.బి.శ్రీనివాస్) గారు 1952లో చిత్రరంగ ప్రవేశం చేశారు. వారి తల్లి శ్రీమతి శేషగిరిగారు సంగీత విదుషి. సోదరి శ్రీమతి మణిరఘునాథ్ వీణావాదనంలో ఆరితేరిన విద్వన్మణి. వంశంలో వున్న సంగీతం ఆయనకు వెన్నతో పెట్టిన విద్యగా శ్రావ్యమైన ఆయన గాత్రానికి ఆలంబనమైనది. "భలేరాముడు" (భయమేలా ఓ మనసా), "శాంతి నివాసం", (శ్రీ రఘురాం జయ రఘురాం), "రంగులరాట్నం" (కన్నుల దాగిన అనురాగం), "మంచిమనిషి" (ఓహో గులాబి బాలా) "జయభేరి" (మదిశారదా దేవి మందిరమే - ఘంటసాల, రఘునాథ పాణిగ్రాహిలతో కలిసి పాడినది) "పెళ్లిరోజు" (ఆనాటి చెలిమి ఒక కల, జీవితాన మరువలేము ఒకే రోజు) - యిలా ఎన్నో తెలుగు చిత్రాలలోనే కాక అనేక తమిళ చిత్రాలలో కూడా మధురమైన గీతాలు పాడారు. 'మైంభీ లడ్కీ హూం' అనే హిందీ చిత్రంలో చిత్రగుప్త సంగీత దర్శకత్వంలో లతా మంగేష్కర్‌తో కలిసి 'చందా సే హెూగా వో ప్యారా' యుగళ గీతాన్ని' పాడారు. సుమారు



నాలుగు దశాబ్దాలపాటు అన్ని దక్షిణ భారత భాషా చిత్రాలలోనూ ఎన్నో గీతాలు గానం చేశారు. చాలాకాలం కన్నడ చిత్రాలలో పాడిన ఆయన అద్భుత గీతాలు విశేషంగా ప్రజాదరణ పొందాయి.

చలన చిత్రాలతోపాటు ఆకాశవాణిలో కూడా ఎన్నో రసవత్తరమైన గీతాలను తెలుగు, తమిళ, హిందీ భాషలలో శ్రీనివాస్ గానం చేయగా పలుసార్లు ప్రసారమైనాయి. 1961లో రవీంద్రనాథటాగూర్ శత జయంతి సందర్భంగా శాంతినికేతన్ నుండి 'రవీంద్ర సంగీత్'లో నిష్ణాతులైన శ్రీ శాంతిదేవ్ ఘోష్ మద్రాసు కేంద్రానికి వచ్చి దక్షిణ దేశ భాషలలోకి అనువదించబడిన రవీంద్ర గీతాలను కొన్నిటిని ఆయన పర్యవేక్షణలో రికార్డు చేయించారు. ఆంధ్ర నుండి తెలుగు అనువాద గీతాలైన "దక్షిణానిలా మేల్కొనవోయి", "రాజనగరిని మ్రోసెను మురళి" అనువాటిని నేను పాడాను, తమిళ, హిందీ అనువాద గేయాలను పి.బి.శ్రీనివాస్, జానకి తదితరులు పాడగా వాటిన్నిటిని ఢిల్లీ నుండి 'నేషనల్ ప్రోగ్రాం'లో ప్రసారం చేశారు.

జెమినీ స్టూడియోలో సంగీత దర్శకులుగాను, ఢిల్లీలో ఆకాశవాణి కర్ణాటక సంగీత శాఖకు చీఫ్ ప్రొడ్యూసర్‌గాను పని చేసిన సుప్రసిద్ధ వైణిక విద్వాంసులు పద్మశ్రీ ఈమని శంకరశాస్త్రిగారి అండదండలు,

వాగ్గేయకారులుగా ఆయన రచించిన వందలాది కీర్తనలు, వర్ణాలు, జావళీలు, తిల్లానాలు మాత్రమే కాక అనేక లలిత గీతాలు కూడా రచించి గానం చేశారు. ఎంతోమందికి నేర్పి పాడించారు. "పాటలేనీ భక్తి బాటలా? బాటలే", "కనిపించునా గతము వినిపించునా" "సొగసు నీ సొమ్ము కల్యాణిరాగిణి" మున్నగునవి అశేష ప్రజాదరణ పొందినవి. శాస్త్రీయ సంగీతంలో ఆయన ఎన్నో కొత్త రాగాలను సృష్టించారు. "సుముఖం", "మహతి", "లవంగి" మొదలగు రాగాలు ఎన్నో వున్నాయి. వాటిన్నిటిలో ఆయన రచించిన కీర్తనలు చాలా ప్రసిద్ధి చెందినవి. "మధ్యమావతి" రాగంలోని శుద్ధ మధ్యమానికి బదులు ప్రతిమధ్యమాన్ని చేర్చి "ప్రతి మధ్యమావతి" అని రాగానికి పేరిడి అందులో "భజరే యదునాధం" అనే సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనకు అద్భుతమైన బాణీని కూర్చి "భక్తిరంజని" కార్యక్రమం కోసం ఆ కీర్తనను నాకు, మరి కొంతమందికి నేర్పి ఆయన పాడుతూ మా అందరిచేత కూడా బృందగానంగా పాడించారు.

ఆయన సంగీత దర్శకత్వం వహించిన "హంసగీతె" అను కన్నడ చిత్రానికి విశేషంగా ప్రజాదరణ లభించడమే కాక, భారత ప్రభుత్వం ఆయనకు Best Music Director, Best Playback Singer అవార్డులను బహూకరించింది. అదేవిధంగా కొన్ని సంవత్సరాల క్రితం బెంగాలీ చిత్రంలో ఆయన పాడినపాటకు National Awardతో భారత ప్రభుత్వం బాలమురళీగారిని సత్కరించింది. "భక్తప్రహ్లాద" చిత్రంలో ఆయన నారదుడుగా నటించి ఎన్నో పాటలు సాలూరి రాజేశ్వరరావుగారి సంగీత నిర్వహణలో పాడారు. "ఉయ్యాల - జంపాల" (ఏటిలోని కెరటాలు - పెండ్యాల సంగీతం) "శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు"లో "వసంతగాలికి వలపులు రేగ" (జానకితో యుగళగీతం - పెండ్యాల సంగీతం)" కర్ణ లో "నీవూ నేను వలచితిమి" (పి.సుశీలతో యుగళ గీతం - విశ్వనాథన్, రామమూర్తి సంగీతం), "నర్తనశాల"లో "సలలిత రాగసుధారససారం" (బెంగుళూరు లతతో యుగళ గీతం - సుసర్ల దక్షిణామూర్తి సంగీతం), "మేఘసందేశం"లో పాడనా రాణి కళ్యాణిగా (రమేష్‌నాయుడు సంగీతం) "అందాలరాముడు"లో 'పలుకే బంగారమాయురా', ముత్యాలముగ్గులో 'శ్రీరామజయరామా సీతారామ' (కె.వి.మహదేవన్) "దొరికితే దొంగలు"లో 'శ్రీ వెంకటేశఈశా' (పి.సుశీలతో కలిసి కోరస్ కూడా), యస్.రాజేశ్వరరావు సంగీతంలోను, ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీతం కూర్చిన గుప్పెడు మనసు (మౌనమె నీ భాష ఓ మూగ మనసా) మొదలైన ఎన్నో తెలుగు, తమిళ చిత్రాలలో పాడారు. 'తిరువిళై యాడల్' అనే తమిళ చిత్రంలోని "ఒరునాళ్ పోదుమా" అన్న గీతం అనేక సంగీత కచేరీలలో కూడా ఆయన పాడుతూండే వారు.

1988లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో నేను సంగీతం కూర్చిన డాక్టర్ బోయి భీమన్నగారి "చూచే కొలదీ సుందరము" అనే పాటను ఆయన అద్భుతంగా పాడగా ఆ గీతం "ఈ మాసపుపాట"గా ప్రసారమయింది.

అసంఖ్యాకంగా ఎన్నో బిరుదులు, డాక్టరేట్లు ఆయనను వరించాయి. సంగీత కళానిధి డా॥ బాలమురళీకృష్ణ గారిని భారత ప్రభుత్వం "పద్మవిభూషణ" బిరుదుతో సత్కరించి గౌరవించింది.

"పుంభావ శారద" అయిన శ్రీ బాలమురళీగారు తెలుగువారు కావడం ఆంధ్రజాతి చేసుకున్న పుణ్యం.

---

ప్రోత్సాహంతో శ్రీనివాస్ చాలా హిందీ పాటలు, భజన్‌లు కూడా పాడారు.

బహుభాషా గాయకుడు మాత్రమే కాదు, శ్రీనివాస్‌గారు అష్టభాషా కోవిదుడు కూడా. సంస్కృతం, తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో కవితలల్లిన ఆయన ప్రజ్ఞ బహుముఖీయం. అసాధారణమైన ప్రతిభతో ఆ ఎనిమిది భాషలలో వివిధ యితివృత్తాలతో రూపొందిన రచనలను "ప్రణవం" అను గ్రంథంగా ప్రచురించారు. "షాబాష్" అను నామముద్ర ("తఖల్లుస్" అంటారు ఉర్దూలో)తో ఉర్దూభాషలో గజళ్ళను రచించారు. ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలలో పలు తెలుగు లలిత గీతాలు ఆయనవి అనేకసార్లు ప్రసారమైనాయి. 1980వ దశకంలో, ఆయన పాటలను ఆకాశవాణిలో చాలాసార్లు నేనే రికార్డు చేశాను.

ఆయన రచించి గానం చేసిన కృష్ణావతార వైశిష్ట్యాన్ని చాటే

**పాలవెల్లి నా పిల్లన గ్రోవి - నీల గగనమే నామోవి**

**ప్రేమామృతమే మురళీరవళి - విశ్వశాంతియే స్వరసరళి॥**

**1.జగన్నాటకమె నాకు వేడుక - క్షణమాత్రమైన లేదు తీరిక**

**భక్తశోధనము నాకు వాడుక - భక్తి భావమే ప్రణయ రాధిక॥**

**2.కర్మవీరులకె నా సహకారం - ధర్మ రక్షణకే నా అవతారం**

**ప్రశ్నార్థకమే విధాత వ్రాత - ప్రత్యుత్తరమే భగవద్గీత॥**

యీ గీతం ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలలో ప్రసారమై తెలుగువారి ప్రశంసల నందుకున్నది. తనకు చాలా యిష్టమైన పాటలలో యిది ఒకటి అంటారు శ్రీనివాస్‌గారు.

గాయకుడుగా, సంగీత దర్శకుడుగా, బహుభాషా కోవిదుడుగా, కవిగా అత్యంత ప్రతిభామూర్తియైన శ్రీనివాస్‌గారు భారతదేశంలోనే కాక దక్షిణాఫ్రికా, అమెరికా, కెనడా, సింగపూర్, ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో పర్యటించి తన గానంతో, కవితా కుసుమాలతో ఆయా దేశాల ప్రజల ప్రశంసలనందుకున్నారు. 1969లో చంద్రమండలానికి తమ పౌరులను పంపి అమెరికా చరిత్ర సృష్టించిన సందర్భం శ్రీనివాస్‌గారిని ఎంతగానో ప్రభావితం చేసింది. ఆయన ఆ ఘట్టాన్ని ఇంగ్లీషులో అద్భుతమైన కవితగా వెలయించగా అప్పటి అమెరికా అధ్యక్షుడు నిక్సన్, చంద్రమండలానికి వెళ్ళి వచ్చిన నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్‌లు బహుధా ప్రశంసించారు.

సాహిత్యంలో కొన్ని అపురూపమైన ప్రయోగాలు చేశారు. సంస్కృతంలో "శ్రీనివాస వృత్తమ్", "గాయత్రీ వృత్తమ్"లు, ఉర్దూలో "గజ్రా" అనే ప్రయోగాలు పండితుల మన్ననలు పొందాయి. కర్ణాటక సంగీతంలో "నవనీత సుధ" అనే రాగాన్ని కూడా సృష్టించారు.

'గానసామ్రాట్', 'గానకళాసార్వభౌమ' మొదలైన ఎన్నో బిరుదులు పొందారు. తమిళనాడు ప్రభుత్వం ఆయన సంగీత సేవను గుర్తించి "కలైమామణి" అన్న బిరుదుతో శ్రీనివాస్ గారిని సత్కరించింది.

# ఈ రూటే వేరు

1. సన్నగిల్లుట = సన్నగా గిల్లుట

-బి.వి.రావు, రుద్రారం.

2. మైత్రి = నా మూడు

-ఎస్.జ్యోత్స్న సురేష్, కర్నూలు.

3. ఇన్ వైట్ చేయుట =లోపల తెలుపురంగు వేయుట

-పి.నిజ, జవహర్ కాలనీ.






# చిలిపి కవిత

సిటీలో ఎన్నో 'వే'లు వన్ వే
అయినా ప్రతిదీ అందరూ నడిచే తోవే
అర్థమయ్యే వరకు ఎవరికైనాసరే
చచ్చేచావే
అంత వరకు మన గురువు వినోబ భావే

-కీర్తన, హైద్రాబాద్.







# చిలిపి లిపి

1. Finger Weapon = వేలాయుధం

-బి. శ్రీనివాసాచారి, ఓరియంట్ సిమెంట్, హైద్రాబాద్.

2. D(W) D(E) D(S) D(T) = వెస్ట్ ఇన్‌డీస్

-అడపా శివదుర్గ, భోగాపురం.

3. వందేమాతరం = వన్ (ఇంగ్లీషు) దే (హిందీ) మాత (సంస్కృతం) రమ్ (ఇంగ్లీష్) అనగా ఓ మద్యం సీసా ఇవ్వు తల్లీ అని అర్థం.

-జె.ఎ.కె. జిలానీ, బనగాన పల్లె

# డబుల్ రోల్



1. 'మంజూ' నీకు లోను 'మంజూ'ర య్యిందా!?
2. సారీ మీరడిగిన ఆ దేవుడి 'పటం' పం'పటం' మర్చిపోయాను
3. 'దాదా'పు ఆ ఏరియాలో వున్న వాళ్ళంతా 'దాదా' లే!

-బి.విశ్వజ, హైద్రాబాద్.

# కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు



ప్ర. అసలు సిసలైన వెజిటేరియన్?
జ. తినబోయే తిండిలో సూక్ష్మ జీవులేవైనా వున్నాయేమోనని పరిశీలించడానికి డైనింగ్ టేబుల్ మీద మైక్రో స్కోపు పెట్టుకునేవాడు

-భమిడిపాటి వెంకటేశ్వర రావు, చందానగర్

ప్ర. కంగారు పడే దెప్పుడు?
జ. 'కంగారు' కుంటి దయినప్పుడు

-ఎస్. జ్యోత్స్నా సురేష్ - కర్నూలు

ప్ర. అప్పుచేసి పప్పుకూడు తినరాదు... అనిఅంటే!?
జ. అప్పుచేసి నాన్‌వెజ్ తినాలని

వి. మంజురాణి - హైదరాబాద్

# పేరు - రిపేరు




1. జంబలకిడి పంబ - విచిత్రం - అప్పారావు నెల తప్పాడు

-బి. రామకృష్ణ, హైద్రాబాద్.

2. ఆకాశ వీధిలో - పుష్పక విమానం

-సాయి దినేష్, కర్నూలు.

3. ఇంట్లో ఇల్లాలు - వంటింట్లో ప్రియురాలు - ఇదండీ మావారి వరస

-జి. శుభాకర రావు, కర్నూలు.

# పేరడీ పెరేడ్



గాలి హోరులో హోరు గాలిలో సైకిల్ ప్రయాణం
ఏది అంతమో ఎంత పంతమో తెలియదు పాపం
తెలియదు పాపం
అది చెత్త రోడ్డు అని తెలుసు
ఇది రోడ్డు చెత్త అని తెలుసు
రోడ్డు చెత్తలో చెత్త రోడ్డుపై
అదుపు తప్పునని తెలుసు
అటు ఇసుక తిన్నెలని తెలుసు
ఇటు నీటి కాల్వలని తెలుసూ
ఇసుక దారిలో నీటి కాల్వలో
పట్టు సడలునని తెలుసు
అయినా సైకిల్ ప్రయాణం
ఏది అంతమో ఎంత పంతమో తెలియదు పాపం
తెలియదు పాపం ॥గాలి హోరు॥
అటు మనుషుల పరుగుల ఆరాటం
ఇటు గేదెల నడుమన పోరాటం
మనిషి మనిషికి గేదె గేదెకి
మధ్యన ట్రాఫిక్ చెలగాటం
అటు బ్రేకు హ్యాండుల బాలన్సు
ఇటు బెల్లు లైటుల సైలెన్సు
బాలన్స్ విఫలమై సైకిల్ శకలమై
తప్పు తున్నది వశం
అయినా సైకిల్ ప్రయాణం
ఏది అంతమో ఎంత పంతమో తెలియదు పాపం
తెలియదు పాపం ॥గాలి హోరు॥

**మూలం : గాలి వానలో వాన నీటిలో పడవ ప్రయాణం**
**చిత్రం: స్వయంవరం**

-శ్రేష్ఠ, హైద్రాబాద్.

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

## తోలు బొమ్మలాట చూడవచ్చిన

# దేవుడు చేసిన బొమ్మలు

**ముందురోజు రాత్రి జంఘాల శాస్త్రి ఓ తోలుబొమ్మలాట చూడడానికి వెళ్లాడు. అక్కడ తెరమీద జరిగే అసభ్య దృశ్యాలను, వాటిని చూసి ఆనందిస్తున్న ప్రేక్షకుల గురించి చెబుతున్నాడు:**

## సాక్షి



కవిశేఖర పానుగంటి లక్ష్మీనరసింహారావు

"నిన్న రాత్రి తోలుబొమ్మలాట చూడడానికి వెళ్లాను. సంతబయట ఏర్పాటు చేశారు. ఇసుక వేస్తే రాలని జనం. మనుష్యులు తయారుచేసిన బొమ్మలాట కంటె దేవుడు తయారుచేసిన బొమ్మలు ఆడే ఆట చూడడం నాకిష్టం. తెరమీద జరిగేదాని కంటె, సభలో జరిగే వింతలు చూడడం, సభికుల ప్రవర్తన గమనించడం నా కిష్టం. అందుకే రాత్రి తొమ్మిది కాకుండానే అక్కడికి చేరాను. అయినా చోటు దొరకలేదు. కాస్సేపు వంగి, కాస్సేపు నిలబడి, కాస్సేపు ముంగాళ్లపై అనుకుని ఆట చూడబోయాను. వెనుకవారి చూపుకు అడ్డువచ్చానన్న కారణంగా కర్రతో పొడిచో, కాలితో తోసో తన్ని తగిలేశారు. ఎక్కడ కెళ్లినా ఇదే తంతు.

ఆట ప్రారంభమయింది. తెరకు ఒకవైపు కోతి సైన్యం. మరో వైపు రాక్షస సైన్యం. భీకరంగా యుద్ధం. రాముడు, లక్ష్మణుడు, రావణుడు, విభీషణుడు - ఇలా అన్ని పాత్రలు తెరమీద కనబడి భీకరయుద్ధం చేసేశాయి. వెనకాల నుంచి పెద్దగొంతుతో పాటలు. చెంబులో గచ్చకాయలు పోసి తిప్పినట్లు కంఠస్వరంతో కయ్ఁ మని పాడుతున్నారు. వినగానే చెవుటు గుయ్ఁ మంటాయి. బొమ్మలాట చూసిన రెండు పూటల వరకు చెవులు గింగురుమనడం తగ్గదు. యుద్ధం సీను తర్వాత కాస్సేపు విరామం చిక్కింది.

ఇంటర్వెల్ అనగానే జనాలు అగ్గిపుల్లలు వెలిగించి, చుట్టలు ముట్టించారు. ఒళ్లు విరుచుకుని, "ముక్కుపొడుం వుందా?" అని పక్కవారిని అడగనారంభించారు. కొంతమంది లేచి స్థలం చూస్తూండమని పక్కవారికి చెప్పి కదిలారు. మరికొంతమంది నెత్తిమీద గుడ్డ తీసి కింద వేసుకుని కూచున్నారు. "బొమ్మలాటవాడు గట్టి ముండాకొడుకులే!" "పాట పాడేది పత్తిరాటం లాగ పసందుగా పాడుతోంది చూశావా?" "బొమ్మలకు వేసిన రంగులు కొత్తవి" "క్రితం సారి కన్నా బొమ్మలు పెద్దవి" "మా అత్తవారి ఊళ్లో ఇంత కంటె రంజైన ఆట చూశా" - ఇలా అనేక కామెంట్స్ చేస్తున్నారు.

"అమ్మాయ్, ఇదే టైము. చంటివాడికి ఏద్దైనా పెట్టు" అని అత్తగారు కోడలికి ఆర్డరేస్తోంది. "చిన్నీ, మెడలో గొలుసు జాగ్రత్త!" అని తల్లి కూతుర్ని హెచ్చరిస్తోంది. "అక్కా, బట్ట తిన్నగ సర్దుకో" అని చెల్లెలు అక్కకు కాపలా కాస్తోంది. 'అబ్బీ, రవంత దూరంగా కూచోకూడదూ! ఆడకూతురు మీద కాలు వేస్తున్నావు" అని ఒక చింపితల ఆడది బండి వాణ్ని హెచ్చరిస్తోంది. "ఆయనకు తోలుబొమ్మలంటే ప్రాణంగా ఉండేది" అని ఓ వితంతువు భర్త జ్ఞాపకాలను ఇతరులతో పంచుకో జూస్తోంది. "అమ్మా బొమ్మలు అలా ఎలా ఆడతాయే?" అని ఓ పిల్ల తల్లిని జ్ఞానబోధకై అర్థిస్తోంది. "ఇదివరకు వేసే ఆ బొమ్మలాటలే తీరే వేరు. ఇప్పటివాళ్లు... అబ్బే..." అని ఓ ముసలాయన నోరు చప్పరిస్తున్నాడు. "ఏమిటో మాయా ప్రపంచం! మనం మాత్రం తోలుబొమ్మలం కామూ?" అంటూ వేదాంతం బోధిస్తోంది ఓ వృద్ధవేశ్య.

ఇంతలో తెరమీద ఓ రూపం కనబడగానే జనంలో ఒకటే సందడి. "అదిగో వచ్చాడు. వచ్చేశాడు" అంటూ కేకలు. ప్రజలలో అంత చైతన్యం తెచ్చిన పాత్ర రాముడిది కాదు. సీతది కాదు. గంధోళిగాడిది. కథా ప్రవాహానికి అడ్డు వస్తాడు కాబట్టి గ్రంధారిగాడనాలి. కానీ ప్రజల్లో నోట్లోబడి గంధోళి గాడయ్యాడు. కథను నడిపేవాడు కాక, కథను ఆపి గోలచేసేవాణ్ని ప్రేక్షకులు ఆదరించడానికి కారణం వాడి బూతుమాటలు, మోటుసరసం! తెరమీదకు గంధోళిగాడు రాగానే చంద్రుణ్ని చూసిన కలువపూలల్లా సభ అంతా కలకలలాడింది. ఎక్కడ చూసినా నవ్వులే! ఎక్కడ చూసినా కిచకిచలే. కిలకిలలే, కిసుక్కులే! వాడి అభిమాని కాని ప్రేక్షక మహాశయుడు ఒక్కడు కూడా లేడు.

ఒక శాస్త్రులు గారు పొడుంకాయలోని పొడుం తీసుకుని ఎడమ చేతిలో వేసుకుని పట్టు పట్టబోయి గంధోళిగాణ్ని తదేకంగా చూస్తూ పొడుం అంతా ఒలకబోసుకున్నాడు. మునసబుగారు కునికిపాట్లు పడుతున్న కొడుకుని "చూడు, చూడు అడుగో వచ్చేశాడు" అంటూ నిద్రలేపి కూచోబెడుతున్నాడు. కొందరు

చేతిని గొట్టంలా చేసి దానిలోంచి చూస్తున్నారు. దూరపు చూపు ఆననివారు దగ్గరకు వెళ్లి చూస్తున్నారు. బాల వితంతువులు నోరు తెరిచి చూస్తున్నారు. ముగ్ధలు తలలు వంచుకుని పై రెప్పల పైనుండి చూస్తున్నారు. ప్రౌఢవనితలు పక్కచూపులతో చూస్తున్నారు. ముసలి ఆడవారు తేరిపార చూస్తున్నారు. నడిమి వయస్సు వాళ్లు చూసీచూడనట్లు చూస్తున్నారు. "వీడి మొహం మండ! వీణ్ని చూసే దేముంది?" అంటూనే చూస్తున్నారు కొందరు.

గంధోళిగాడి వెకిలి యాక్షన్ తెరమీద చూస్తున్న ఆడవాళ్ల రియాక్షన్స్ కూడా పలు రకాలుగా ఉన్నాయి. కిసుక్కున నవ్వేవారు కొందరు. మందహాసం చేసి దాచుకునేవారు కొందరు. "అదే పనిగా నవ్వుతావేం?" అని పక్కవాళ్లను ఆక్షేపించబోయి, నవ్వేవాళ్లు కొందరు. పక్కవాళ్లు చూస్తారని భయపడి నవ్వు ఆపుకోబోయి, ఆగక దగ్గగా మార్చబోయిన వారు కొందరు. స్నేహితురాళ్లతో వచ్చినవాళ్ళు ఇంకో స్త్రీని గమనించమంటూ చెవిలో చెబుతున్నారు. కనుసైగలు చేస్తున్నారు.

ఈ లోపు గంధోళిగాడు భార్యని చూస్తూ గంతులు వేస్తూ పాట పాడాడు.

ఓ పిల్లాడు ఈ హడావుడికి నిద్రలేచి తెరమీద బొమ్మను చూసి "అమ్మా! నాన్న అడుగో!" అని కేకవేశాడు. తల్లి విసుక్కుంది. - "ఛాల్లే! మీ నాన్న బతుక్కి, ఆ మాత్రం కూడానా?" అని నా బతుక్కి తక్కిన ఆడవాళ్లందరూ ఫక్కున నవ్వారు.

ఇంతలో చోడిగాడు వచ్చాడు. వీడు గంధోళి గాడి మేనల్లుడు. వికారపు వేషాలు కొన్ని వేసి గంధోళిగాడి భార్యను ఎత్తుకుని పారిపోయాడు.

ఈ కామెడీ సీను అయిపోయాక మళ్లీ రామాయణ కథ మొదలయ్యింది. శ్రీరాముడు, మూర్ఛపోయిన లక్ష్మణుడు, విభీషణుడు ప్రవేశించారు. ఇంతలో ప్రేక్షకులలో ఓ మూల ఇద్దరు గట్టిగా వాదించుకోవడం వినబడింది. అంతలోనే నలుగురైదుగురి గొంతులు వినబడ్డాయి. వెంటనే గుబగుబలాడుతూ కొందరు లేచి నుంచున్నారు. కూర్చోండి, కూర్చోండి అని వెనక ఉన్నవాళ్లు అరిచిన కొద్దీ ఇంకా ఎక్కువ మంది జనం లేచి నిలబడ్డారు. పెద్దగోల, చెప్పులు ఎగరడం. చూస్తుండగానే కర్రలు విరగసాగాయి. జనాల తలలు పగలసాగాయి. కర్రలు తెచ్చుకోనివారు పందిరి కర్రలు ఊడపీకసాగేరు. బొమ్మలాట వాళ్లు భయపడి తోళ్లు మడిచిపెట్టి పరుగులు పెట్టారు.



కరణంగారు కర్ర చేతబట్టి అడ్డు వచ్చిన వాళ్లనల్లా కొడుతూ కంట్రోలు చేయబోయారు గానీ ఎవడో పంగల కర్రతో ఆయన పక్కటెముకలు విరక్కొట్టాడు. పోలీసులు వచ్చారు కానీ చుట్టకాల్చుకుంటూ దూరంగా నిలబడ్డారు. కరణం గారిని గంజికావడి వేసుకుని ఇంటికి తీసుకుపోయారు. మునసబుగారు ఇటువంటి సాహసానికి దిగక పోవడం చేత ఎవరూ మోసుకుని పోనక్కరలేకుండా ఆయనంతట ఆయనే ఇంటికి వెళ్లాడు. బొమ్మలాట, గుద్దులాట, తన్నులాటగా దిగింది. కాస్సేపటికి అన్నీ చల్లారి, జనాలు ఒత్తిగిల్ల సాగేరు. "ఇదీ సమయం" అనుకుని పోలీసువాళ్లు వాళ్లను ఈడ్చి, వీళ్లను బెదిరించి, దెబ్బలు పడి కిందపడిన వాళ్లను లాగి, కావలసినంత హంగామా చేశారు. జనాలంతా ఇంటికి పోయారు. ఇదీ నిన్న జరిగిన బొమ్మలాట తీరు" అన్నాడు జంఘాల శాస్త్రి.

"ఇంతకీ ఇంత గలభా జరగడానికి కారణం ఏమిటి? పోట్లాట మొదలుపెట్టిన వాళ్లు దేనిగురించి మొదలు పెట్టారట?" అని అడిగేరు శ్రోతల్లో ఒకరు.

"ఆ విషయం గురించి అడిగిన వాళ్లెవరూ లేరు. ఎందుకు తిట్టుకుంటున్నారో, ఎందుకు కొట్టుకుంటున్నారో తెలియకుండానే అంతా కొట్లాటలకు దిగిపోయారు. నిజానికి అసలు కారణం తెలిసున్న ముగ్గురిలో నేనొకణ్ని. అది బొమ్మలాటలో పాత్రలకు సంబంధించిన వివాదం...." అన్నాడు జంఘాల శాస్త్రి.

"రాముడికి సీత ఏమవుతుందని అడిగేడా ఎవడైనా?"అని చమత్కరించాడు మరో శ్రోత.

"అదైనా బాగుండును. వాళ్ల ఆర్గ్యుమెంటు గంధోళిగాడి భార్యకు, చోడిగాడికి ఉన్న బంధుత్వం గురించే! చోడిగాడు గంధోళిగాడి మేనల్లుడని ఒకడు, అల్లుడని మరొకడు వాదించుకున్నారు. దాని మీద మాటా మాటా పెరిగి ఇంత గొడవకు దారితీసింది. ఆ పాత్రల మీద ప్రేక్షకులకున్న వ్యామోహం చూడండి, ఎలా ఉందో!" అంటూ ఉపన్యాసం ముగించాడు జంఘాలశాస్త్రి.

-కమ్యూనికేటర్ ఫీచర్స్






# జో భీ కసమే

**చిత్రం - రాజ్**
**బ్యానర్ - టిప్స్ ఫిల్మ్స్**
**గీతం - సమీర్**
**సంగీతం - నదీమ్ - శ్రవణ్**
**పాడినది - అల్కా యాగ్నిక్, ఉదిత్‌నారాయణ్**
**నటీనటులు -దినో మోరియా, బిపాశా బసు**

ప్రస్తుతం హిందీ సినిమా చార్ట్‌బస్టర్స్‌లో 'కెకెజి' తర్వాత స్థానం ''రాజ్'' దే. తెలుగులో ''రహస్యం'' గా రాబోతున్న ఈ చిత్రం సంగీతంతో నదీమ్-శ్రవణ్‌లు పూర్వవైభవాన్ని మరొక్కసారి రుచి చూడబోతున్నారని అంటున్నారు. సినిమా కథ మాట ఎలా ఉన్నా పాట మాత్రం మామూలు రొమాంటిక్ సాంగే. ఇద్దరు ప్రేమికులు తమ రొమాన్స్‌ను మరొక్కమారు తలుచుకుంటూ నీకు ఇంకా గుర్తుందా? (క్యా తుమ్హే యాద్ హై) అని పలకరించుకునే గీతం ఇది.

కసమ్ ఖానా అంటే ఒట్టేయడం. దీనిలో తినడం ఏమిటని ఆశ్చర్యపడవద్దు. 'రఫూ చక్కర్' సినిమాలో అస్రానీ 'హింగ్లీషు' మాట్లాడుతూ 'ఐ విల్ ఈట్ ఓత్' అంటూంటాడు. మన రాష్ట్రంలో కూడా కొన్ని ప్రాంతాల్లో 'ఒట్టు తిన్నా' అనడం వినబడుతుంది. అది హిందీ (ఉర్దూ) ప్రభావమే! వాదా 'వా'క్ 'దా'నానికి సంక్షిప్తరూపం అని చమత్కరించవచ్చు. నశీబ్ అంటే అదృష్టం. ఖుశ్ చేర్చారు కాబట్టి మంచిదని అర్థం. బద్ చేరిస్తే దురదృష్టం. తన్‌హాఈ చాలా పాటల్లో వినబడుతూ ఉంటుంది. ఒంటరితనం అని అర్థం. పుర్‌వాఈ (పూరబ్ నుండి వచ్చింది) - తూర్పుగాలి. పనాహ్ అంటే రక్షణ. లమ్హా అన్నా పల్ అన్నా ఒకే అర్థం - క్షణం. జిగర్ - మనస్సు. జిగర్ మే ఉతారా (దింపుకున్నా) అనే ఇడియం మనకు కొత్తగా ఉంటుంది. హిందీలో ఫోటో తీయడాన్ని కూడా ఉతారనా అనే అంటారు.

పాటలో ముందుగా అతడు పాడేదు - కలిసి మనం చేసిన బాసలు (కస్మే ఖాఈ థీ హమ్‌నే, వాదా కియా థా జో మిల్‌కే) గుర్తున్నాయా? నువ్వే నా జీవితంలో కొత్త ఉదయాన్ని తెచ్చావు (తూనే హీ జీవన్‌మే లాయా థా మేరే సవేరా). ఆ రోజుల్లో పగలు అందంగా ఉండేవి (దిన్ వో బడే హసీన్ థే) రాత్రుల్లదే భాగ్యం (రాతే భీ ఖుశ్‌నశీబ్ థే). ఆ రోజుల్లో మేలుకునే ఉండేవాళ్లం (జాగే జాగే రహతే థే) ఏదో పోగొట్టుకున్నట్టు ఉండేవాళ్లం (ఖోయే ఖోయే రహతే థే). రోజూ మనం కలిసేవాళ్లం (హోతీ థీ రోజ్ ములాకాతే) - ఓ సారి ఒంటరిగా, ఓ సారి తూరుపుగాలిలో ప్రేమ సంభాషణలు సాగించేవాళ్లం. (కర్‌తే థే ప్యార్ కీ బాతే). నీ బాహువుల్లో, నీ ఆశ్రయంలో నేను ప్రతీ క్షణాన్ని గడిపేవాణ్ని. (మైనే హర్ లమ్హా గుజారా). బంగారు చంద్రబింబం (సున్‌హరే చాంద్) వంటి నీ ముఖాన్ని నా హృదయంలో దాచుకున్నాను.




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. చిన్నె (విప్రనారాయణ - ఎందుకోయీ తోటమాలీ)
ఎ) రంగు బి) విలాసచేష్ట
సి) స్వల్పము డి) నవ్వు

2. విరికన్నెలు (విప్రనారాయణ - మధుర మధురమీ)
ఎ)వయసువచ్చిన బాలికలు బి)పూబాలలు
సి) నవ్వుతున్న ఆడపిల్లలు డి) విచ్చుకున్న పువ్వులు

3. యవ్వారం (ఓ చినదాన.. హవ్వ, హవ్వ)
ఎ) ప్రేమ బి)వ్యవహారం
సి) కోపం డి) తెలివితేటలు

4. వాయనము (ఎంత బావుందో ... నీ చూపూ నీ ఊపూ)
ఎ) కాకి బి) గాలికి ఎగురునది
సి) వ్రతాలలో ఇచ్చే భక్ష్యము డి) ప్రయాణము

5. గోము (షావుకారు...ఏమనెనే)
ఎ) వ్రతము బి) ఆవు
సి) శాంతము డి) గారాబము

6. మొలకనవ్వులు (తిరుపతమ్మకథ...పూవై విరిసిన)
ఎ) చిరునవ్వులు బి) దాచుకున్న నవ్వులు
సి) అణుచుకున్న నవ్వులు
డి) అలకతోకూడిన నవ్వులు

7. నెనరు (దేశద్రోహులు..జగమే మారినది)
ఎ) మోహము బి) జ్ఞాపకము
సి) ఆనందము డి) రాగద్వేషాలు

8. పాప పానుపున (కార్తవరాయని కథ..ఆనందమోహన)
ఎ) పసిపాప పక్క బి) పాలపాన్పు
సి) శేషశయ్య డి) మర్రిఆకు తల్పము

9. ఎనరాని (విమల...కన్నుల బెళుకే)
ఎ) లెక్కలేని బి) అంతులేని
సి) సాటిలేని డి) ఎప్పటికీ రాని

10. ఓలలాడు (దేవాంతకుడు..ఎంత మధురసీమ)
ఎ) ఊగులాడు బి) ఈదులాడు
సి)ఆటలాడు డి) పిలుచు

### జవాబులు

1) b) 2) b 3) b
4) c 5) d 6) a
7) a 8) c 9) c
10) b



(తేరే ఇస్ చెహ్‌రే కో మైనే జిగర్ మే ఉతారా). నీకెంతో దగ్గరగా ఉండేవాణ్ని (కిత్‌నే తేరే కరీబ్ థా ) పెదాలపై ఎప్పుడూ నీ పేరే (హోంఠోం పే రహ్‌తా థా హర్ వక్త్ తేరా నామ్ థా). ఇదంతా నీకు గుర్తుందా ?

దీనికి సమాధానంగా ఆమె 'ఆహా, నాకు గుర్తుంది' అంటూ మరికొన్ని విషయాలు చెప్పింది. ఉజాలా అంటే వెలుతురు. ఖయాల్ అంటే ఊహ, ఖ్వాబ్ అంటే కల. హాథోంకీ రేఖా అంటే అరచేతిలో ఉండే గీత అన్నమాట. అంటే నువ్వే నా భాగ్యరేఖ అన్న అర్థంలో ఆమె పాడింది. జిందగీ అన్నా, జిందగానీ అన్నా జీవితం అనే అర్థం. ఉమంగ్ ఉల్లాసం. బహక్‌నా అంటే తూలడం, కట్టు తప్పడం. దిల్ అనేది ఎప్పుడూ బహక్‌తానే ఉంటుందని హిందీపాటల రచయితలు ఒప్పేసుకుంటూంటారు. ('ఉత్సవ్'లో 'దిల్ క్యోం బహకారే, బహకా ఆధీ రాత్ కో' అన్న పాట గుర్తుందా?) లబ్ అన్నా, హోంఠ్ అన్నా ఒకటే - పెదవి. చూమ్‌నా ముద్దాడడం. ఝూమ్‌నా ఊగడం. బసేరా గూడు.

ఆమె జవాబు ఇలా సాగింది - పగటి వెలుతురులో (దిన్ కే ఉజాలోం మే) రాత్రి కలలలో, ఊహల్లో అనుక్షణం నిన్ను చూశా (మైనే తుఝే పల్ పల్ దేఖా) నా జీవితమే నువ్వు, (మేరీ జిందగానీ తూ) నా కథయే నువ్వు. నువ్వే నా భాగ్యరేఖవు. నువ్వు నన్ను స్వంతం చేసుకోవాలని (అప్‌నా బనాయా) నే కోరుకున్నా. నీ మనసులో నన్ను నిలుపుకున్నావ్ (తూనే ముఝే దిల్ మే



బసాయా) ప్రేమరంగులతో, ఉల్లాసాలతో నా కలలను అలంకరించావ్ (తూనే మేరా సప్‌నా సజాయా) నీ పెదాలు ముద్దాడి, నీ బాహువుల్లో ఊగి, తూగి నా కళ్లల్లో నీ నివాసం (బసేరా) ఏర్పరిచా . గుర్తుందా?

చివరిగా ఆ రోజులు గుర్తున్నాయని ఇద్దరూ ఒకరికి ఒకరు హామీ ఇవ్వడంతో పాట ముగుస్తుంది. వినడానికి హాయిగా ఉన్న ఈ పాట సినిమాలో హైలైట్ అంటున్నారు.

# స్వర్గం - నరకం

అనిరుద్ధేశ్వరరావు ఓ ఫైన్ ఈవినింగ్ టపా కట్టేశాడు. పైకి వెళ్లగానే అతన్ని సాక్షాత్తూ యముడే రిసీవ్ చేసుకున్నాడు - పూల దండ వేసి. తనకి ప్రత్యేకంగా ఎందుకింత గౌరవం ఇస్తున్నారని అనిరుద్ధేశ్వరరావు అడిగితే యముడు జవాబు చెప్పాడు.

"స్వర్గానికి రియల్ ఎస్టేట్ వ్యాపారస్థుడు వచ్చి చాలా కాలం అయింది.... అందుకని"

"సరే. పదండి స్వర్గానికి పోదాం" చెప్పాడు అనిరుద్ధేశ్వరరావుగా హుషారుగా.

"నిన్ను తీసుకెళ్ళాలనే నాకూ వుంది. కానీ హైకమాండ్ ఆర్డర్స్ మరోలా వున్నాయి. నిన్ను ఓ రోజు నరకంలో, మరో రోజు స్వర్గంలో వుంచి, తర్వాత నువ్వు ఎక్కడ వుండాలని కోరుకుంటే, అక్కడ వుండనివ్వమని బ్రహ్మగారి ఆజ్ఞ అందుకే ఈ డ్యూటీ స్పెషల్‌గా నాకు పడింద'ని చెప్పాడు యముడు.

"ఎవరైనా స్వర్గంలో వుండాలనే కోరుకుంటారు కదండి. నాకూ అదే ఇష్టం" చెప్పాడు అనిరుద్ధేశ్వరరావు.

"సారీ! పైవారి మాటని జవదాటకూడదు. ముందు స్వర్గం చూసి రండి". యముడు అనిరుద్ధేశ్వరరావు లిఫ్ట్‌లోకి ఎక్కించి బటన్ నొక్కగానే అది ఓ చోట ఆగింది. లిఫ్ట్ తలుపులు తెరుచుకోగానే బయటకి నడిచాడతను. ఎదురుగా విశాలమైన పార్క్ అందులో ఓ సర్కస్ టెంట్, రెండు సినిమా హాళ్ళు (ఒక దాంట్లో కలర్, మరో దాంట్లో బ్లాక్ అండ్ వైట్ సినిమాలు).

బాబాయ్ హోటల్ నుంచి ఫైవ్ స్టార్ హోటళ్ళు దాకా అన్ని రకాల హోటళ్లు ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లు కనిపించాయి. విశేషం ఏమిటంటే, దేంట్లోనూ టిక్కెట్లు కొనడం కానీ, బిల్లు



చెల్లించడం కానీ లేదు. అంతా ఉచితం.

మరణించిన తన బంధు మిత్రులు, అనేకమంది బిల్డర్స్ కనిపించారు. అంతా దగ్గరికి వచ్చి ఆనందంగా కరచాలనం చేసి అతను 'ఎప్పుడు చచ్చావ్, ఎలా చచ్చావ్' లాంటి ప్రశ్నలు వేసారు.

"నరకంలో అన్నీ కష్టాలు కన్నీళ్లు అంటారు. అదేమిటి హుషారుగా వున్నారు?" వాళ్ళ మొహాల్లోని చిరునవ్వుని చూసి ప్రశ్నించాడుఅనిరుద్ధేశ్వరరావు.

"అదంతా అబద్ధం. ఇక్కడ కష్టాలుండవు" చెప్పారు వాళ్లు.

చిన్నప్పుడు ప్రేమించి తన దగ్గర అప్పుడంత డబ్బు లేదని తెలిసి మరో డబ్బున్న వాణ్ణి చేసుకున్న సువర్చల కనిపించింది. అద్భుతమైన అందంగా వుందామె. వాళ్ళిద్దరి మధ్య కొంత సంభాషణ నడిచాక సువర్చలకి తన మీద ఇంకా ప్రేమవుందని గ్రహించాడు.

మర్నాడు ఉదయం అనిరుద్ధేశ్వరరావుని యమభటులు లిఫ్ట్‌లో స్వర్గానికి తీసుకెళ్ళారు. అక్కడతను రంభ, ఊర్వశి, మేనకల నృత్యాలు చూస్తూ, సురాపానం చేస్తూ ఆనందంగా గడిపాడు.

మర్నాడు యముడు అడిగాడు.

"ఓ రోజు నరకంలో, ఓ రోజు స్వర్గంలో గడిపావు. ఇప్పుడు చెప్పు. నీకు ఎక్కడ వుండాలని వుంది?

"స్వర్గం బానే వుంది. కాని నరకమే బెటర్" చెప్పాడు.

యముడు మళ్ళీ లిఫ్ట్‌లోకి పంపి బటన్ నొక్కగానే నరకానికి చేరుకున్నాడు అనిరుద్ధేశ్వరరావు. లిఫ్ట్ తలుపు తెరుచుకోగానే చూస్తే ఎదురుగా బండరాళ్ళు, ఆకులు వేసి ఎండిపోయిన చెట్లు గల బురద నేల! అక్కడి మనుషులు చిరిగిన బట్టల్లో ఒంటినిండా చెమటతో సుత్తులతో కొండ రాళ్ళని పగల కొడుతూ కనిపించారు. మాసిపోయిన, కంపుకొట్టే బట్టల్లో వున్న సువర్చల వచ్చి అతన్ని రిసీవ్ చేసుకుంది.

"ఇదేమిటి? నిన్న ఇక్కడో పార్కు అందమైన హోటళ్ళు అప్సరసలా నువ్వు! ఇవాళ బురదనేల, అసహ్యంగా కనిపించే నువ్వు. ఏమిటీ మాయ?" బిత్తరబోతూ ప్రశ్నించాడు అనిరుద్ధేశ్వరరావు.

సువర్చల సన్నగా నవ్వి సమాధానం చెప్పింది.

"నువ్వు ప్లాట్స్ అమ్మ బోయే ముందు అక్కడ అంతర్జాతీయ ఎయిర్ పోర్టు వస్తుందని, బస్ డిపో వస్తుందని, ఇలా ఎన్నో అబద్ధాలాడి, వాటిని అంటగడతావుగా. నిన్నటిదంతా నీకు ఈ నరకం అంటగట్టడానికే నీవు చేసే

ఓ యమభటుడు కొరడా ఝుళిపిస్తూ అనిరుద్ధేశ్వరరావు చేతికొక పెద్ద సుత్తి నిచ్చి చెప్పాడు.

"మాటలు తర్వాత. ముందు పన్లోకి దిగు"

-మల్లాది వెంకట కృష్ణమూర్తి.



## సంగీతంలో - ఉస్తాద్ సాము గరిడీల్లో - వస్తాద్

# ఆదిభట్ల నారాయణదాసు



అతను శ్రీకృష్ణుడై పాంచజన్యం పూరిస్తాడు!!
అతనే సవ్యసాచై గాండీవం సంధిస్తాడు!!
అతడే అంధుడైన ధృతరాష్ట్రుడై అలమటిస్తాడు...
అతనే అభిమన్యుడై... మహా సంగ్రామంలో మరణిస్తాడు...!!
అతనే రథమౌతాడు... అతనే గజమౌతాడు...
అతనే ఫీంకారమౌతాడు... అతనే ఓంకార మౌతాడు...
అతనే నృత్యం... అతనే గానం...
అతనే... సంగీత సాహిత్య విశ్వరూపం!!
అతని మాధ్యమం
హరికథ!!
అతనే శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు!!
దాసుగారు సరస్వతీ పుత్రుడు కాదు.
సాక్షాత్తూ శారద అవతారం...
ఈయన... 1864 ఆగస్టు ముప్పై ఒకటో తేదీన శ్రీకాకుళం జిల్లా అజ్జాడలో జన్మించారు... తల్లి వెంకట నర్సమ్మ తండ్రి వెంకట చైనులు...
సరే నాలుగేళ్ళు వచ్చేసరికి తల్లి నర్సమ్మగారు... పిల్లాణ్ణి తీసుకునీ 'గుంప' అనే శైవ క్షేత్రానికి ఎడ్ల బండిలో వెళ్ళింది...
అక్కడ దిగగానే ఓ పుస్తకాల కొట్టులో భాగవతం చూశాడు సూర్యనారాయణ... కావాలన్నాడు!
పిల్లాణ్ణి చూసి... 'నీకు భాగవతాలు యెందుకయ్యా కుర్రోడ' అన్నాడు కొట్టు వాడు 'రంగయ్య'...
అలాగేం అనుకునీ భాగవతంలో పద్యాల్ని టకటకా అప్పగించేశాడు సూరిబాబు. అంతే అవాక్కయిపోయిన 'రంగయ్య' పిల్లాణ్ణి ఎత్తేసుకునీ ముద్దు పెట్టేసుకునీ భాగవతంతో పాటు ఐదు రూపాయల దక్షిణ కూడా చేతిలో పెట్టి... దణ్ణం పెట్టాడు ఆ పుంభావ సరస్వతికి.
పదేళ్ళొచ్చే సరికి తాతగారి గ్రామం 'వంతరం' వెళ్ళాడు...
అరుగు మీద కూర్చునీ రాగ యుక్తంగా భాగవతం పద్యాలు అంటోంటే
అబ్బురపడ్డ వాసా సాంబయ్యగారు... "ఏమే... వాణ్ణి నాతో పంపించెయ్య కూడదూ... "అద్భుతమైన సంగీత విద్వాంసుణ్ణి చేసి పారేస్తాను..." అన్నాడు... కుర్రాడిలోని విద్యుత్తుని గ్రహించి చనువుగా.
తల్లి లక్ష్మీ నరసమ్మ సరేనంది!!
అంతే అక్కణ్ణుంచి... గురు శిష్య సంబంధం ఆరంభమైంది...
సంగీత జ్యోతి వెలిగింది...
వెలుగులు విరజిమ్మడం ఆరంభించింది...
కవిత్వం అబ్బింది...
గానం అబ్బింది...
బంగారానికి పరిమళం అబ్బింది!...
అదేగాకుండా... విజయ నగరం మహారాజా వారి కళాశాలలో ఇంగ్లీషు విద్యాభ్యాసం... ఒక్క ఇంగ్లీషేనా... పార్శీ... అరబ్బీ... ఉర్దూ, సంస్కృతం మొత్తాన్ని ఆపోసన పట్టేశారు!!!
ఈయనలోని అపూర్వమైన విద్య... 'హరికథ'ని కనిపెట్టీ... విజయనగరంలో తొలి 'హరికథ' ప్రోగ్రాం పెట్టించింది జయంతి కామేశంగారు!!
జన్మించాడు... తొలి హరిదాసు!!
హరికథా పితామహుడు!!...
మైకులు లేవు... ఎలక్ట్రిసిటీ లేదు...
నూనె దీపాలు... కంచుకంఠం!
శంభో!! అన్న శంఖనాదం... ఊరు ఊరూ ఉలిక్కిపడింది...
హరికథ ఆరంభమైంది!... ఓ చేత్తో చిడతలు... కాలికి గజ్జెలు...
ఆ రూపం ఎలా ఉందయ్యా అంటే!!

ఒడలికి చందనంబుచిత రీతినలంది...
కనులం గాటుక నొడికముగదీర్చి
నుదిటిపై తిలకంబును పదిలంబుగా దిద్ది
సిగముడిపై పూల చెండు జుట్టి
చిక్కని మెడలోన జక్కని యొకపూల
దండ సొంపగురీతి నుండ జేసి
పట్టు పుట్టము గట్టి, పైన బనారసు
కండువా నడుమున గ్రాల జుట్టి
వేళ్ళగట్టిన గజ్జెలు ఘల్లుమనగ
జేత శ్రీరామ పట్టాభిషేక పటము
బూని, మానవ గంధర్వుడే నాతండు
సనియె నల్లన నల రాజ సౌధములకు...

ఆయన రూపాన్ని ఇలా చిత్రించారు. పేరేశ్వర నరసింహ కవి వర్యులు...
మెల్లి మెల్లిగా... .నారాయణ దాసుగా కీర్తి... ఆంధ్రేతర ప్రాంతాలక్కూడా పాకడం మొదలెట్టింది...
మైసూరు మహరాజా వారి ఆహ్వానం అందింది... రానుపోను ప్రయాణం ఖర్చులు ముందే పంపించి మరీ పిలిపించుకున్నారు. దర్బారుకు ఆహ్వానించి హరికథ చెప్పించుకున్నారు... తృప్తి పడక... వీణ వాయించమని కోరారు...
వీణా వాదనకీ... హరికథకీ ముచ్చటపడి పోయిన రాజావారు... ఆ వాగ్గేయకారుణ్ణి... బంగారు మురుగులు... రెండు జతల శాలువాలు, ఒక వీణ, ఒక తంబుర, వెయ్యి నూటపదహార్ల వెండి రూపాయల బిళ్ళల నంచి ఇచ్చి గౌరవించుకున్నారు... ఇదే నారాయణ దాసు గారికి లభించిన మొదటి సన్మానం.
ప్రిన్స్ చార్మింగ్ (జగన్మోహనుడు)గా ప్రసిద్ధి చెందిన ఆనందగజపతివారు... కళాకారులకి మాత్రం తలొగ్గేవారు. దాసుగారు ఆస్థాన విద్వాంసులుగా ఉండగా ఒకరోజు రాజావారు ఫలానా రాగం పాడమని అడిగారట... దాసుగారెందుకో పాడలేదు.!
రాజావారు కోపం తెచ్చుకోకుండా వెళ్ళి పోయారు... తర్వాత ఎప్పుడో దాసుగారు వ్యాయామం చేస్తుండగా... ఉన్నట్టుండి ఆనందగజపతులు

అడిగిన రాగాన్ని పాడటం ప్రారంభించారు... గంటయింది! రెండు గంటలయింది!!! మూడు గంటలయింది!!! నాలుగు గంటలయింది!!!! అది వ్యాయామశాలో... సంగీతశాలో అర్థంకాలేదు. జనం పోగు పడిపోయి పరవశించి పోయి వింటున్నారు.
పాట్టం అయిపోయింది!... అప్పుడు చూసుకుంటే దాసుగారి వొంటిమీద గోచీతప్ప ఏమీలేదు.. సిగ్గుపడిపోయారు...
అయితే... ఆ జనంలో ఓమూల ఆనంద గజపతులు వారు కూడా ఉన్నారు...
తనుకోరిన రాగాన్ని ఆస్వాదిస్తూ...

## దాసుగారి జీవితంలో కొన్ని ఘట్టాలు!

ఓ సారి ఒరిస్సా వెళ్తే... రాత్రికి రాత్రి అంబరీష చరిత్రని రాసి మరునాడు ఉదయం హరికథగా చెప్పారట...
1884-85 అలాగే 'లోకనాథం' అనే ఊళ్ళో సంగీత సాహిత్య అష్టావధానం.
1886: మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణత... విశాఖపట్టణంలో రెండు నెలల్లో పన్నెండు హరికథలు చెప్పడం విక్టోరియా మహారాణి జూబిలీకి ప్రత్యేక ఆహ్వానంపై హరికథా కాలక్షేపం... గజేంద్ర మోక్షం రచన... వివాహం!
1888 - విశాఖపట్టణంలో ఎఫ్.ఎ. చదువు... ఖసింకోట జమీందారుని హరికథల చేత మెప్పించి స్కాలర్‌షిప్ సంపాదించడం. విశాఖలో '80' హరికథలు చెప్పడం. అల్లిపురం జమీందారు హవేలీలో సాహిత్య సంగీత అష్టావధానం... పిఠాపురం రాజా వారిచే సన్మానం.
1889 - బాటసారి కావ్యరచన, కాకినాడ నాటక సమాజంవారికి (మహాకవి) కాళిదాసు విక్రమోర్వశీయం రూపకం ప్రదర్శన శిక్షణ... రాజు పాత్రధారణ.
బందరులో టికెట్టుపెట్టి అష్టావధానం - కొందరు సంగీత విద్వాంసులకు శృంగభంగం.
1890 - సారంగధర నాటిక రచన - గంజాం, ఉర్లాం మండలంలో హరికథా గానం.
1894 -స్వీయ చరిత్ర రచన - మైసూర్ మహారాజా వారి ఆస్థానంలో సంగీత కాలక్షేపం - సన్మానం.
1895 - ఖసిం కోటలో హరికథాగానం - తిరుపతి వెంకట కవులచే మెప్పు!
1898 - ప్రహ్లాద చరిత్ర, రుక్మిణీ కళ్యాణం, (శ్రీకృష్ణ జననం, సంస్కృత హరికథ రాయటం)
1900-01 - ఉర్దూ- పార్శీ-అరబ్బీ భాషల అధ్యయనం.
1902 - భీష్మ చరిత్ర, సావిత్రి చరిత్రల రచన.
1903 - ఏకైక పుత్రిక, సావిత్రి జననం.
1910 - 'తారకమ్' అన్న సంస్కృత ప్రబంధ రచన - జర్మన్ ప్రొఫెసర్ మెప్పు.
1912 - రాజమహేంద్రవరం వీరేశలింగం పంతులు గారిచే నవరత్న భుజకీర్తి ప్రధాన సన్మానం.
1913 - రేవా మహారాణి సర్కార్‌చే సన్మానం
1913 - కాశీయాత్ర... కలకత్తాలో శ్రీకృష్ణ జననం హరికథ విని విశ్వకవి రవీంద్రుడు మెచ్చుకొనడం.
1914 - బందరులో వీణా వాదనకు చల్లపల్లి రాజా వారిచే గండపెండేర సన్మానము... కాశీ శతక రచన.
1916 - భార్యా వియోగం
1919 - విజయనగరం... సంగీత కళాశాల ప్రిన్సిపాల్ పదవిని ఆవిష్కరించడం.
ఇలా ఒకటా రెండా!. ఆయన జీవితంలో జరిగిన గండ పెండేరాలు, గజారోహణలు... సన్మానాలు... సత్కారాలు. సాక్షాత్తూ సార్వభౌముడు శ్రీనాథుడు.... మళ్ళీ జన్మించి... కనకాభిషేకం చేయించుకున్నట్టు లేదూ!...
**ఆఖరికి బార్న్‌వెల్ అనే దొరగారు.. ఈయన ప్రజ్ఞా పాటవాల్ని అపూర్వ సాహితీ శక్తికీ అబ్బురపడీ... 'నోబుల్ బహుమతి' కోసం ప్రోత్సహించాడు... కానీ దాసుగారు... నోబుల్ ప్రైజుని తృణప్రాయంగా భావించి... ప్రయత్నం చెయ్యలేదు.**
ఒకవేళ... దాసుగారికి నోబుల్ ప్రైజ్ వచ్చి వుంటే... ఆయన సంగతి ఎలా ఉన్నా... ఒక అపూర్వ కళారూపం 'హరికథ' బతికి పోయేది... మనకా యోగం లేదు!!
ఒకసారి దాసుగారు... కన్యాకుమారి వెళ్ళి అక్కడి అమ్మవార్ని పూజించి... దేవీస్తవం చేసి... అక్కడే 'దశవిధరాగ నవతి కుసుమ మంజరి' అనే సంగీత సాహిత్య ప్రబంధాన్ని రాశారు!. ఇదో కొరకని కొయ్య... దాని గురించి ఆయన మాటల్లోనే...
"ఈ గ్రంథం సంస్కృతాంధ్ర వాఙ్మయానికి, కర్ణాటక సంగీతానికీ తుదిమెట్టు"
దీనికి ఉపోద్ఘాతం రాయమని ద్వారం వెంకటస్వామి నాయుడు గారిని... పారుపల్లి రామకృష్ణయ్య పంతులీ... కర్రా సూర్యనారాయణ గారికీ ఇచ్చారు... అంతా మహా విద్వాంసులే... అయితే అందరూ ఈ గ్రంథాన్ని పరిశీలించి. తాము ఈ గ్రంథానికి ముందు మాట రాయడానికి అనర్హులమని
సవినయంగా ఒప్పుకున్నారట... అదీ దాసుగారి దమ్ము...
అన్ని భాషల్ని ఆపోసన పట్టిన దాసుగారు...



## తనికెళ్ల భరణి

పిఠాపురాన్ని మణి ప్రవాళ భాషలో ఇలా వర్ణించారు!!
సంస్కృతం
భ్రాజలే కుక్కుటేశ్వర మాధవాలయా భ్యాం...
ఘనరూఢ సాదంతరేణ
పార్శీ
హాసిల్ హమీష జహన్ తజ్ నమూన బిష్మిత్తు
సాపిర్బి హిరిపాల
ఇంగ్లీష్
రావ్ సూర్యారావ్ రాజా బహదూర్డి... చారిట
చిత్రాల్యె ప్రెజెంట్స్ ఎర్రెప్రి...
తెలుగు
చదువుల పుట్టిల్లు.. చల్వ తెమ్మెర జల్లు మేల్నాల్లు
పొగడిక మీరజెల్లు
మేటి పంటల టెంకి కల్మి మెడలంకి
బెస్టుటేని నొడవరీ యిస్ట్ ది సీజె
లుర్దు కీర్ర జనన్ జనల్ మీర్జనన
పీఠకాపురి మేవ తాలిష్ట పమిహ...
'హరిదాసు' పేరెత్తగానే... నారాయణదాసు గుర్తొస్తారంటే... ఆయన మన మనసుల మీద గుద్దిన ముద్ర ఎన్ని తరాలకైనా చెరగిపోదు. అవధానం పేరెత్తితే తిరుపతి కవుల కలాలకు మొక్కిగానీ ముందుకెళ్ళలేం. అలాగే 'హరికథ' పేరెత్తితే నారాయణదాసు గారికి దాసోహమనక తప్పదు.
ఇంతటి వాగ్గేయకారుడు... 1945వ సంవత్సరం... జనవరి రెండోతేదీన (సరిగ్గా ఆరోజే త్యాగరాజస్వామి వారి జయంతి) పరమపదం పొందారు!!
ఇంతటి ప్రతిభా వంతుణ్ణి స్మరించుకునే అదృష్టం కలగడం మనపూర్వజన్మ సుకృతం.

(డాక్టర్ సి. విజయలక్ష్మి గారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

- భరణి




## సీమసింహం

'డాడీ' సినిమాతో పాటల రచయితగా పరిచయమైన శ్రీనివాస్ సాహిత్యంలో డిగ్రీలు, రీసెర్చ్‌లు చేయక పోయినా



గాను పాటల రచయితగా మంచి పట్టునే సంపాదించుకున్నాడు. తొందరగానే పేరు తెచ్చుకున్నాడు. 'సీమసింహం' లో 'పోరీ హుషారు గుందిరో హైటెమో ఆరుందిరో' పాట రాసిన శ్రీనివాస్ తన అనుభవాన్ని ఇలా వివరిస్తున్నారు.

"మొదట 'రెండు జళ్ళ పాప' ట్యూన్ ఇచ్చారు. ఆ ట్యూన్‌కి రాసిన పాట సెలెక్ట్ చేసారు దర్శకుడు రామ్‌ప్రసాద్. ఆ సమయంలోనే నేను స్వయంగా ట్యూన్ కట్టి రాసుకున్న మూడు పాటల్ని ఆయనకి వినిపించాను. రామ్‌ప్రసాద్‌గారు ఈ పాటల గురించి మణిశర్మగారితో చెప్పారట. ఆయనకి 'పోరిహుషారు గుందిరో' పాట తెగ నచ్చిందట. వెంటనే నన్ను చెన్నై పిలిపించారు. 'రెండు జళ్ళ పాప' ట్యూన్ భువనచంద్ర గారి కిచ్చి, 'పోరి హుషారు' పాటను నాకిచ్చారు. పాటలన్నీ చూసిన బాలయ్యబాబు నా ఫోన్ నెంబర్ గురించి ఎంక్వైరీ చేసి "ఈ సినిమాలో నీ పాటే హైలెట్" అని ప్రశంసించడంతో పాటు, మా కుటుంబ సభ్యులందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పారు. అంత పెద్ద హీరో ఇంత ఫ్రెండ్లీగా వుంటారని నేను ఊహించలేదు. ఈ పాట నా జీవితంలో ఓ తీపి గుర్తు" అని చెప్పారు శ్రీనివాస్.

## నువ్వు లేక నేను లేను

కథానాయకుడిగా తరుణ్‌కిది ఐదవ సినిమా. అతని



ఖాతాలో రెండు హిట్లు, రెండు ఫ్లాప్‌లు వున్నాయి. ప్రతిష్ఠాత్మక సురేష్ ప్రొడక్షన్స్ బ్యానర్‌లో యనమదల కాశీ విశ్వనాథ్‌ని దర్శకుడిగా పరిచయం చేస్తూ డి.సురేష్‌బాబు నిర్మించిన ఈ చిత్రం సంక్రాంతి పోరులో వుంది. తక్కువ సమయంలోనే ఆడియో జనరంజకమైంది. ఈ సినిమాలో మీకు బాగా నచ్చిన పాట ఏదని అడిగితే తరుణ్ చెప్పిన సమాధానమిది.

"నిండు గోదావరి కదా ఈ ప్రేమ. అందరికీ బంధువుగా ఈ ప్రేమ' పాట ఎందుకో మొదట్నుంచీ నన్ను బాగా ఆకట్టుకుంది. పాట సుతిమెత్తగా వుంది. వింటుంటే మనసుకి హాయిగా అనిపిస్తుంది. ఈ పాటని రాజమండ్రి గోదావరి అందాల మధ్య చిత్రీకరించారు."

## మనసంతా నువ్వే

'మనసంతా నువ్వే'లో ఏ పాట నచ్చిందని అడగ్గానే "ముందు నన్నో విషయం



చెప్పనీయండి" అంటూ మొదలు పెట్టారు యల్.బి.శ్రీరాం. "ఎంతో నచ్చితేగాని కాగితం మీద కలం పెట్టలేను. రచయితగా అది నా బలహీనత. పాట వింటున్నప్పుడు కూడా అదే తత్త్వం. సంగీతం మీద కన్నా సాహిత్యం మీద ముందు దృష్టి పోతుంది. అదెంతగా ఉంటుందంటే రెహమాన్ పాట వచ్చినప్పుడు కూడా సాహిత్యం అర్థమయ్యేదాకా వింటూనే ఉంటాను. ఆ అలవాటు వల్ల 'మనసంతా నువ్వే'లో 'తూనీగా తూనీగా' నాకు తెగ నచ్చేసింది. పిల్లల లాంగ్వేజిలో ఎంత బాగా రాశారో సిరాశాస్త్రి! సిరాశాస్త్రి అని సీతారామ శాస్త్రిగార్ని ఎందుకున్నానంటే అందరూ కలంలో సిరా నింపి రాస్తారు మన సిరా శాస్త్రిగారు మాత్రం కలంలో మనసు నింపి రాస్తారు. అది ఈ పాటలో ఇంకా బాగా తెలుస్తుంది" అని పూర్తి చేశారు యల్.బి.శ్రీరాం తన స్టయిల్‌లో.

## నువ్వు నాకు నచ్చావ్

గాయనిగా, నటిగా, యాంకర్‌గా అందరికీ తెలిసిన విజయలక్ష్మి 'నువ్వు నాకు



నచ్చావ్' సినిమాలో 'ఓ ప్రియతమా' పాటను తన కిష్టమైన పాటగా పేర్కొంది. ఆ పాట నచ్చడానికి గల కారణాలను వివరిస్తూ - చాలా సినిమాల్లో పాటలు చూస్తుంటే అవి ఏ సీన్ తర్వాతనైనా పెట్టుకోవచ్చు అనిపిస్తాయి. అదే హీరో హీరోయిన్ కాంబినేషన్‌లో ఇంకో సినిమా వస్తే అందులోనైనా పెట్టుకోవచ్చు - అన్నట్టుంటాయి. కానీ ఈ పాట అలా కాదు. సిట్యుయేషన్ సాంగ్ అంటే అర్థం ఈ పాటని చూసి తెలుసుకోవాలి. మెలోడియస్ ట్యూన్, సకుటుంబ సపరివార సమేతంగా చూడదగ్గ చిత్రీకరణ, ఇవికాక ఎంతో రిఫ్రెషింగ్ వినిపించిన బాలూగారి కంఠం ఇవన్నీ ఈ పాట నాకు నచ్చేట్టు చేసాయి-" అని అంది.

## టక్కరిదొంగ



ఈ చిత్రంలో రెండు పాటలు రాసిన కులశేఖర్ ఆ పాటల గురించి ఇచ్చిన వివరణ. "హీరో మహేష్‌బాబుకి, దర్శకుడు జయంత్‌కి ఫస్ట్‌టైమ్ పాటలు రాసే అవకాశం లభించింది. ఆ రెండు పాటల్లోనూ మంచి మాస్ ఎలిమెంట్స్ వున్నాయి. మహేష్ అభిమానులని అలరించే విధంగా రూపుదిద్దుకున్నాయి, 'చుక్కల్లో చంద్రుడే చిన్నోడు, సూపుల్లో సూర్యుడే సోగ్గాడు' పాట మాస్‌కి బాగా పడుతుంది. ఆడియో విన్నవారంతా బాగుందని కితాబులిస్తున్నారు. పూర్తి కమర్షియల్‌గా రాయడంతో పాటు వెరైటీ పదాలు కాయినింగ్ చేశాను కూడా. ఇక నేను రాసిన రెండో పాట 'బాగుందమ్మా బాగుంది అమ్మాయియి నీ ముద్దు, మళ్ళీ మళ్ళీ అంటాను అబ్బాయి చంపొద్దు' ఓ విధమైన రొమాంటిక్ ఫ్లేవర్‌తో రాసాను" అని తెలిపారు కులశేఖర్.

## ఆనందం



ప్రముఖ గాయని కోవెల శాంత తనయుడైన నటుడు జెడి చక్రవర్తికి కూడా సంగీతం పట్ల మంచి అభిలాష వుంది. మంచి పాట వింటే పులకరించే రసహృదయం తనది. అందుకే 'ఆనందం' సినిమాలో తనకి ఆనందం కలిగించిన పాట గురించి ఇలా చెప్పుకొచ్చారు.

"ఎవరైనా ఎప్పుడైనా సరిగా గమనించారా' పల్లవితో సాగిన పాట నాకు బాగా నచ్చింది. పాటలో మంచి ఫోర్స్ వుంది. ట్యూన్ బాగుంది. లిరిక్ బాగుంది. శ్రోతకి నిజంగా ఆనందం కలిగించే పాట ఇది. మెలోడి సాంగ్ అయినా ఫ్లోతో కూడిన ఫోర్స్ వుంది. నైస్ సాంగ్" అని వివరించాడాయన.

## స్టూడెంట్ నెం. 1



అటు కన్నడ సినిమాల్లోను, ఇటు హిందీ 'బద్రి' సినిమాలోనూ బిజీగా వున్న పూరీ జగన్నాథ్‌కి మ్యూజిక్ మీద మంచి పట్టు వుంది. అందుకే నేమో అతను చేసిన సినిమాలన్నీ మ్యూజికల్ హిట్ అయ్యాయి. 'స్టూడెంట్ నెం. 1' సినిమాలోని 'కాస్త నన్ను నువ్వు తాకుతుంటే' పాటని ఈ మధ్యకాలంలో తనను బాగా ఇన్‌స్పైర్ చేసిన పాటగా అభివర్ణించారు జగన్. మరింత వివరణాత్మకంగా ఆయన ఆ పాట గురించి చెబుతూ - "చాలా మంచిపాట ఇది. ఈ మధ్య వచ్చిన సాంగ్స్ అన్నింటి మధ్య ఈ ఒక్క సాంగ్ ఓ స్పెషాల్టీతో వుంటుంది. ఈ పాట వింటుంటే ఓ పదేళ్ళు వెనక్కి వెళ్ళి విన్న ట్యూన్‌లా వుంటుంది. ట్యూన్ కంపోజిషన్, సంగీత దర్శకుని గొప్పతనం, అలాగే సాహిత్యం అంతా అద్భుతంగా జత కలిశాయి. ఆ సినిమా నేనింతవరకూ చూడకపోయినా, ఆ సాంగ్ యాడ్ టీవీలో వచ్చిన ప్రతిసారి చూసి బాగా ఎంజాయ్ చేసాను" అని అన్నారు.

## నువ్వు - నేను



ఈ సినిమా ఇటీవలే 150 రోజులు పూర్తి చేసుకుంది. అన్ని సెంటర్లలోనూ ఇప్పటికీ విజయవంతంగా ప్రదర్శితమవుతోన్న ఈ సినిమాలోని పాటలు వయసు తారతమ్యం లేకుండా అందర్నీ ఆకట్టుకోవడం విశేషం. ఈ చిత్ర నిర్మాత జెమినీ కిరణ్ ఇంతకుముందు తమ్మారెడ్డి భరద్వాజ్‌తోను కృష్ణవంశీతోనూ కలిసి 'అంతఃపురం' చిత్రాన్ని నిర్మించారు. తన సహచరుడు జెమినీకిరణ్ నిర్మించిన సినిమాలోని పాటల మీద అభిప్రాయాన్ని తెలుసుకోవాలనిపించి భరద్వాజని 'నువ్వు - నేను' సినిమాలో ఇష్టమైన పాట ఏదని అడగడం జరిగింది.

"నాకు నువ్వు - నీకు నేను టైటిల్ సాంగ్ బాగుంది. ఎందుకంటే పాట సింపుల్‌గా వుంది. మళ్ళీమళ్ళీ వినబుద్దేస్తుంది" అని చెప్పారు భరద్వాజ్.

## ఇట్లు శ్రావణిసుబ్రమణ్యం



ఈ అమ్మాయి పెద్ద అందగత్తె కాకపోయినా గానీ, ఈ సినిమాలో 'శ్రావణి' పాత్రలో నిజంగా జీవించింది. ఈ బెంగాలీ పిల్ల ముంబైలో ఆఫర్ల కోసం వెతికి నిరాశతో వెనుతిరిగిపోతున్న సమయంలో పూరీ జగన్నాథ్ 'శ్రావణి' పాత్రకు ఎంపిక చేసుకున్నారు. ఈ అమ్మాయికి ఈ సినిమాలో నచ్చిన పాట ఏమిటో తెలుసుకుందాం.

"ఈ సినిమాలో ఆఖరి పాట 'నీ కోసం వేచి వేచి చూసెను నయనం' పాటంటే నాకు బాగా ఇష్టం. ఇందులో మంచి మెలోడి వుంది. రిథమ్ వుంది. ఇవి కాకుండా కెమెరామెన్ పనితనం, కొరియోగ్రాఫర్ కంపోజింగ్ బాగా కుదిరాయి. స్వతహాగా నేను బ్యాలేడ్యాన్స్ నేర్చుకుని వుండటం బాగా ఉపయోగపడింది. ఇది సినిమాలో పేథటిక్ సాంగ్‌లా వుండాలి. కానీ చిన్న పెయిన్, విరహం మిక్స్ చేయడంతో సినిమాలకే బాగా హైలెట్ అయ్యింది" అని చెప్పింది తనూరాయ్.

## ఓ చినదాన



ఆమె, తాళి, మనోహరం మొదలైన చిత్రాలకు భాగస్వామిగా వ్యవహరించిన ముళ్ళపూడి బ్రహ్మానందం శ్రీ రాజ్యలక్ష్మి కంబైన్స్ బేనర్‌పై ఇ.సత్తిబాబు దర్శకత్వంలో 'ఓ చినదాన' చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్రంలో పాటలన్నీ తనకిష్టమన్నట్టు ముళ్ళపూడి బ్రహ్మానందం చెప్పారు. ఐదు పాటల్లో మిమ్మల్ని బాగా ఆకట్టుకున్న పాట ఏదని ప్రశ్నించగా - "ఓ చినదాన" టైటిల్ సాంగ్ బాగుంది. విన్నంతసేపు మళ్ళీ మళ్ళీ వినాలనిపిస్తుంది. నో డౌట్. ఏకగ్రీవంగా ఈ పాట అందరికీ నచ్చింది, నచ్చుతుంది. సినిమాలోని విషయమంతా ఈ పాటలోనే వుంది. ఈ పాటలో అన్నీ బాగా కుదిరాయి. సాహిత్యంగానీ, సంగీతం గానీ బాగా జత కలిశాయి. జూనియర్ మహమ్మద్ రఫీగా పేరు తెచ్చుకున్న దేవాశిష్ ఈ పాటను పాడటంతో ఇంకా కొత్తగా వినిపిస్తుంది" అని తెలిపారు.



"ఏరా... సమాధుల దగ్గర పార్క్ చేసిన కారునే ఎందుకు దొంగిలించావ్?"
"డ్రైవర్ చనిపోయి వుంటాడని అనుకున్నానురా..."



"గజ దొంగ... గజ ఈతగాడు అంటారు కదా... మరి అదే మొండివాళ్ళ దగ్గర కొచ్చే సరికి గజ మొండి అనకుండా జగ మొండి అని అంటారేంటి?"
"మొండి వాళ్ళది ఎప్పుడూ రివర్స్ గేరే కదా... అందుకేనేమో?"



వేగంగా పోతున్న కారుని ఆపి "గంటకు 60 కి.మీ. వేగంతో వెళ్ళ వలసిన ప్రాంతంలో నువ్వు 100 కి.మీ. వేగంతో వెళ్తున్నావ్... చలాన్ రాయాలి ఇంతకూ నీ పేరేంటి?" అంటూ కారాపి అడిగేడు ట్రాఫిక్ పోలీసు జేబులోంచి పుస్తకం లాగుతూ
"యాజ్ఞవల్క్య విష్వక్సేన శర్మ" అని తాపీగా బదులిచ్చాడు కారులో ఉన్నాయన.
"సర్లే... ఇంకెప్పుడూ ఇలా చెయ్యకండి... ఏదో పెద్దవారని ఈ సారికి వదిలేస్తున్నాను..." అంటూ పుస్తకం మూసేశాడు ట్రాఫిక్ పోలీసు పేరును తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ రాయటం చేతకాక.




# విపరీతాతి తెలివి తేటల స్పెషల్






"అంత పిసినారితనం పనికిరాదురా... నీ గోళీల్తో చెల్లాయిని కూడా ఆడుకోనివ్వాలి...
"ఆడుకోనిస్తున్నానమ్మా... కానీ అదే తీసేసుకుంటానంటోంది..."
"చెల్లాయి అలాంటి పిల్ల కాదే..."
"ఎందుక్కాదూ... అప్పుడే రెండు గోళీలు మింగేసింది కూడా..."



"ఫుల్ టిక్కెట్ ఏంటీ... రోజూ హాఫ్ టిక్కెటే కదా నువ్విచ్చేది!?"
"రోజూ వచ్చి నట్టు నిక్కర్‌లో రాకుండా మరి ఫాంటెందుకు వేసుకున్నావ్... అందుకే..."



"ప్రపంచంలోనే అధికంగా మంచు కురిసే ప్రాంతాల్లో లండన్ ఒకటని చెబుతుంటారు... కానీ అంత కన్నా దట్టంగా మంచు కురిసే ప్రదేశానికి నేను ఆ మధ్య వెళ్ళాను తెలుసా?
"ఆహా!? ఇంతకీ ఆ ప్రదేశం పేరేంటి... ఎక్కడుందది?"
"ఏమో నేనేం చెప్పగల్ను ఏ ప్లేసో పోల్చుకోడానికి వీల్లేనంతగా మంచు కురుస్తుంటే..."



ఇద్దరు పర్వతారోహకులు సూది మొనలా... నిట్ట నిలువుగా వున్న ఎత్తయిన కొండను ఎక్కటానికి అష్ట కష్టాలూ పడుతున్నారు. ఎలాగో అలా ఒకడు కొంచెం పైకి వెళ్ళాడు. రెండో వాడు కిందికి జారి పోతుంటే వాణ్ణి తాడు పెట్టి పైకి లాగటానికి ప్రయత్నిస్తున్నాడు పైవాడు. బాగా లాగి లాగి వుండటం చేత ఆ తాడు కూడా తెగి పోయేందుకు సిద్ధంగా వుంది. రెండో వాడికి పైప్రాణాలు పైనే పోయేటట్టు వున్నాయ్... కొంచెం ధైర్యం తెచ్చుకొని "ఒక వేళ ఈ తాడుతెగిపోతే ఏమవుతుందిరా?" అంటూ గట్టిగా అరిచాడు
"ఏం బాధ పడకులే... నాదగ్గర యింకో తాడుంది..." మామూలుగా బదులిచ్చాడు మొదటి వాడు.

# విపరీతాతి తెలివి తేటల స్పెషల్









భుజానికి ఓ సంచీ తగిలించుకుని... ఆ చేత్తో ఈ చేత్తో రెండు సూట్ కేసులు పట్టుకుని స్టేషనులోకి వచ్చీ రాగానే కదలిపోతున్న రైలు చూసి దాని వెనుక పరుగులంకించుకున్నాడు ఓ ప్రయాణీకుడు. అందుకోడానికి పరుగెత్తి... పరుగెత్తి... అందక ఆయాసపడుతూ... రొప్పుతూ... చెమటలు కక్కుకుంటూ నిరాశగా ఓ చోట నిలబడి పోయాడతను.

"ఏంటండీ... రైలు తప్పి పోయిందా?" జాలిగా అడిగేడు రైల్వే కూలి.

"అబ్బే... అదేం కాదు... ఆ రైలూ... దాని వాలకం ఏదీ నాకు నచ్చలేదు... అందుకే అలా వెంటపడి దాన్ని స్టేషను నుంచి తరిమి తరిమి కొట్టా..." అన్నాడు రైలు తప్పి పోయిన ఆ యువకుడు ఒళ్ళుమండి.



నదిలో ఈత కొట్టడానికి దిగబోతూ పక్కనే ఆడుకుంటున్న పిల్లల్ని... "ఈ నదిలో సొర చేపలు లేవుకదా?" అని ప్రశ్నించాడు ఓ వ్యక్తి "లేవు... లేవు..." ముక్త కంఠంతో చెప్పారు పిల్లలంతా.

ఛట్టున నదిలో దూకి ఈత కొడుతూ... ఎందుకో మధ్యలో అనుమానం వచ్చి... "ఈ నదిలో సొర చేపలు లేవని ఖచ్చితంగా మీకు ఎలా తెలుసు" అని అడిగేడు.

"లేవు సార్... వాటికి మొసళ్ళంటే చచ్చేంత భయం..." అన్నారా పిల్లలు ఏకగ్రీవంగా.



"ఏంటీ... మీ తమ్ముడు నిన్ను తలమీద పారతో కొట్టాడా? అందుకని వాడిని అరెస్టు చేయాలా... పారతో కొట్టాడంటున్నావ్ మరి తలమీద దెబ్బ లేమీ కనబడ్డం లేదేం?"

"నా తలచూస్తే ఏం తెలుస్తుంది సార్... వచ్చి పార చూడండి. మీకే తెలుస్తుంది..."



"కెమిస్ట్రీ పరీక్ష అంత దారుణంగా రాశానంటున్నావేంటీ... తొడుక్కున్న ఫుల్ హ్యాండ్స్ షర్ట్ లోపల సూత్రాలన్నీ రాసుకున్నానని చెప్పావ్ కదురా...!?"

"పొరపాటున కెమిస్ట్రీ చొక్కా బదులు లెక్కల చొక్కా తొడుక్కుని వెళ్ళాన్రా..."




"ఒరేయ్... నీ ప్రోగ్రెస్ రిపోర్టు ఏమీ బావుండలేదు. మార్కులు చూడు ఎంత ఛండాలంగా వచ్చాయో... నువ్వు మంచి మార్కులు తెచ్చుకుంటే సైకిల్ కొనిపెడతానని చెప్పాను కదా... నువ్వసలు చదవకుండా ఏం చేస్తున్నట్టు?" గట్టిగా కోప్పడుతూ అన్నాడు తండ్రి.

"సైకిల్ తొక్కటం నేర్చుకుంటున్నా డాడీ..." అంటూ చెప్పాడు కొడుకు బహు క్యాజువల్‌గా.



"నాకోసం ఏం చెయ్యమన్నా చేస్తానన్నావుగా మరి చేస్తావా?" అంది అమ్మాయి.

"చెప్పి చూడు" అన్నాడు అబ్బాయి - ఈ దెబ్బతో ప్రేమలో పడిపోతుందన్న నమ్మకంతో.

"ఎంత దూరమయినా వస్తావా?" అందా అమ్మాయి కొంటెగా.

"కావాలంటే పరీక్ష పెట్టి చూడు" అన్నాడా అబ్బాయి ధీమాగా.

"అయితే బొంబాయిలో నా పెళ్ళి. తప్పకుండా రా..." అంటూ వెడ్డింగ్ కార్డ్ చేతిలో పెట్టిందా అమ్మాయి.

# ఆయన గళం అమృతధార....



ఎనిమిది సంవత్సరాల వయసులోనే తొలి ప్రదర్శన ఇచ్చిన మంగళంపల్లి 15 ఏళ్ళు నిండకుండానే 72 మేళకర్త రాగాలను ఔపోసన పట్టిన వాగ్గేయకారుడు. సంగీతానికి తన జీవితాన్ని అంకితం చేసిన బాలమురళీకృష్ణ ఆరున్నర దశాబ్దాల నుంచి సంగీతాభిమానుల హృదయాలకి తన గానమకరందంతో అలరిస్తున్నారు. కర్ణాటక సంప్రదాయ సంగీతంలో దాదాపు 400 వరకు వర్ణాలు, కృతులు, జావళీలు, భక్తిగీతాలు, తిల్లానాలు రచించారు. మహతి, సుముఖం, త్రిశక్తి, ఓంకారి, రోహిణి, ప్రతిమధ్యమావతి, జనసమ్మోదిని, మనోరమ, వల్లభి, లవంగి తదితర రాగాలను సంగీత ప్రపంచానికి పరిచయం చేశారు. తమిళనాడు రాష్ట్ర సంగీత విద్వాంసుడిగానే కాకుండా తిరుమల తిరుపతి దేవస్థానం, శృంగేరి పీఠాలకు ఆస్థాన విద్వాంసుడుగా గౌరవ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. వాగ్గేయకారుడిగానే కాకుండా సంగీత దర్శకుడిగా, సినిమా ప్లేబ్యాక్ సింగర్‌గా, సినీ, రంగస్థల నటుడిగా తదితర కళారంగాల్లో ఎంతో గుర్తింపు పొందారు. అనుభూతిని పంచుతూ పాడటం ఆయన ప్రత్యేకత. ఇప్పటివరకు దేశవిదేశాల్లో 18 వేలకు పైగా ప్రదర్శనల్నిచ్చిన డా. బాలమురళీకృష్ణ తెలుగువాడు కావడం మనందరి అదృష్టం.

ఆయన గళంలోని పరిమళాలు హైదరాబాద్‌లోని నెక్లెస్ రోడ్ వద్ద గతపక్షంలో జరిగిన 'ఫెస్టివల్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్'లో అభిమానులకు మత్తెక్కించాయి. మైమరిపించాయి.... కళాభిమానులు అంతా కుర్చీల్లోంచి లేచి నిల్చుని చప్పట్లతో ఆయన కాన్సర్ట్‌కి స్వాగతం పలికారు. అదీ బాలమురళీకృష్ణ అంటే! బిజీ షెడ్యూల్‌లో కూడా 'హాసం' పత్రిక చూసి ముచ్చటపడి ఇచ్చిన ఇంటర్వ్యూలో కొన్ని విశేషాలు :

**14 ఏళ్ల ప్రాయంలో అసాధారణంగా 72 మేళకర్త రాగాలను మీరు ఏ విధంగా ఔపోసన పట్టగలిగారు?**

నేను ఎనిమిదేళ్లనుంచే కచేరీలు ఇవ్వడం మొదలెట్టాను, ఈ గొంతుతో! ఇదికూడా అదేవిధంగా సాధ్యపడింది.

**మీ బాల్యం గురించి వివరిస్తారా?**

మాది తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలుకాలో గల కుగ్రామం శంకరగుప్తం. 1930 జులై 6న పుట్టాను. నాన్న పట్టాభిరామయ్యగారు ఫ్లూటిస్ట్, మ్యూజిక్ టీచర్. అమ్మ సూర్యకాంతమ్మ గారికి వీణలో ప్రావీణ్యం ఉంది. నాకు రెండేళ్ల వయసులో విజయవాడకు షిఫ్ట్ అయ్యాం. నాన్నగారు నన్ను సంగీతంలో ఎంతో ఎంకరేజ్ చేసేవారు. గాయక సార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి వద్ద సంగీత శిక్షణకు చేరాను. విజయవాడలో 1938లో సద్గురు ఆరాధనోత్సవాలు జరిగాయి. మా గురువుగారి గురువు సుసర్ల దక్షిణామూర్తి గారికి సన్మాన సభ అది. అప్పుడు నా వయస్సు ఎనిమిది. పూర్తి స్థాయిలో నేనే నా మొదటి ప్రదర్శన ఇచ్చానప్పుడు. మొదటి ప్రదర్శన నాకు ఓ గొప్ప అనుభూతి నిచ్చింది. ప్రఖ్యాత హరికథ పెర్ఫార్మర్ ముసునూరి సత్యనారాయణ గారు నన్ను 'బాల' అని పిలిచే వారు. ఆ విధంగా నా పేరుకి ముందు 'బాల'



చేరింది. చిన్నప్పుడు చదువుకన్నా సంగీతమంటేనే నాకు ఎక్కువ ఆసక్తి ఉండేది. అప్పుడే కంజిర, మృదంగం, వయోలా, వయోలిన్‌లు అభ్యసించి ప్రదర్శనలిచ్చి ఇవ్వడం మొదలెట్టాను. కాన్సర్ట్ ఇవ్వడమంటే నాకెంతో సంతోషం.

**చెన్నయ్‌కి ఎలా షిఫ్ట్ అయ్యారు?**

ఏముందీ. నేను ఆల్ ఇండియా రేడియో విజయవాడ, హైదరాబాద్ స్టేషన్లలో చేశాను (మ్యూజిక్ ప్రొడ్యూసర్). బదిలీ మీద మద్రాస్ వెళ్లాం. అంతే.

**తాళ పద్ధతుల్లో మీరు చేసిన ప్రయోగాల గురించి కొంత వివరిస్తారా?**

దీని గురించి మాటల్లో చెప్పడం కష్టం. ఏదైనా వేదిక మీద వివరించవచ్చు. మీరేదైనా ప్రోగ్రాం పెట్టండి.

**మీరు ఏర్పాటు చేసిన ఎం.బీ.కె. ట్రస్ట్, ఇందులో జరుగుతున్న మ్యూజిక్ థెరపీ పరిశోధనల గురించి చెబుతారా?**

ట్రస్ట్ వ్యవహారాలు మొత్తం సరస్వతి అనే ఆవిడ చూసుకుంటున్నారు. ఆవిడ గ్రేట్ ఆర్టిస్ట్. ఆవిడే ట్రస్ట్‌కి మొత్తం ఇన్చార్జ్. నా సాంగ్స్, వర్క్స్, పుస్తకాలు, మ్యూజిక్ ఇలా అన్ని ఇక్కడ భద్రపరుస్తున్నారు. పుస్తకాలు ప్రింట్ చెయ్యడం తదితర పనులను అక్కడ నిర్వహిస్తుంటారు. సంగీతంలో పలు పరిశోధనలు కూడా జరుగుతున్నాయి. శిక్షణ కూడా ఇస్తున్నారు.

**స్విట్జర్లాండ్‌లో మీరు మ్యూజిక్ థెరపి మీద పనిచేసేందుకు అకాడెమీ ఆఫ్ పెర్ఫార్మింగ్ ఆర్ట్స్ అండ్ రీసెర్చ్ నెలకొల్పారు గదా....??**

అదికూడా ఎంబీకే ట్రస్ట్ ఆఫీసే. ఈ ట్రస్ట్‌కి విదేశాల్లో కూడా ఆఫీసులున్నాయి. అమెరికా, కెనడా, సింగపూర్‌లలో ట్రస్ట్ కార్యకలాపాలు కొనసాగుతున్నాయి. మద్రాస్‌లో మాకు ఆఫీస్ ఉంది. త్వరలో లండన్‌లో కొత్తగా ట్రస్ట్ కార్యక్రమాల్ని మొదలెట్టబోతున్నాం.

**సంగీతానికి మీరెంతో విస్తృతమైన సేవ చేస్తున్నారు. మీ అభిమానుల కోసం ఆంధ్రప్రదేశ్‌లో ట్రస్ట్ కార్యక్రమాలు ఏవైనా మొదలెట్టొచ్చు గదా?**

వారికి కావాల్సివస్తే వారే అడుగుతారులెండి.

**వర్ధమాన కళాకారులకు మీరిచ్చే సందేశం?**

నా వర్కే నా పని. అందరూ బాగున్నారు. ఏం సలహాలు అవసరం లేదు. నాకే వారు మెసేజ్ ఇవ్వాలి. అలాక్కాదు ఏదైనా మెసేజ్ ఇమ్మంటారా, అందరికీ హ్యాపీన్యూఇయర్ చెప్పండి.

**-ఉండవల్లి పవన్‌కుమార్**

| వ. సం. | సంవత్సరం | బిరుదు | ప్రదానం చేసిన వారు |
|---|---|---|---|
| 1. | 1971 | పద్మశ్రీ | భారత ప్రభుత్వం |
| 2. | 1993 | డి.లిట్. | యూనివర్శిటీఆఫ్ హైదరాబాద్ |
| 3. | 1974 | కళాప్రపూర్ణ | ఆంధ్రా యూనివర్శిటీ |
| 4. | 1981 | డి.లిట్. | శ్రీ వెంకటేశ్వరా యూనివర్శిటీ |
| 5. | 1976 | కళాప్రవీణ | జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్శిటి, హైదరాబాద్ |
| 6. | 1995 | నాదబ్రహ్మం | నారదగానసభ, చెన్నై |
| 7. | 1991 | సంగీత కళా శిఖామణి | ఇండియన్ ఆర్ట్స్ సొసైటీ, చెన్నై |
| 8. | 1987 | సంగీత కళా నిపుణ | మైలాపూర్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ, చెన్నై |
| 9. | 1995 | కళాసేవా నిరత | త్యాగరాజ సంగీత విద్వత్ సమాజం, చెన్నై |
| 10. | 1994 | నేషనల్ సిటి జన్స్ అవార్డ్ 92 | భారత ప్రభుత్వం |
| 11. | 1973 | గానసరస్వతి మణిభూషణం | హేమ్‌బాయ్ వైద్యనాథ భాగవతార్ |
| 12. | 1986 | స్క్రోల్ ఆఫ్ ఆనర్ | మహారాష్ట్ర ప్రభుత్వం |
| 13. | 1992 | సప్తగిరి సంగీత విద్వాన్‌మణి | త్యాగరాజస్వామి ట్రస్ట్, ఉత్సవ కమిటీ, తిరుపతి |
| 14. | 1987 | ఉత్తమ సంగీత దర్శకుడు(మాధవా చార్య చిత్రానికి) | 34వ జాతీయ చలన చిత్రోత్సవంలో భారత ప్రభుత్వం |
| 15. | | పద్మవిభూషణ్ | భారత ప్రభుత్వం |
| 16. | 1995 | యునెస్కో మహాత్మాగాంధీ వెండి పతకం | యునెస్కో |
| 17. | 1976 | రజత కమలం (హంసగీతె చిత్రానికి) | 23వ జాతీయ చలన చిత్రోత్సవంలో ప్రభుత్వం (ఉత్తమ నేపథ్య గాయకుడు) |
| 18. | 1987 | కళా సరస్వతి హైదరాబాద్ | ఆంధ్రప్రదేశ్ కళావేదిక, |

ఫంక్షన్స్‌లోగాని, నలుగురు కూర్చుని సరదాగా నవ్వుకునే సమయాల్లోగాని
సులభంగా ప్రదర్శించడానికి పనికొచ్చేలా ధారావాహికంగా
'హాసం' సమర్పిస్తున్న కామెడీ స్కిట్‌లలో నాలుగవది ఇది.

# ఇక్కడ ఆత్మహత్యలు ఆపబడును

-జె.యస్.యన్. స్వామి

ఒక పెద్ద కొండచివర డేంజర్ అని వ్రాసి ఉంది. అక్కడ శ్రీలక్ష్మి కూర్చొని ఒంటరిగా ఆలోచిస్తూ కొండమీద నుంచి రాళ్ళు విసురుతోంది. సడెన్‌గా అక్కడికి రంభ పరిగెత్తుకుంటూ వచ్చింది. ఆ కొండమీద నుంచి దూకి ఆత్మహత్య చేసుకోబోతుంటే, శ్రీలక్ష్మి అడ్డుపడింది.

శ్రీలక్ష్మి : ఏయ్... ఏయ్... ఆగు... ఏంటాపని...?

రంభ: ఏం... సీన్ కన్పించటం లేదా...? సూసైడ్... చేసుకుంటున్నా...

శ్రీలక్ష్మి: చేసుకుందువు గానీ... నీ డెసిషన్ నేను మార్చను గానీ... ఓసారి ఇలా.. రా..

రంభ: (వెనక్కొస్తూ) ఏం... ఎందుకు...? ఎందుకు నన్నాపారు...? నన్ను చచ్చిపోనివ్వండి... (ఆలోచిస్తూ) ఒకవేళ మీరు గానీ నాకు చావులో కంపెనీ ఇస్తారా...?

శ్రీలక్ష్మి: ఆ సంగతి తర్వాత... ముందిది చెప్పు. ఆత్మహత్య చేసుకుంటూ ఇలా కొత్త చీర కట్టుకున్నావేంటి? కొంపదీసి పెళ్ళి చూపుల సీన్‌లోంచి పారిపోయొచ్చేసావా...?

రంభ: నా లైఫ్‌కి పెళ్ళి సీన్ కూడానూ... (అటు-ఇటు నడుస్తూ) నాకు చీరలంటే ఆత్మహత్య చేసుకునేంతిష్టం - నేను కాలేజీకి వెళ్తున్న రోజుల్లో మా అమ్మ నన్ను ఒక్క మంచి చీర కూడా కట్టుకోనివ్వలేదు... నేను చీర కడితే 'నీకు ఇంత పెద్ద కూతురుందా...?' అంటారని భయం... అందుకే... టపా కట్టేటప్పుడైనా... ఓ కొత్త చీర కట్టుకొని... ఈ తనువు చాలించాలని... పొద్దుటే... మా అమ్మ పోపుల డబ్బాలో దాచిన డబ్బులు నొక్కేసి, చందన బ్రదర్స్‌లో ఓ చీర కొనుక్కొని కట్టుకొని, ఈ ప్లేస్ కనుక్కొని మరీ వచ్చా...

శ్రీలక్ష్మి: అబ్బో... కథ కామెడీగా చాలా ఇంట్రెస్ట్‌గానే ఉంది... ఇంతకీ నీ పేరు...?

రంభ: రంభ

శ్రీలక్ష్మి: ... కొంపదీసి నువ్ సిన్మాలలో గానీ యాక్ట్ చేస్తావా...?

రంభ: లేదు... మా అమ్మకి సిన్మాల పిచ్చి... అందుకే నాపేరు మార్చి మార్చి పిలుస్తూ ఉంటుంది. ప్రస్తుతానికి ఈ పేరు రన్నింగ్‌లో ఉంచింది...

శ్రీలక్ష్మి: సర్లే... టైటిల్స్ పూర్తయ్యాయి... కథ మొదలెడదాం... ఇంతకీ ఎందుకు చచ్చిపోవాలనుకుంటున్నావ్...? నీ ఫ్లాష్‌బ్యాక్ ఏంటో చెప్తావా...?

రంభ: నాదో... పేద్ద పేరులేని సిన్మా...

శ్రీలక్ష్మి: అబ్బో... ఎన్ని రీళ్ళో...?

రంభ: సరిగ్గా... పధ్నాలుగు...

శ్రీలక్ష్మి: కలరా...? బ్లాక్ అండ్ వైటా...?

రంభ: అంటే...?

శ్రీలక్ష్మి: కలరంటే రీసెంట్‌గా జరిగింది, బ్లాక్ అండ్ వైట్ అంటే 'లాంగ్ లాంగ్ ఎగో'... జరిగిందని...

రంభ: అమ్మో... అంత ఓల్డ్ స్టోరీ కాదండీ... కలరే... నా కథ కలరే...

శ్రీలక్ష్మి: ఒన్ వేనా...? లేక టూ... వేనా?

రంభ: (శూన్యం లోకి చూస్తూ) ఒకప్పుడు ఒన్ వే... తర్వాత్తర్వాత టు వే... ఇప్పుడు ఏ 'వే' నో తెలియక ఈ 'వే' కొచ్చా...

శ్రీలక్ష్మి: (మనస్సులో: చచ్చేప్పుడు కూడా ప్రాస మిస్సవకుండా ఎంత డీప్‌గా ఇన్వాల్వ్ అయి మరి చెబుతోంది..!?) ఇంతకీ... నీ ఎఫైర్ ఎప్పుడు మొదలైంది?

రంభ: కాలేజీ కుర్రాళ్ళ మధ్య 'నువ్వు' సెంటిమెంట్ నడుస్తూ అందరి నోళ్ళలోనూ 'నువ్వు' ఓ నువ్వుగింజలా నానుతున్న రోజుల్లో...

శ్రీలక్ష్మి: అవునా...!?

రంభ: అవును... ఆ 'నువ్వు' సెంటిమెంట్‌తో ఓ రోజు 'నువ్వు నాకు నచ్చావ్...' అని లెటర్స్ వ్రాసి, 'నువ్వు-నేను ఉ... ఊ... ఊ...' అంటూ అతని రెండు చేతులూ వేళ్ళతో కలిపి సింబాలిక్‌గా చూపించాడు -నువ్వు అడిగితే కొండమీద కోతినే కాదు, ఉదయ్‌కిరణ్ సిన్మాకి



బ్లాక్‌లో టిక్కెట్ కొనైనా చూపిస్తానన్నాడు.

శ్రీలక్ష్మి: సినిమా సెంటిమెంట్‌తో కొట్టాడన్నమాట...

రంభ: ఆఖరికి ఒకరోజు నన్ను హుస్సేన్ సాగర్ దగ్గరకు రమ్మన్నాడు

శ్రీలక్ష్మి: ఏం...? రాకపోతే దూకేస్తానన్నాడా...?

రంభ: అవును... ఆ రోజు నేను తిరస్కరిస్తే విషం తాగేద్దాం అనుకున్నాడట కానీ... విషం కొనుక్కోడానికైనా డబ్బుల్లేని పూర్ క్యారెక్టర్ తనదని చెప్పాడు...

శ్రీలక్ష్మి: ... హుస్సేన్ సాగర్‌లో దూకెయ్యటానికి అభ్యంతరం ఏవిట్ట!?

రంభ: జలుబు చేస్తుందిట... అందుకే విషం అన్నాడు.

శ్రీలక్ష్మి: విషం కొనుక్కోటానికి డబ్బుల్లేక కాదు - విషం తాగే దమ్ములేక డబ్బుల్లేని పూర్ క్యారెక్టర్ అని స్టోరీ కొట్టి ఉంటాడు.

రంభ: నో... నా చంటి అటువంటి వాడు కాదు...

శ్రీలక్ష్మి: ఎలాంటి వాడో ఏంటో నాకనవసరం కాని... మొత్తానికి వాడు అలా అనే సరికి నువ్ మెల్టయి పోయి ప్రేమించేసావ్ కదూ...!?

రంభ: అవును... మెల్ట్ ఐపోవడం మన స్త్రీల జన్మ హక్కనీ, ఆ హక్కుని కాపాడాల్సిన బాధ్యత మన స్త్రీలకు ఎంతైనా ఉందని ఐలవ్‌యూ చెప్పేసా...

శ్రీలక్ష్మి: (మనస్సులో : టీవీ సీరియల్స్ చూసి చూసి, సెంటిమెంట్ పిచ్చి బాగా పట్టింది...)



నాపేరు జె.యస్.యన్. స్వామి. నేను ఆంధ్రాయూనివర్శిటీ క్యాంపస్‌లో ఎం.ఎ (లిట్) చేసాను. అదే యూనివర్శిటీలో ఎం.ఎ. ఫిలాసఫీ ర్యాంక్ సాధించి, రచనపై ఇంట్రస్టుతో, సినిమా రచయితను అవ్వాలనే ధృఢ సంకల్పంతో, ఫిలాసఫీ డిస్ కంటిన్యూ చేసాను.

ఇంతవరకూ ఓ వంద జోకులు, ఒక పదిహేను కథలు అచ్చయ్యాయి. ప్రస్తుతం ఒక సినిమాకు స్క్రిప్టు వర్క్ చేస్తున్నాను... సినిమాలు చూడటం, నవల్స్ చదవటం నా హాబీ. 'హాసం'లో కామెడీ స్కిట్ చూసి ఇన్‌స్పైయిర్ అయి ఈ కామెడీ స్కిట్ రాశాను. మరిన్ని కామెడీ స్కిట్‌లు మీరు మెచ్చే విధంగా వ్రాయాలనుకుంటున్నాను...

రంభ: తర్వాత ఓ ఎండకాసిన పగలు 'మన ప్రేమకు గుర్తుగా ఉంగరాలు మార్చుకుందాం' అన్నాడు మా చంటి.

శ్రీలక్ష్మి: ఏంటి బంగారానివే...?

రంభ: ప్యూర్ గోల్డ్ - ట్వెంటీ టు క్యారెట్స్...

శ్రీలక్ష్మి: మరి మార్చేసావా...?

రంభ: మార్చేసాను.

శ్రీలక్ష్మి: నీ బంగారం ఎంత?

రంభ: రెండు కాసులు

శ్రీలక్ష్మి: మరి వాడిది?

రంభ: పావు కాసు... ఆ తర్వాత చూసాను... అది గోల్డ్ కాదంట... రోల్డ్‌గోల్డ్... అంతే... అప్పట్నుంచీ ఇప్పటి వరకూ నా చంటి కోసం చూసి చూసి, కళ్ళు కాయలు కాసి, కాసి, నా వయస్సు డెయిలీ సీరియల్స్ లెవెల్లో సాగిపోసాగింది... ఇక తట్టుకోలేక... చచ్చిపోవాలని ఇటొచ్చా...

శ్రీలక్ష్మి: సరే... ఓ పదినిముషాలాగు... (అని కూర్చో బెట్టింది)

----కట్----

సీన్ : 2

ఈ లోపు అక్కడికి మేనక పరిగెత్తుకుంటూ వచ్చింది. ఆమె కూడా దూకబోయింది. శ్రీలక్ష్మి ఆమెను ఆపింది.

శ్రీలక్ష్మి: ఏయ్... ఏంటా పని?... ఇలారా... ఆత్మహత్య మహాపాపం అంటారు కదా... మరి ఎందుకు దూకుతున్నావ్...?

మేనక: ఏంటి...? పాపమా... ఎవరికి...? ఆ...?... ఆత్మహత్య చేసుకుంటే చూసేవాళ్ళకు పాపం...

శ్రీలక్ష్మి: అంటే...?

మేనక: చూస్తూ, చూస్తూ ఆత్మహత్యను ఆపకపోతే పాపం కాదా మరి...!?

శ్రీలక్ష్మి: ఓహో ఆ డైలాగ్‌కి క్లారిఫికేషన్ ఇదన్నమాట... ప్చ్... ఇంతకీ ఏంటి నీ కథ...?

మేనక: నాదో పాతిక రీళ్ళ సిన్మా కథ...

రచన: ఎం.వి.యస్.హరనాథరావు | **సినిమా హంగులు** | బొమ్మలు: ఎమ్.ఎస్. రామకృష్ణ

కడుపొచ్చిన వాళ్ళు

జబ్బొచ్చిన వాళ్ళు

కక్కుకుని సినిమాను మలుపుతిప్పడానికి,

పనికొచ్చే 'కథాపళ్లెం'






శ్రీలక్ష్మి: అబ్బో... అంత పెద్దదా...?
మేనక: అవును... ఇంకా ఎడిటింగ్, డబ్బింగ్ పూర్తి కాలేదు...
శ్రీలక్ష్మి: అయినా సరే సెన్సార్ చేసి రెండు-మూడు రీళ్ళలో చెప్పు...!
మేనక: నాది టూ - వే - లవ్ స్టోరీ... 'ఖుషీ' సినిమా ఆడుతున్న రోజుల్లో నా ప్రేమకు ఫౌండేషన్ పడింది. నాది... సారీ... మాది లవ్-ఎట్-ఫస్ట్ సైట్...
శ్రీలక్ష్మి: అబ్బా... యూత్‌ఫుల్ ఎంటర్ టైన్‌మెంట్ అన్నమాట...
మేనక: అవును... నేను ఉదయం పూట కాలేజీకి ఎగ్గొట్టి 'ఖుషీ' సిన్మా చూసి, తిరిగి మధ్యాహ్నం కాలేజీకి వెళ్తున్న టైములో, ఓ అబ్బాయిని చూసాను.. అతనూ.. తక్కువ తిన్లేదు... నన్ను చూసాడు. అంతే... నేనతన్ని ప్రేమించేసాను...
ఆ తర్వాత అతనూ... నన్ను చూసి సేమ్ డైలాగ్ డిఫరెంట్ మాడ్యులేషన్‌లో చెప్పాడు. అంతే... మా ప్రేమకు టైటిల్స్ పడ్డాయి... అతను నాకో ప్రేమలేఖ రాసాడు...
శ్రీలక్ష్మి: అహా... మీ వాడు చిరంజీవి సిన్మాలు గానీ చూస్తాడా...?
మేనక్ లేదు... నా బుజ్జి పవన్‌కళ్యాణ్ ఫాన్... అయినా అలా ఎందుకడిగారు...?
శ్రీలక్ష్మి: అంటే... ఆ లవ్ లెటర్ సీన్... ఏదో సిన్మాలో ఉందిలే... నీ బుజ్జి... డబ్బింగ్, రీమేక్ రైట్స్ లేకుండా కాపీ కొట్టాడేమో అని...
మేనక: (కంగారుగా)... లేదు... మా బుజ్జి ఆ సిన్మా చూడలేదు... అంతా... ఓన్ టాలెంటూ, ఓన్ క్రియేషనే...
శ్రీలక్ష్మి: (వెటకారంగా)... ఆహా... ఓ సారి ఆ కళాఖండం చూడాలని ఉంది...
మేనక: మీకు చూడాలని ఉన్నా... చూపించను... ఒకవేళ వినాలని ఉంటే... విన్పిస్తా... (అంటూ లెటర్ బైటికి తీసి చూపించింది)
శ్రీలక్ష్మి: అవునూ... చచ్చిపోతూ ఈ లెటర్ ఎందుకు తీసుకొచ్చావ్?
మేనక: పోయేటప్పుడు ఓ సారి తనివి తీరా చదువుకోవాలని...
శ్రీలక్ష్మి: సర్లే... విన్పించు...
మేనక: 'ప్రియాతి ప్రియమైన ప్రియా పచ్చడి లాంటి ఓ నా ప్రియా...'

శ్రీలక్ష్మి: ఏంటి...? మళ్ళీ చదువు...
మేనక: 'ప్రియాతి ప్రియమైన ప్రియా పచ్చడి లాంటి ఓ నా ప్రియా...'
శ్రీలక్ష్మి: మీ బుజ్జి కొంపదీసి ప్రియా పచ్చడి స్టాకిస్టా...?
మేనక: అవును... 'నిన్నే రోజైతే ఫిల్మ్ నగర్ బస్టాప్‌లో బస్సు దిగుతుంటే చూసానో... ఆ రోజే... నా మనసు నీకు కొరియర్‌లో పంపించేసా...'
(శ్రీలక్ష్మి 'ఊ' అంటూ ఫీలవుతూ వింటుంది)
మేనక: ప్రియా... నీ కళ్ళు... అవి కళ్ళు కాదు...
శ్రీలక్ష్మి: మరేంటో...!?
మేనక: నీ కళ్ళ జోడు వెనుక ఉన్న ఆ కళ్ళు బుల్లెట్ ప్రూఫ్‌లో భద్రంగా ఉన్న కలువ పువ్వులు...
శ్రీలక్ష్మి: అంత పెద్ద ఉపమానమా... అబ్బో...
మేనక: నీ పెదాలు... పండిన దొండపండును అడ్డంగా కోసినట్టున్నాయ్.
నువ్ నవ్వితే నయాగరా జలపాతం,
నువ్ తుమ్మితే ఉల్కాపాతం,
నువ్ ఏడిస్తే బంగాళాఖాతం,
నీ నడుము సూరేకాంతం...
శ్రీలక్ష్మి: నీ బుజ్జి రైటర్ కూడానా!?
మేనక: అవును... నావల్లే రైటర్ అయ్యాడంట... వినండి...
'నువ్వు... నీ నోటితో ఏది మాట్లాడినా అది నా చెవులకు చేరదు'
శ్రీలక్ష్మి: ఏం... చెవుడా...?
మేనక: కాదు... 'నువ్... నీ నోటితో ఏది మాట్లాడినా అది నా చెవులకు చేరదు... నా హృదయానికి చేరుతుంది... నీ ముక్కు హౌరామెయిల్ వేగంగా వెళ్ళే హౌరా వంతెన...'
శ్రీలక్ష్మి: ఏంటి... నీ బుజ్జి రైల్వేలో గానీ పనిచేసేవాడా...?
మేనక: కొంతకాలం అప్రెంటీస్‌గా చేసాడు. ఓ రోజు నేను కన్పించానన్న ఆనందంతో గ్రీన్ జెండా ఊపబోయి, రెడ్ జెండా ఊపి కోరమండల్‌ని ఆపేసాడు... అనవసరంగా రైలు ఆపాడని, బైటకు పంపించేసారు...
శ్రీలక్ష్మి: పాపం... ట్రాజెడీ... (కళ్ళు తుడుచుకుంటూ) చెప్పు
మేనక: 'నీ బుగ్గపై సొట్టుంటే నువ్వెంత అందంగా ఉంటావో చెప్పలేను...'
శ్రీలక్ష్మి: లేదు.. కాబట్టి చెప్పలేదు...
మేనక: అంతే... నేను ప్రేమలో పడిపోయాను... ఓ రెండు మూడు డ్యూయెట్స్ డి.టి.యస్.లో కూడా వేసుకున్నాం...
శ్రీలక్ష్మి: అబ్బో... మ్యూజిక్ ఎవరు...? ఎ.ఆర్.రెహమానా...?
మేనక: కాదు... వందేమాతరం శ్రీనివాస్... డబ్బులెక్కువని రెహమాన్‌ని నేనే వద్దన్నా...
శ్రీలక్ష్మి: మరింతకీ... ఏడి... నీ బుజ్జి...?
మేనక: మా అన్నయ్య... కన్పిస్తే కాళ్ళు విరిచేస్తానన్నాక ఇక కన్పించడం మానేసాడు. పాపం... నేను వస్తానని కళ్ళల్లో ట్యూబ్‌లైట్స్ వేసుకుని మరీ చూస్తున్నాడేమో, అని అతని కోసం చాలా చోట్ల వెదికాను... ప్చ్... కన్పించలేదు... ఇక నా బ్రతుక్కి ఇలా ట్రాజెడీ ఎండింగ్

ఆ దేవుడు రాసేశాడు... అందుకే... చచ్చిపోదామని ఇలా వచ్చేసా...

శ్రీలక్ష్మి: సర్లే... నీకు క్లయిమాక్స్... నేనిస్తా... ఓ పదినిముషాలు వెయిట్ చెయ్... ఇంకెవరైనా వస్తారేమో చూద్దాం...

(ఆమె కూడా కూర్చుంది)

....కట్....

సీన్ : 3

శ్రీలక్ష్మి ప్రక్కన రంభ, మేనక కూర్చొని ఉండగా, చివరికి ఊర్వశి అక్కడికొచ్చి, వీళ్ళ ప్రక్కన కూర్చుంది. శ్రీలక్ష్మి ఆమెతో మాట్లాడ్డం ప్రారంభించింది.

శ్రీలక్ష్మి: ఏయ్... ఏంటి...? చచ్చి పోటానికొచ్చావా...?

ఊర్వశి: అవును. బాగానే క్యాచ్ చేసారే...

శ్రీలక్ష్మి: మరి దూకెయ్... ఆలస్యం ఎందుకు...? ముహూర్తం ఏమైనా ఉందా...?

ఊర్వశి: కాదు... మా లవర్ చిట్టి... వస్తానన్నాడు...

శ్రీలక్ష్మి: ఇదుగో... వీళ్ళిద్దరూ... కూడా ఆత్మహత్య చేసుకోడానికొచ్చారు... నీకు వీళ్ళిద్దరూ తోడు... ఇంతకీ... తమరి ఫ్లాష్ బ్యాక్ ఏంటో...?

ఊర్వశి: నాది... అందరిలా కామన్ ఫ్లాష్‌బ్యాక్ కాదు... భయంకరమైన ట్విస్ట్‌లతో నిండిన పవర్‌ఫుల్ ఫ్లాష్‌బ్యాక్...

శ్రీలక్ష్మి: అంత డిఫరెంటా... సర్లే... చెప్పు... తమిళ్ వాళ్ళకు స్టోరీ అమ్మొచ్చు...

ఊర్వశి: నేనో అబ్బాయిని ప్రేమించాను... కానీ అతను నన్ను ప్రేమించలేదు... కానీ... అతను చాలా అందగాడు... హృతిక్ రోషన్ రేంజ్‌లో ఉంటాడు... కొంచెం కురచ... కానీ... అతను నన్ను ప్రేమించలేదు... నేను తిరగ్గా, తిరగ్గా... అతను నన్ను ప్రేమించటానికి ఒప్పుకున్నాడు...

శ్రీలక్ష్మి: అది ప్రేమకాదు... వచ్చిన ఫిగర్‌ని ఎందుకు అనవసరంగా ఒదులుకోవటం అనో... లేక సానుభూతో... సర్లే చెప్పు...

ఊర్వశి: ఒకరోజు నా ఫ్రెండ్ లిల్లీని నా అటెండెన్స్ పలకమని, నేను అతనితో సెకండ్ రిలీజ్ 'ప్రేమంటే ఇదేరా' సిన్మాకి వెళ్ళాను... సిన్మా అయ్యాక... 'ప్రేమంటే ఇదే' అన్నాడు... అదేంటో... అప్పట్నించీ 'మనసంతా నువ్వే...' సినిమా దాకా ఎన్ని సినిమాలు చూసినా నాకింకా అర్థంకాలేదు... బహుశా... ఆ అర్థం కాకపోవడమే ప్రేమేమో అన్పిస్తుంది... 'మనిద్దరం బియ్యం-రాళ్ళలా, చక్కెర-గోధుమల్లా, పాలు-నీళ్ళలా డిఫరెంట్ కాంబినేషన్‌లా ఉన్నా సరే కలిసిపోవొచ్చు' అన్నాడు.

శ్రీలక్ష్మి: (మనసులో: కల్తీ వ్యాపారం చేస్తున్నాడేమో... అందుకే కల్తీ అయిపోయింది... ప్రేమ)

మేనక: ఓ రోజు... 'నాకు వంటలు రావు' అన్నాను... 'పర్లేదు... నాకు రుచులు తెలీవు' అన్నాడు... 'నా జీవితపు చివరి గడియ వరకూ నన్నే ప్రేమిస్తూ ఉంటాను' అన్నాడు...

శ్రీలక్ష్మి: తర్వాత...?

మేనక: తనకో గొప్ప సంబంధం వచ్చిందంట... వాళ్ళ అమ్మ-నాన్న మాట కాదన్లేక పెళ్ళిచూపులకెళ్ళాడంట. అందరూ ఓకే చేసి సెటిల్ చేశారంట. వాళ్ళ అమ్మా-నాన్న కోరిక తీర్చటం కోసం అక్కడ తాళికట్టేసి- ఆ తర్వాత డైరెక్టుగా ఇక్కడ కొచ్చేస్తానన్నాడు... ఇద్దరూ కల్సి చచ్చిపోటానికి...

శ్రీలక్ష్మి: మరి... ఏడి... నువ్వొచ్చి గంటైనా తను రాలేదే...?

మేనక: వచ్చేస్తాడు... వచ్చేటప్పుడు గ్రీన్‌లాండ్స్‌లో వన్‌బైటూ చికెన్ బిర్యానీ తీసుకొచ్చేస్తానన్నాడు... బహుశా అక్కడ లేటయ్యిందేమో...

శ్రీలక్ష్మి: చికెన్ బిర్యానీ... ఎందుకు?

మేనక: మొన్నే 'శ్రావణి సుబ్రమణ్యం' చూసాడంట... అందులో కూడా అంతేనంట... పోయేటప్పుడు తృప్తిగా తిని చనిపోవాలని...

శ్రీలక్ష్మి: రాడు... అతను రాడు...

మేనక: లేదు... వస్తాడు... ఒకవేళ అతను రావటం లేటయితే నన్ను దూకేయమన్నాడు... ఆ తర్వాత తనూ వచ్చి దూకేస్తానన్నాడు.

శ్రీలక్ష్మి: సర్లే కూర్చో.

....కట్...

సీన్:4

ఇంకెవరూ రాలేదు. శ్రీలక్ష్మి... వాళ్ళ ముగ్గుర్నీ ఉద్దేశించి, ఒక్కొక్కరితో మాట్లాడ్డం ప్రారంభించింది. మొదట రంభతో....

శ్రీలక్ష్మి: నిన్ను... ఓ అబ్బాయి... తనను ప్రేమించకపోతే చచ్చిపోతానన్నాడు... అతను నిజంగా నిన్ను ప్రేమిస్తే... నీకు మరొకళ్ళతో పెళ్ళయితే అతనికేంటి...? నీవు పిల్లల్ని కంటే అతనికేంటి? అతను నిన్నలా ప్రేమిస్తూనే ఉండాలి... కానీ... నిన్ను అతను బెదిరించి, నువ్ అతన్ని ప్రేమించేలా

రచన: ఎం.వి.యస్.హరనాధరావు | **సినేమా హంగులు** | బొమ్మలు: ఎమ్.ఎస్. రామకృష్ణ

శాలువాలు

1. ఖరీదయిన సినిమా తల్లులు
ఎండాకాలంలో కూడా నిండుగా
కప్పుకుని మెట్లు దిగుతూ వాడే హంగు.

2. భగ్న ప్రేమికుడు విరహ విషాద
గీతంలో పాడుకునేటప్పుడు తప్పనిసరిగా
ఉండాల్సిన గ్లామర్ పాయింట్.



చేసుకున్నాడు... నువ్ అతన్ని నువ్‌గా ప్రేమించలేదు... అతను నిన్ను ప్రేమిస్తున్నాడు కాబట్టి, నువ్ లేకపోతే చచ్చిపోతానన్నాడు కాబట్టి, సానుభూతితో ప్రేమించావ్... అతని మనస్సు నీకు నచ్చి, అతనిపై నీకు ప్రేమ పెరగాలి, అంతేగానీ ప్రేమ అనేది సానుభూతితో ప్రారంభం అయితే అది కొంత కాలానికి అసహ్యంగా మారుతుంది... అందుచేత అది ప్రేమ కాదు... సానుభూతి మాత్రమే...

(మేనక వైపు తిరిగి) అతన్ని... తొలి చూపులోనే... ప్రేమించానన్నావ్... ఫర్ ఎగ్జాంపుల్ అతను దొంగైతే... లేక... ఫరెగ్జాంపుల్ అతనికి ఎయిడ్స్ ఉంటే... అలాగే... నువ్ అతన్ని ప్రేమిస్తూ ఉంటావా... వెంటనే... డ్రాప్ ఐపోతావ్... తొలిచూపులో ముఖారవిందాలు తెలుస్తాయ్ గానీ... గుణాలు తెలియవ్... తొలిచూపు ప్రేమ అనేది ఆకర్షణతో ప్రారంభం అవుతుంది... అంచేత నీది ప్రేమ కాదు... ఆకర్షణ అనొచ్చు...

(ఊర్వశితో...)

నువ్... ఓ అబ్బాయిని ప్రేమించావ్... అయితే మాత్రం.... అతను నిన్ను ప్రేమించాలని రూల్ ఉందా...? అతని కిష్టమైతే ప్రేమిస్తాడు... ఇష్టం లేనిదే... ఎలా ప్రేమిస్తాడు...? నిన్నెంతకాలం అంటి పెట్టుకుంటాడు...? ఈ మాత్రం దానికి నువ్ చచ్చిపోవాలా...? ప్రేమ త్యాగాన్ని కోరుతుంది... అంచేత నువ్ అతన్ని త్యాగం చేసెయ్..!

(ముగ్గుర్నీ చూస్తూ...)

మీ ముగ్గురి ఎఫైర్స్ విషయంలో మగవాళ్ళు అవకాశ వాదులు... వాళ్ళ అవసరాలు తీర్చుకొని మిమ్మల్ని ఒదిలేసారు... ఇప్పటికైనా చెయ్యి దాటి పోయింది లేదు... మీరు వెళ్ళి మీ తల్లి దండ్రులు చూసిన సంబంధాలు హ్యాపీగా చేసుకోండి... వెళ్ళండి...

రంభ
ఊర్వశి
మేనక: ఇంతకీ... మీరు ఇక్కడ ఎందుకున్నారు...?

శ్రీలక్ష్మి: అదా... అది... ఏం లేదు... నేనిలా ప్రేమ గురించి అందరికీ లెక్చర్స్ ఇస్తున్నానని మా వుడ్‌బి నన్ను తిట్టాడు... అందుకే... కోపంతో ఇక్కడ కొచ్చి కూర్చున్నా...

రంభ
ఊర్వశి
మేనక: అందరికీ శకునాలు చెప్పే బల్లి తాను కుడితిలో పడిందని- అందరికీ లెక్చర్లిచ్చే మీరు ఇలా ఆత్మహత్య చేసుకోవటానికి రావటం ఏం బాలేదు.

శ్రీలక్ష్మి: నేను ఆత్మహత్య చేసుకోడానికి వచ్చానని ఎక్కడ ఎస్టాబ్లిష్ చేశాను!? లేదే!!

రంభ
ఊర్వశి
మేనక: మరైతే ఇక్కడికెందుకొచ్చారు...!?

శ్రీలక్ష్మి: ఫస్ట్ నేను చెప్పినదానికి మీరు కన్విన్స్ అయ్యారా లేదా అది చెప్పండి.

రంభ
ఊర్వశి
మేనక: అయ్యాం

శ్రీలక్ష్మి: మీరు ఇళ్ళకి వెళ్ళి మీ పెద్దాళ్ళు చూపించిన పెళ్ళిళ్ళు చేసుకుంటారా లేదా...?

రంభ
ఊర్వశి
మేనక: అలాగే చేసుకుంటాం... ఇప్పుడు చెప్పండి.

శ్రీలక్ష్మి: లెక్చర్లివ్వటం అంత సులువు కాదని మా ఉడ్‌బి తెలియాలి. ఈ రోజుల్లో వాటికే కౌన్సిలింగ్‌లు అని పేరు పెట్టేసి తెగ డబ్బు చేసేసుకోవచ్చని మా ఉడ్‌బి గ్రహించాలి. అందుకే నా లెక్చర్స్‌ని మీ మీద ప్రయోగించా...

రంభ
ఊర్వశి
మేనక: ఆఁ !!!

.....ది ఎండ్ ....





# వెండితెరని నల్లబల్లగా మార్చి తిరిగి తెలుగు ఓనమాలు దిద్దించిన

# వేటూరి



శ్రీ వేటూరి సుందర రామమూర్తి గారు గత మూడు దశాబ్దాలుగా తెలుగు చలన చిత్ర సీమలో గీత రచయితగా ఏం రాసారు, ఎన్ని రాసారు, ఎలా రాసారు, ఏం సాధించారు అన్న సమాచారాన్ని ఈ రోజు నేను పనిగట్టుకుని మళ్ళీ వివరించనక్కర్లేదు - జగమెరిగిన సత్యం గనుక.

**వేటూరికి సిరివెన్నెల అక్షరాభిషేకం**



ఆయన 'చలన చిత్ర పద చరిత్ర' గురించి ఇప్పటికే కొందరు ప్రామాణిక పరిశోధనా గ్రంధాలు రాసి పి.హెచ్.డి.లు పొందారు అని విన్నాను. వారిలో డా॥ జయంతి చక్రవర్తిగారు నాకు తెలుసు. ఇంకా ఎందరైనా, ఎన్నిసారులైనా, పునరుక్తిదోషం పట్టని పుస్తకాలెన్నయినా వేటూరి గారి గురించి రాయవచ్చు, రాయాలికూడా. ఆయన గీతరచనా వ్యాసంగం గురించి సమగ్రంగా తెలుసుకోవటం, సినిమా పాట గురించి మాత్రమే గాక, తెలుగుభాష, వాఙ్మయం, సంస్కృతి, ఇత్యాది అత్యావశ్యక అంశాల గురించి అధ్యయనం చేసినట్టవుతుంది.

వేటూరి గారి బహుముఖ ప్రతిభను సాకల్యంగా సమీక్షించిన వారి హృదయం - నవరసాల్లోనూ మునిగి తేలి, ఎంత తుడుచుకుందామనుకున్నా ఆరని 'అద్భుత రస' స్పర్శతో చిరకాలం 'స్నేహం' చేస్తుంది.

ఈటీవీలో గత కొన్నాళ్ళుగా, 'ఝుమ్మందినాదం' అన్న పేరుతో ఆదివారాల్లో ప్రసారమౌతున్న కార్యక్రమాన్ని చూసేవారు వేటూరి గారి గురించి ఎంతో వింటున్నారు, చూస్తున్నారు, సంతోషిస్తున్నారు. అయితే, ఇంకా కొన్ని సూక్ష్మమైన 'సంగతులు' సశేషమై పోతున్నాయేమో అన్న ఆరాటంతో, నాకు అనిపించిన కొన్ని విశేషాల్ని మీతో పంచుకోవడానికి, వారి జన్మదిన శుభ సందర్భంగా దొరికిన ఈ అవకాశాన్ని వినియోగించుకుంటూ, వారికి నా శుభాకాంక్షలను, వినమ్ర ప్రణామాలను అర్పించుకుంటున్నాను.

తెలుగు సినిమా పాటని, ఆదినుంచీ ఇప్పటిదాకా ఒక్కసారి 'విహంగ వీక్షణ' చేస్తే, నేను దిగువ ప్రస్తావించనున్న మూడు ముఖ్యాంశాల ప్రత్యేకత ఏవిటో, ఎందుకో, సహృదయులు అర్థం చేసుకోగలరు.

మొదటిది- వేటూరిగారిలోని భావ సంపద గురించి. సినిమా పాటకి ఉన్న ఉండవలసిన పరిమితుల్ని దృష్టిలో పెట్టుకుంటే, దానికి సెలయేటి గలగలల 'లలిత పద లాస్యం' తప్ప, సాగర గీతానికి ఉండే లక్షణాలు ఉండవని, అలా ఉండక పోవడం సహజమేనని తెలుస్తుంది. జలధి పేరు చెవిని పడితే అనంతనీలిమ సౌందర్యం, చిందులాడే అలల ఆట, ముప్పుగా ముంచెత్తే ఉప్పెనల తాండవం, అంతుబట్టని లోతు, నీరు కూడా ఆర్పలేని నిప్పుని ఒడిలో దాచుకోగలగడం, పుడమిపైనున్న ప్రపంచానికి మూడింతల ప్రపంచాన్ని తనలో కలిగి ఉండడం, ఇలా ఎన్నో స్ఫురిస్తాయి.

తెలుగు సినిమా పాట- తనకి అంతవరకూ లేని 'సముద్ర స్వభావాన్ని' చూపడం మొదలు పెట్టింది వేటూరి గారి సిరా నింపుకున్నతర్వాతనే!. స్వరాల సిరిమువ్వలతో గలగల పా(డే)రే లేత చరణాల గీతబాల, 'గిరిబాల' (పార్వతి)గా మారి, అర్ధనారీశ్వర విలాసంగా, అటు 'ఆరభటీ' తాండవోద్ధతిని, ఇటు 'కైశికీ' ఖేలననీ ప్రదర్శించే స్థాయికి ఎదిగింది.

వేటూరి గారికి ముందున్న పెద్దలందరూ - ఎన్నోసార్లు, ఎన్నో సినిమా పాటల్లో భావగరిమనీ, కావ్య లక్షణాన్ని పొదిగి, సర్వాలంకార శోభితంగా, సలక్షణంగా, తీర్చిదిద్దిన సందర్భాలు లేక పోలేదు. నిజానికి ఈ వ్యాసంలో నేను వివరించ దలుచుకున్న వేటూరి వారి గీతాల సులక్షణాలన్నిటికీ స్ఫూర్తిదాయకమైన గీతాలు వారి ముందు తరం వారు ఎన్నో రచించారు. వారిని తన గురువులుగా, మార్గదర్శకులుగా వేటూరిగారే సంభావించారు.

కాకపోతే - 'సగటు సినిమా పాట'తో పోలిస్తే, కావ్య స్థాయిలో మన్నించదగ్గ పాటల సంఖ్య స్వల్పమే గాక, అవి, అలా ఆ ప్రత్యేకతను సంతరించుకోవడానికి - ఆయా చిత్రాల్లోని కథ, సన్నివేశాలు, పాత్రల ఔచితి, వగైరా సహకరించడం కూడా కారణమని అర్థమవుతుంది.

ఇక్కడే వేటూరి గారి 'ఉనికి' తన విశిష్టతను వ్యక్తీకరిస్తుంది. తన పాటల ప్రయాణంలో మొదటి పదేళ్ళపాటూ ఆయన చేసిన ప్రయత్నాన్ని పనిగట్టుకుని పరిశీలించండి. యుగళగీతమైనా, భక్తిగీతమైనా, రక్తిగీతమైనా, విరక్తి గీతమైనా, 'ఉత్తి' గీతమైనా - పాట... అదే సినిమా పాట ఆయన కొనవేలు పట్టుకుని కొత్త మలుపుల్లోకి నడవడం మొదలెట్టింది. మొట్టమొదటసారిగా బాణీ కట్లుబాట్లని, 'చిత్ర' పరిధుల్ని దాటి, తనదైన స్వతంత్ర ప్రతిపత్తితో ఒక 'కావ్యఖండిక'గా మనగలిగేలా పాటని నిలబెట్టి, ఎప్పటికీ వసివాడని దేవపారిజాతాల్లా, గీతాలు గుబాళించేటట్టు తన 'భావ గంధాన్ని' అద్ది, ఒక్కోపాట ఒక్కో 'సంపూర్ణ కావ్యం'లా తీర్చిదిద్దడానికి ఆయన చేసిన తపస్సు, నన్ను స్తంభీభూతుణ్ని సందర్భాలెన్నో వివరించడానికి చోటు చాలదు. అది ఏ సినిమా, దాని 'నిలకడ' ఎంత క్షణికం, ఆ సినిమాకి గాని, ఆ సందర్భానికి గాని అంత అర్హత ఉందా అని కూడా పట్టించుకోకుండా, ఆయన చెక్కిన కావ్యశిల్పాలు ఎన్నో!! పేరుకూడా గుర్తులేనంతగా ఇట్టే వచ్చి అట్టే కొట్టుకుపోయిన ఎన్నో చిత్రాల్లో ఆయన చేసిన అద్భుతాల్ని ఆనవాలు పట్టాలంటే ఎంతో త్రవ్వకపు పని చేపట్టాల్సిందే. అలా 'తెరమరుగున' పడిన అనేక గీతాలను 'కనిపెట్ట' గలిగితే, తన పద పారిజాతాల సుమమాలతో వాగ్దేవి నలంకరించిన సుందర రామ్మూర్తి గారిలోని కవితా మూర్తిని దర్శించగలిగితే, సినిమాకి సంబంధించని మహాకవులు కూడా సినిమా పాట రాయడం తమ ప్రతిభకి గర్వించదగ్గ 'స్వోన్మీలనం' (Self expression) గా భావించి కుతూహలపడతారే గాని, గర్హించవలసిన, లొల్లాయి పదాల కాలక్షేపంగా భావించి వెనకడుగు వేయరని అనిపించక తప్పదు. జనాదరణ పొందిన చిత్రాల పుణ్యమా అని పదిమందికి తెలిసిన ఒకటి రెండు ఉదాహరణలు గమనించండి.

'ఈ దుర్యోధన దుశ్శాసన దుర్వినీతలోకంలో' (ప్రతిఘటన)అని ఉదధి కడుపులో రగిలే బాడబానలాన్ని సహస్రకీలలతో బహిర్గతం చేసినా, 'భక్తకన్నప్ప'లో 'కిరాతార్జునీయం'లోని 'తలపైని గంగమ్మ తలపులోనికి ఒదిగె' అని సార్థమైన సదాశివుని తలపుని సూచించినా, "చినుకులన్ని కలిసి చిత్రకావేరి, చివరికా కావేరి కడలి దేవేరి' (శుభసంకల్పం) అని కనురెప్పల చెలియల కట్టని

దాటని కన్నీటి పొర వెనుకనున్న గుండెకడలి కల్లోలాన్ని చూపించినా, 'కైలాసాన కార్తీకాన హిమదీపం...' (సాగరసంగమం) అని 'ప్రమిదే లేని ప్రమథాలోకమణి దీపాల' కాంతిలో మనల్ని నడిపించినా.... ఆయన అనేక గీతాల్లోని ఈ స్తవనీయమైన కావ్య 'ధ్వని', తెలుగు సినిమా పాట ఇట్టే తేలిపోయే 'తేటగీతి' మాత్రమే కాదు, ఇట్టే ఆడిపోయే 'ఆటవెలది' మాత్రమే కాదూ, ఆత్మని తట్టి లేపగల 'గీతాచార్య పాంచజన్య శంఖారావం' కూడా కాగలదని నిరూపించి 'So Called' కవుల చెవుల్లోని సీసాన్ని కరిగించిన సత్యాన్ని చాటి చెపుతుంది.

వేలకు వేలుగా ఉన్న ఆయన పాటల్లోని పొల్లుని మాత్రమే పోగు చేసుకునే ఓటి చేతుల పండితమ్మన్యులకీ, రత్నాకరుని (సముద్రుని) ఇంటి ముందున్న చెత్తకుండీలోని నత్తగుల్లల్ని లెక్కపెట్టి ఆయన సంపదని గణించ చూసుకునే 'విమర్శక శిఖామణు'లకీ, నా మాటలు మరీ అతిశయోక్తులు అనిపించవచ్చు. ఆయన కాలకృత్యాల వేళ దంతధావనానంతరపు పుక్కిలింతలే గమనించి పక్కకి పారిపోయే వారు ఆ తర్వాత ఆయన తన మనోమందిరంలో ధ్యానముద్రలో జపించిన నమక చమకాల నాదం నుంచి ఆవాహన చేసి మనకందించిన రుద్రాభిషేక సంజనిత గీతామృత శీకరాలలో స్నానించలేరు. 'పోయింది పొల్లు, ఉన్నది గట్టి' అన్న మన కృషీవలుల (రైతుల) ఋషి వాక్తుల్యమైన సామెతను స్మరించుకునే ధీమంతులు వేటూరి గారి పాటల పూదోటలోని ప్రవేశార్హులు.

రెండవది వేటూరి సుందరరామ్మూర్తి గారి భాషా పాటవం గురించి... ఆబాల గోపాలాన్ని అలరించే చిత్రకళాకేళిలో భాగమైన సినిమా పాటలో భాష అతి సరళంగా, జనబాహుళ్యం నిత్యం వినియోగించే వ్యావహారికంలా సులువుగా, తేలిగ్గా ఉండాలి అనే నిబంధన తప్పు అనలేం, అనకూడదు కూడా. కాని, వేటూరిగారు తెలిసి తెలిసి సినిమా నియమావళిని అతిక్రమించి, 'శంకరాభరణం', 'సప్తపది', 'సాగర సంగమం', 'పార్వతీ పరమేశ్వరులు' ఇంకా ఇలా ఎన్నో చిత్రాల్లో, అతి ప్రౌఢమైన భాషని వినియోగించడం ద్వారా తెలుగుభాషకి, సంస్కృతికి, ఎలాంటి మేలు జరిగిందో ఒకసారి ఆగి ఆలోచించాలి.

పాల పళ్ళు కూడా ఊడని పసిప్రాయంలోనే భారత భాగవతాలూ, భగవద్గీత, ప్రాచీన పద్యవాఙ్మయం, దాశరథీ శతకాది శతకాలూ, భర్తృహరి సుభాషితాలు, అమరకోశం, పెద్దబాలశిక్ష.... ఇంకా ఇలాంటి వన్నీ కంఠతా పట్టించిన మన తెలుగింటి విద్యాబోధన - తరాలు మారుతున్న కొద్దీ ఏ విధంగా 'చిన్న బో' తోందో గమనిస్తే, ఇంట్లో, వీధుల్లో, పాఠశాలల్లో, కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో ఇలా అన్ని చోట్లా మన పిల్లలకి ఎలాంటి 'మాటతీరు' అలవడుతుందో అర్థం చేసుకో గలిగితే క్రమక్రమంగా 'గ్రంథ పఠనం', 'అధ్యయనం', 'వినడం' లాంటి 'కసరత్తు' కరువై, దంతాలూ, జిహ్వా, స్వరతంత్రులూ, అన్నీ సత్తువుడిగి, దివ్యభాషాపీయూషాస్వాదనకి అనర్హమై, పలుకులు నత్తినత్తిగా, నంగినంగిగా తయారై, ఆంధ్రభాష ఎలాంటి దుర్దశకి లోనైందో గుర్తిస్తే, ఈనాటి అవకతవక శిక్షణ మనకి ఎంత 'పెద్ద' బాల 'శిక్ష'గా పరిణమించిందో అని బాధపడగలిగితే మనం ఏ సంపదని కోల్పోతున్నామో తెలుస్తుంది. పండితులు, పెద్దలు, భాషావేత్తలు, విజ్ఞులు, కవులూ ఈ పరిస్థితిని ఉపేక్షిస్తున్నారు.



మంచి 'పలుకుబడిని' కొందరికే పరిమితం చేయకుండా సమాజంలో అందరికీ పంచిపెట్ట గలిగిన, పంచి పెట్టవలసిన 'వేదిక' ఏదీ ఎక్కడా 'మాటవరసకి' కూడా లేక, తెలుగుభాష నిరుపేదగా మారి, నడి వీధుల్లో పడుతున్న సమయంలో, వేటూరి గారిలోని 'వాచస్పతి' మనకి సంస్కృతసత్సంగంతో పరిపుష్టమై, గాంభీర్యంలోనూ గహనత్వంలోనూ విస్తృతిలోనూ సౌందర్యంలోనూ మరే ఇతర భాషకి అందనంత ఎత్తులో ఉన్న ఆంధ్రభాషతో పునః పరిచయం కలిగించే ప్రయత్నం చేసారు. అది కూడా ప్రజాబాహుళ్యానికి చేరువగా ఉన్న వెండితెర వేదిక ద్వారా.

కావ్యభాష - సినిమాని చిన్నచూపు చూస్తూ తనని తానే 'వెలి' వేసుకున్న తరుణంలో వేటూరి గారి పుణ్యమా అని తెలుగుపాట ఉన్నత స్థాయిలో పలకడం నేర్చుకుంది. అంతకుమునుపు పౌరాణికాల్లోనూ, ఏవో కొన్ని తప్పనిసరి పరిస్థితుల్లో తప్ప తెలుగు సినిమా కవులు అందరికీ అందుబాటులో లేనంత జటిలమైన, సంస్కృత సమాస భరితమైన భాష జోలికి పోలేదు. ఆ కవులకి శక్తి, అర్హత, సామర్థ్యం లేక పోవడం వల్ల కాదు -సినిమా తెరని కృష్ణదేవరాయుల భువన విజయ మండపంగా మార్చే స్వేచ్ఛా, చొరవా తీసుకోక పోవడం వల్ల. అలాఅని అంతకుమునుపెప్పుడూ ఘనమైన భాషా పాటవాన్ని ప్రదర్శించిన పాటలు అస్సలు లేవని కాదు. కాని, వేటూరిగారు ఈ విషయంలో చాలా ముందుకి దూసుకు వెళ్ళారు. అవకాశాన్ని అంది పుచ్చుకుని మరీ భాషని వినియోగించుకున్నారు.

'గొప్ప భావాలను కూడా చిన్న మాటల్లో చెప్పగలగడం చాలా గొప్ప విషయం' అన్న అభిప్రాయం తప్పని ఎవరూ అనరు. అది నిజంగా గొప్పే. కాని, ఆ అభిప్రాయం అంతకంతకూ బలం పుంజుకుంటూ ఒక నిజాన్ని విస్మరిస్తోంది.

కేవలం నాదం ద్వారానే ప్రాణనాడుల్ని మీటగలిగే సత్తా ఉన్న ఆంధ్రవాణిలోని వేదతుల్యమైన నాదమహిమని అలక్ష్యం చేయడం ద్వారా మనం, 'భాషకి అందని భావం లేదు' అనే ఐశ్వర్యాన్ని వదులుకుని, 'ఏ భాషకీ అందనిదే భావం' అని అనుకోవలసిన దారిద్ర్యాన్ని వరిస్తున్నాం. 'అందరికీ అర్థం కావడం' అనే లక్ష్యం కోసం, సినిమా పాట రాన్రానూ ఓ అరవై డెబ్బై మాటలకి పరిమితమై పోతోంది.

'అర్థం కావడం వేరు, అనుభూతికి అందడం వేరు' అని తెలుసుకుంటే - 'ఏవో కొన్ని మాటలతోనే నిత్యనైమిత్తిక వ్యవహారాలు నడిచి పోతున్నాయి కదా, ఇంకా అంత విశాలమైన భాషార్ణవం దేనికి? రండి, భాషా సాగరాన్ని ఎండగట్టి ఎడారి చేసేద్దాం' అనుకునే విపరీత ధోరణి మానుకుంటే - 'మనకి అర్థం అయేలా మనకి అందుబాటులోకి వచ్చేలా విలువల శిఖరాల్ని తలవంచమనడం కన్నా - గొప్ప విషయాల్ని అర్థం చేసుకునే శక్తి మనకి వశమయ్యేలా అభ్యాసం చేద్దాం. ఉన్నత విలువల శిఖరాలను అధిరోహించే బలాన్ని మన 'చరణాల'కు కలిగిద్దాం' అనే దృక్పథాన్ని అలవాటు చేసుకుంటే ఒక్క సంస్కృతంలోనూ, సంస్కృత భరితమైన ఆంధ్రంలోనూ తప్ప 'శివతాండవాన్ని' ఇంకే భాషైనా మన 'అనుభూతి'కి అంది వచ్చేలా ఆవిష్కరించగలరా అని గర్వంగా ఆశ్చర్యపడగలిగితే-

వేటూరి సుందరరామ్మూర్తిగారు సినిమా పాటల్లో భాషా పాటవాన్ని చూపడం ద్వారా ఆంధ్రభాషకి చేసిన చిరస్మరణీయమైన సేవని మెచ్చగలుగుతాం. శంకరాభరణం, సప్తపది,



సీతారామయ్య గారి మనవరాలు, భక్తకన్నప్ప, రాజేశ్వరీ కళ్యాణం, సరిగమలు.... ఇలా ఎన్నో చిత్రాల్లో ఆయన 'పరిపూర్ణమైన తెలుగు'ను వినియోగిస్తూ, తెలుగు నుడికారాన్ని, ఆంధ్రభాషా ప్రాశస్త్యాన్ని, తెలుగుజాతి వారసత్వాన్ని ప్రపంచంలో తలెత్తుకు తిరగ్గల తెలుగు మాటలలోని ఠీవిని, రూపు కట్టిన సంక్లిష్ట భావాల్ని ఎన్నోసార్లు ఆవిష్కరించారు.

ఇది వివాదాస్పద అంశం. నాకు తెలుసు ఎందరితోనో విభేదించవలసి వస్తుందని! అయినా ఈ అంశాన్ని ఇంత విస్తృతంగా ఎందుకు ప్రస్తావించవలసి వచ్చింది అంటే - గ్రంధాలయాలకి, పండితులకి, ప్రత్యేకమైన ఆసక్తి గల వారికి, "మేం గొప్ప కవులం. సామాన్య ప్రజానీకం కన్నా ఉన్నతులం' అనుకుంటున్న కొందరికి మాత్రమే పరిమితమై పోతున్న భాషా వైభవాన్ని ప్రజలందరికీ సన్నిహితం చేసేందుకు వెండి తెరని నల్లబల్లగా మార్చి ఆరేళ్ళ ప్రాయం వారి నుంచి అరవై ఏళ్ళ పైబడిన వారిదాకా అందరికీ తిరిగి తెలుగు ఓనమాలు దిద్దించేందుకు కృషిచేసిన వేటూరిగారి ప్రయత్నానికి సహకరించకపోగా ఆ 'గురువు'కే పాఠాలు నేర్పుతూ తప్పనిసరితనంలోకి నెట్టి ఆయన చేత గత్యంతరం లేని సాము గరిడీలు చేయించి శభాషంటూ చప్పట్లు కొడుతున్నాం.

మన ఈ 'సరదా' కేరింతల్ని కాస్సేపు కట్టిపెట్టి ఆయన ఏటికెదురీది, కావ్యభాషా ప్రయోగం చేసే సాహసాన్ని ప్రదర్శించి, తన పాటల ద్వారా అందించిన చక్కని చిక్కని మాటల మాధుర్యాన్ని అందుకునే ప్రయత్నాన్ని చెయ్యాలి. తద్వారా మనం భాషా రసాస్వాదనలోని మాధుర్యాన్ని చవి చూడడంతో బాటు నన్నయ్య, తిక్కన, శ్రీనాధుడు, పెద్దన, పోతన, రామదాసు, త్యాగయ్య, అన్నమయ్య వంటి ఎందరో



శారదాంశా సంభూతులకు వారసులమని సగర్వంగా మనని మనం పరిచయం చేసుకోగలుగుతాం. శ్రీ వేటూరి గారు ముందు తరాలకి దారి చూపించేలా అందించిన ఈ కరదీపిక ఆరిపోక ముందే వర్తమాన చలనచిత్ర సీమలోని కవులు, ఆంధ్ర ప్రేక్షకులూ, ఈ 'ముద్దుమాటల' మరుగున పడి నిద్దరోతున్న తమ 'పెద్దరికాన్ని' మేలు కొలిపేందుకు వీలుగా "రుద్రవీణ నిర్ణిద్రగానమిది అవధరించరా! విని తరించరా!" అని 'శంకరాభరణం'లో ఆలపించిన ఆయన శ్వాసకి సాష్టాంగ ప్రణామం చేస్తున్నాను.

మూడవ అంశం... భావ ప్రకటన దృష్ట్యా, భాషా ప్రయోగం దృష్ట్యా ఆయన ఘనతకి గీటురాళ్ళుగా 'నిలిచిన' పాటలు గాక, ఇంకా మిగిలిపోయిన 'కీచురాళ్ళు'గా ఆయన విదిలించిన 'చప్పుళ్ళ' గురించి- నాటుతనం, మోటుతనం, ఆకతాయితనం, తుంటరితనం మేళవించి, గులకరాళ్ళుగా ఆయన మన మీదకి విసిరిన పాటల్ని విమర్శిద్దాం. తప్పులేదు. కాని, అక్కడకూడా ఆయన చూపించిన అనన్య సామాన్యమైన చమత్కారాన్ని, చాతుర్యాన్ని చూసి, 'ఔరా!' అనలేక పోతే మనకి 'సరసం' తెలీనట్టే. ఆయనలోని ఈ విశిష్టశైలి నభూతో నభవిష్యతి.

మామూలుగా, ఉత్తుత్తినే, సినిమా పాటల్ని 'ఆరేసుకోబోయి పారేసుకోవచ్చు' అని భ్రమపడి, ఆయన్ని అనుకరించడానికి, అనుసరించడానికి ప్రయత్నిస్తున్న పిల్లకాకులకి, ఆయన 'పదబంధవైచిత్రి' ఉండేలు దెబ్బలాంటిది. పైకి కొంటెతనంగా, కోణంగితనంగా కనిపించినా, ఆయన అలవోకగా వాడే మాటల అల్లికలోని లాఘవం పోల్చుకుంటే ఆ ఆంజనేయుడి ముందు కుప్పిగెంతులు వేసే ప్రయత్నానికి పాల్పడరెవరూ.

చెప్పవలసినదంతా చెప్పేసాక, చెయ్యవలసినదంతా చేసేసాక, ఎగ్జాస్ట్ అయిపోయిన తరుణంలో కూడా, ఇంకా ఆయన చెణుకులు, "జగడజగడజగడాలు", "నాటుకొట్టుళ్ళు" "కాస్తందుకో ప్రేమ దరఖాస్తుందుకో" (రెండు రెళ్ళు ఆరు) "హంసలేఖ పంపా నీకంది ఉంటది, పూల బాణామేసా ఎద కంది ఉంటది" (ముత్యమంత ముద్దు) ఇలా లెక్కకు మించిన పలుకుబళ్ళు వింటుంటే, ఆఖరికి బూతులు కూడా 'మాటకారి తనం సుమా!' అని అనిపిస్తూ ఉంటే, చిరాకు పక్కనే చిరునవ్వు, కోపం పక్కనే 'ఓరి వీడి అసాధ్యం గూలా' అనే అబ్బురపాటు కలుగుతుంటే.....

"కాదనడానికి, కసురుకోడానికి, తిట్టడానికి మనం ఏ పాటి వాళ్ళం లే! ఆయనగారిగ్గానీ కోపం వస్తే, ఓ గొ... ప్ప పాటని. రెక్కలున్న మేరు పర్వతంలా మన నెత్తిన పడేస్తాడు. అణిగిచావాలి. ఆయన మనని వెక్కిరించాడని, మనం కూడా ఆయన్ని వెక్కిరించాలంటే తాహతు ఉండొద్దూ!' అని బెరుకు పుడుతుంది.

ఇది వేటూరి గారిలోని భీమబలం! ధీమా! పొగరు!

"మహానుభావా! మీతో మేం చాల్లేం గానీ, బళ్ళో మంచి పాఠాలు నేర్పి, వీధిలో ఇలా కబ్బాడీ ఆడించి పిడిగుద్దులు గుద్దుతుంటే, మీరు మమ్మల్ని రాముడు మంచిబాలుడిగా తీర్చిదిద్దుతున్నారో, మాకు రాలుగాయి రౌడీల్లా తయారయే తర్ఫీదిస్తున్నారో మీకే తెలియాలి' అంటూ-

ఆకాశాన్నాక్రమించిన ఆయన భావనా పదానికి, భూగోళాన్ని ఆక్రమించిన ఆయన భాషా పదానికి భక్తితో అంజలి ఘటిస్తూ, 'నా మూడో పాదాన్ని నీనెత్తిన పెడతా' అంటున్న ఆయన తాండవ పాదానికి భయంతో నమస్కరిస్తూ.

ముమ్మారు మొక్కుతూ...

**-సిరివెన్నెల సీతారామశాస్త్రి**

# ఎంత బావుందో

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'**
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## తారాగణం

సాయికిరణ్, రోహిత్, లయ
తణికెళ్ళ భరణి, సుధాకర్, బ్రహ్మానందం,
వక్కంతం వంశీ, ఎ.వి.యస్.,
బెనర్జీ, కవి(పరిచయం), 'మాస్టర్' రోహిత్,
కోవై సరళ

## సాంకేతిక నిపుణులు:

కథ : ఆకెళ్ళ
సంగీతం : సాకేత్ సాయిరామ్ (పరిచయం)
కెమెరా : అమర్ (పరిచయం)
కాస్ట్యూమ్స్ : కానూరి శ్రీనివాస్
మేకప్ : వెంకటేశ్వరరావు
డాన్స్ : శోభ
ఆర్ట్ : విజయకుమార్
ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : వేణు
క్యాషియర్ : మురళీధర్
పాటలు : సాహితి, గురుచరణ్, రమణ్‌లోక్
కో-డైరెక్టర్ : కె. శ్రీనివాసరావు
నిర్మాత : కె.సి. శేఖర్‌బాబు
దర్శకత్వం : తమ్మారెడ్డి భరధ్వాజ్




ఎంతబావుందో...!

# ఓ చినదాన

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'**
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## తారాగణం

**శ్రీకాంత్,**
**రాజా** (తొలిపరిచయం)
గజాలా, ఆశాసైనీ
కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం,
జయప్రకాష్ రెడ్డి, తనికెళ్ళ భరణి
చలపతిరావు,
యమ్.యస్.నారాయణ,
ఎల్.బి.శ్రీరామ్, మల్లిఖార్జునరావు,
ఆలీ, బెనర్జీ, కోవైసరళ, జయలలిత,
దేవిశ్రీ.

## సాంకేతిక నిపుణులు

మాటలు: మరుధూరి రాజా
పాటలు : సిరివెన్నెల సీతారామశాస్త్రి
సంగీతం : విద్యాసాగర్
ఫొటోగ్రఫి : రాం ప్రసాద్
ఆర్ట్ : సత్యనారాయణ
స్టిల్స్ : ఇ.వి.వి.గిరి
ఫైట్స్ : విజయ్
మేకప్ : ఈశ్వర్
కాస్ట్యూమ్ : మనోజ్
డాన్స్ : తార,.. ప్రసన్న
పి.ఆర్.ఓ.: పులగంచిన్నారాయణ

ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : గోపి
అసిస్టెంట్ డైరెక్టర్: రమేష్ బాబు
కో డైరెక్టర్స్:
డి.డి.సి.కేశవ ప్రసాద్,
యస్.విజయ భాస్కర్ రెడ్డి
సమర్పణ:
పి.వి.వి.యస్.యన్.మూర్తి(బాల)
నిర్మాత: ముళ్ళపూడి బ్రహ్మానందం
కథ..స్క్రీన్‌ప్లే... దర్శకత్వం:
ఇ. సత్తిబాబు




ఓ చినదానా

రచన: సాహితి | 1 | గానం: చక్రి, సునీత

ప/ఆ: ఇంటర్నెట్ చాటింగ్‌లోన తగిలాడు నాయుడు బావా
అ: ఈ అందాల హైటెక్ చిలకా పలికింది సెల్ ఫోన్‌లాగ
ఆ: ఏదోలావుంది ఇది లవ్ జ్వరమా
ఆ: వివరిస్తా రా నా డిజిటల్ స్వరమా
బృందం: పిలగా జత కుదిరెను చిలక
త్వరగా ఇక పడిపో వెనక
చిలకా మరి బిడియము పడక
వేసెయ్ సిరి మల్లెల పడక... ॥ఇంటర్నెట్॥
చ/ఆ: నిన్ను చూడగా సింపుల్‌గానే
కన్నె బుగ్గపై పింపుల్ మొలిచే
డాళింగ్ శాంపుల్‌గా ఓ కిస్సెయ్
అ: లేత సొగసుల సాఫ్ట్‌వేర్‌తోనే
హాటు స్వీటుల డాట్‌కామ్‌లాగే
వెల్‌కం అంటూనే వచ్చేసెయ్
ఆ: మీటే వంటి చెంపని పలికేస్తుంది సింఫనీ
అ: ఎంజాయ్ చేస్తే లైపుని బీబీసికి చెప్తే నువు నా వైఫనీ
కో: అసలే ఇది చలిచలికాలం
సెగలే ఎద రగిలే సమయం
తమదే కసి తొలకరి పరువం
తడితే ఇక అదురును సరసం ॥ఇంటర్నెట్॥
చ/ఆ: నువ్వు నన్ను అహ టచ్ మీ అంటూ
రివ్వు రివ్వున హగ్ చేసేస్తే
మనసే గువ్వల్లే ఎగిసేనే
ఆ: నువ్వు దొంగలా చుప్ చుప్ అంటూ
వయసు వొంపులే చెక్ చేస్తుంటే
గుండె జివ్వంటు లాగేలే
అ: గడిపెయ్ హాలిడేస్‌ని ఇస్తు నాకు డాషుని
ఆ: నువ్వో కాళిదాసువి ఇచ్చెయ్ వేడి వేడి కౌగిలి క్లాసుని



రచన: రమణ్‌లోక్ | 6 | గానం: రవివర్మ, సునీత

ప/ఆ: నీ చూపూ నీ వూపూ చూసీ
మనసంతా లాగిందే పిల్లా!
ఆ: నీతోటి ఆటాడీ నేనే
గెలవాలీ ఓడాలీ మళ్ళా!
అ: నడుమే సన్నగ ఉంటే
నడకే మత్తెక్కిస్తే
ఇకనే ఆగలేనులే భామా!
ఆ: ఎక్కడో తియ్యని మంటే
వెచ్చగా రేగిందంటే
సిగ్గుతో చెప్పలేనులే మామా! ॥నీ చూపు॥
చ/ఆ: వయ్యారి నెరజాణా గారాల గిలివానా
రమ్మంటే అలిగావే సోనా!
ఆ: ఇబ్బందే ఇకపైనా తెల్లార్లూ చలిలోనా
నీ అందం సెగ కాచుకోనా!
అ: సరే లెమ్మంటూ చేస్తాలే వేడి దోపిడే
ఆ: ఇలా కాదంటే నాపైనే వాడి దూకుడే!
అ: వలపు దుప్పట్లేసి కసి వాయనమిస్తా
ఆ: ముద్దు ముచ్చట్లన్నీ
మరి మదన మహిమ తపనలననా! ॥నీ చూపు॥
చ/ఆ: మోహాల మురిపాలే తాపాల చెరసాలే
అందాల సరసాలే భామా!
ఆ: నాలోని వివరాలే వేడెక్కే విరహాలే
ఎన్నెన్నో అర్థాలే మామా
అ: మరీ మోమాటం ఆరాటం ఆపలేనులే
ఆ: అలా కోలాటం పోరాటం చెయ్యలేనులే!
అ: కలల కవ్వింతల్లో దరిచేరవే భామా
ఆ: వయసు వలేసాతే
నిను పిలిచి పిలిచి అలసి సొలసా! ॥నీ చూపు॥



1 | గానం: దేవాశిష్

సా/ఆ: నిన్నడిగి కుడుతుందా చీమైనా... దోమైనా...
నిన్నడిగి పుడుతుందా ప్రేమైనా... ఏమైనా... ఓ చినదానా...
ప/ఆ: తన చిరునామా అడిగితే ప్రేమ
నిను చూపెడుతుందే
ఓ చినదానా... ఓ చినదానా... ఓ చినదానా...
అవునవమ్మా ప్రతిమగ జన్మ విసుగెత్తక ముందే
ఓ చినదానా... ఓ చినదానా...
ఒకదానివైతె నువు మోయలేవు బరువైన ప్రాయం
మొగమాట పడక అడిగేయరాద మగవాడి సాయం
ఓ చినదానా... ఓ చినదానా...
ఓహో చెలి ఓహో సఖి
అయామ్ రెడీ... యూ లవ్ మీ... ॥ఓహో॥ ॥తన॥
చ/ఆ: కమ్మనైన కల కమ్ముకుంటదని
అర్థ రాతిరిని నిద్ర మానుకుని
ఎందుకోసమని ఎంతకాలమని ఈ పంతం
లేనిపోని నకరాలు మానుకుని
గుండెచాటు తొలిప్రేమ పొల్చుకుని
నన్ను చేరుకుని చేతికియ్యిమరి నీ అందం...
చెబుతున్నా వినవంటే ఎదురున్నా కననంటే...
తిడతావే చుప్పనాతీ విడనీవే బుంగమూతి
ఓ మధుమతీ... హాయ్... ఓ మందమతీ... ॥ఓహో॥ ॥తన॥
చ/ఆ: ఓ... ఎవ్వరైనా విని నవ్వుతారు అని
కాస్త కూడ బెదురైన లేనిదని
ఆడ పుట్టుకే అలుగుతుంది కదా నీ మీదా...
హాయ్... వెచ్చనైన మగ ముద్దు పుచ్చుకుని
ముచ్చటైన సొగసంత ఇచ్చుకుని సిగ్గుచాటు గల
మొగ్గ విచ్చునని తెలియనిదా...
సహజంగా జరిగేదే... తగదంటూ తగువేంటే
మగ ఊసే చెలి బడితే బుసకొట్టే బిగువేంటే...
ఓ నెరజాణా... హాయ్... ఓ జానే జానా... ॥తన॥



దొరకూడా దోచుకోడా దర్జాగా...
రాజా: ఇంతపచ్చి నిజాలన్ని కళ్ళముందు వుండగా
మరిచి ఎలా బతికామ మరీ చిరాగ్గా... ॥ఒంటి॥

5 | గానం: యస్.పి.బాలు, ఉమారమణన్

దిందింతార...
ప/ఆ: చెయ్యిగిల్లి చేసుకున్న చిననాటి బాసలు
మరిచిపోతనా మరిచిపోతనా
దండలల్లి దాచుకున్న ఆ చిన్ని ఊసులు
మరిచిపోతనా మరిచిపోతనా
అ: తాయిలాలు పంచుకున్న ఆ తీపిరోజులు
మరిచిపోతనా మరిచిపోతనా
గండుపిల్లి గిచ్చినట్టు నీగోటి గుర్తులు
మరిచిపోతనా మరిచిపోతనా ॥దిందింతార॥
చ/ఆ: నాతో కలవాలని నువ్వు కావాలని ఫెయిలయ్యావు
మరిచిపోతనా మరిచిపోతనా... ఊ...
అ: ఆ సంగతి తెలిసిన నువ్వు పాపం తెగ ఫీలయ్యావు
మరిచిపోతనా మరిచిపోతనా... ఊ...
ఆ: ఊరించి నను కాసేపు ఊరే వదిలిపోయావు
అ: ఆనాటి నీ తడిచూపు నను లాగిందిలే నీవైపు
ఆ: ఆ చెమ్మ చెలిమి ఏజన్మకైనా
మరిచిపోతనా మరిచిపోతనా ॥దిందింతార॥
చ/ఆ: నీకో బొమ్మని కొన్నాను ఇంట్లో తన్నులు తిన్నాను
మరిచిపోతనా మరిచిపోతనా
ఆ: అంతా దొంగాడని నిన్ను తిడుతూంటే నేవిన్నాను
మరిచిపోతనా మరిచిపోతనా
అ: నీకుండేది పువ్వుల గౌను అది చూపించవా చూస్తాను
ఆ: నీ కోసమిప్పుడు నేను ఆ గౌనేసుకుని రాలేను
అ: ఆనాటి చెలిమి ఏనాటికైనా
మరిచిపోతనా మరిచిపోతనా... ॥చెయ్యిగిల్లి॥

వొదిలిస్తాము మీ చిలుము
తండ్రిగా భర్తగా బాధ్యత మరిచి
మగ అను అహముతో మృగముల
కో: మీరు ఒక్కొక్కరూ ఇంటి ఆడోళ్లకి
గుక్క పట్టించిన ఏడ్పు ఎక్కిళ్లకి
నేడు చిక్కారు మా ఖాకీ చొక్కాలకి
కో: తగులుకున్నారు మా కొంగు కొక్కాలకి
మొగుడు మొగుడు అని ఎడపెడ ఎగిరితే
వినుడు వినుడు మీ గతి తిరపతే
చ/ఆ1: మీరేం చేసినా ఇంక మేం పడబోములే
ఆ2: చెయ్ పైకెత్తితే అంతా స్ట్రయిక్ చేస్తాములే
అ: ఎంతైనా మగవాళ్లం మొగుడై పాలించే మొనగాళ్లం
ఆ: కొరగాని పాలిటిక్స్ నాకాడ
మరి ఊసు ఎత్తితే ఓ మగడా
తిరగేస్త చుర్రని అట్లకాడ
అ: అతిగా వాగావంటే సీయ్యమ్మే చూస్తా అంతే
ఆ: మీ మగవాళ్ళు ఇది తెలియకున్నా
ప్రాణం ఇచ్చు ఇల్లాలి కన్నా
ఏదీ కాదు ఇలలోన మిన్న... వినరా... సుమతీ ॥ఎన్నడో॥
ఆ: మేం బానిసలమా... లేక మీ కోడళ్లమా...
ఆ: ఓ పిసిని మామా డబ్బే మీ సర్వస్వమా
అ: మీకేమి తెలుసమ్మా ఇస్ పైసామే హై పరమాత్మా
అనురాగ దేవతే తానైన
మమకార మూర్తియే స్త్రీకాదా
అటువంటి స్త్రీని గృహలక్ష్మివలే తలచే
ఆరోజునె ప్రతి ఇల్లు రాణించులే
అభిమానిస్తే అమృతం చిలికే ఆగ్రహమొస్తే నిప్పులే చెరిగే
భీకరకాళి చండికలు మేమే... పడతా భరతం ॥ఎన్నడో॥



కో: ఇదిగో... ఇటు చూడిక అబయా
అదిగో... విరి పొదలకు పదయా
తనతో... జత కలపవే అమడూ
జతకె... బాగున్నడు పిలడు... ॥ఇంటర్నెట్॥
కో: పదవే మనమెందుకు ఇంకా
పొదలో ఈ ముద్దుల జంట
ఒకటై జత కలసిన పూట
తకతై తొలి తకధిమి పాట

రచన: గురుచరణ్ **2** గానం: పార్థసారథి, సునీత, రాధాకృష్ణన్

ప/ఆ: ఝుమ్మని రాగాలే కమ్మని గీతాలే
నాలో మౌనంగా నీ ప్రేమే పలికినదీ
అ: రమ్మని మౌనాలే ఇమ్మని అందాలే
నీలో పువ్వల్లే నవ్వల్లే విరిసినదీ
ఆ: మనసు పడితే వలపనీ
అ: వలపు పుడితే వరమనీ
ఇ: మనకోసం మనసు గుడిని మలిచె పిలిచె ॥ఝుమ్మని॥
చ/ఆ: ఆకాశమే నీ మనసులా ఆరాటపడిపోయె ఇన్నాళ్ళుగా
అ: అనుబంధమే ఆనందమై తెరలన్ని విడిపోయె నీరాకతో
ఆ: రోజాలు తన చుట్టూ విరబూయగా
శిరోజాలు పులకించి పెనవేయగా
అ: గారాలు పోయేటి పూబంతికీ
సింగారాలు అవుతాయి చేమంతులూ
ఆ: నీమాట నామాట కావాలి ఒకపాట పాడాలి మనతోటలో
అ: అనురాగాల సయ్యాటలో ॥ఝుమ్మని॥
ఆ: మునివేళ్లతో నిను తాకితే పాదాల సిరిమువ్వలే మోగెనూ
అ: కొనగోళ్లతో నరనరముల కళ్యాణ వీణియలే కదలాడెనూ
అ: ఆ రామ లతలల్లే పెనవేయగా
శిల్పారామ అందాలే చినబోవగా
ఆ: హారాలే వేస్తుంటే నీ చేతులూ



చెల్లి: మంటెత్తి పోతుంటే మహా మజాగా
తళాంగుమంది ఈడు అదోవిధంగా ॥మంటెత్తి॥
అక్క: ఇంత కాలంగా ఈ నిజం తెలీక ఇప్పుడే కనిపెట్టా
నిండా మునిగాక... కాకాకా... యురేకా... కాకా
శ్రీకాంత్: ముందు పుట్టిన అక్కకిపుడు తెలిసిన తిక్క
ముందే తెలుసంట ఈ చెల్లికెలాగ
రాజా: అదేకదా బ్రెదరూ మన లవ్వు తడాఖా
నువ్వు అలా ప్రొసీడైపో ఇదే విధంగా
యురేకా... యురేకా...
చ/కోవై: గండు చీమ గిచ్చినట్టు తేనెటీగ కుట్టినట్టు
చక్కెర చేదుగుంది చమత్కారంగా
చింతపండు తీయగుంది వెటకారంగా
బ్రహ్మ: ఎండుమిర్చి దండగుచ్చి సిగను ముడిచి శివంగొచ్చి (2)
చిటికెలు వేస్తుంటే సింగారంగా
శవం కూడా లేచిరాద చిలిపి తనంగా...
ఆషా: ఇంతపచ్చి నిజాలన్ని కళ్లముందు వుండగా
మరిచి ఎలా బతికామో మరీ పరాగ్గా... ॥ఒంటి॥
రాజా: ఎక్కడికెళతావన్నా ఇక్కడ వదినుండగా
చినదాన్ని నన్నూ కలిపి అక్షింతలు వెయ్యక
శ్రీకాంత్: పక్క బెదురుగుంది బ్రెదరూ అక్క చెల్లెళ్లముదురు
బతికుంటే బజారులో పది జేబులు
తడుముకుంటూ బతకొచ్చు...
వదిలెయ్యి నువ్వూ ఎత్తేయి లంగరు...
చ/అక్క: ముస్తాబు ఓప లేక చస్తోంది వొంటి కాక
వయ్యారమిస్తా నీకు ఉబలాటంగా
తికమక తీర్చిపెట్టు తిమ్మిరి తీరంగా...
శ్రీకాంత్: తహతహ తాళలేక తరిమితె దారిలేక
ఊ కొడతానే పిల్లా ఉపకారంగా
జో కొడతానే ఇలా బజ్జో యింకా
చెల్లి: ఏపునచ్చి షేపుమెచ్చి కైపురెచ్చి దాపుకొచ్చి ॥ఏపు॥
వొలుచుకు పొమ్మంటూ వగలిచ్చాక



**2** గానం: మనో, స్వర్ణలత

హవ్వా హవ్వా హవ్వా హవ్వా (2)
ఆ: ఒకే ఒక్క ముద్దివ్వా హవ్వా హవ్వా
ఒళ్లో పొద్దు పోనివ్వా హవ్వా హవ్వా
ముఖం ముడుచుకుంటావా హవ్వా హవ్వా
సుఖం వదులుకుంటావా హవ్వా హవ్వా
మరీ చిన్న పిల్లడివా... హవ్వా హవ్వా
మగాడల్లె రాగురువా... హవ్వా హవ్వా
అ: ఒకే ఒక్క మాటినవా హవ్వా హవ్వా
అలా కాస్త నిలబడవా హవ్వా హవ్వా
బజారెంట పడతావా హవ్వా హవ్వా
ప్రజల్ని బెదిరిస్తావా హవ్వా హవ్వా
సిగ్గే విసిరికొట్టావా హవ్వా హవ్వా
శివాలెత్తి వచ్చావా హవ్వా హవ్వా
చ/ఆ: నీ కోసమే వెన్నపూసెట్టి పెంచాను
ఈ నునుపు నువ్వందుకో
అ: నీ వేషమే చూసి వడగొట్టి పోయాను
నా కొద్దు నువ్వుంచుకో
ఆ: చెలి సరసకు రావా అరె సరసమె కరువా
నా సొగసుల గొడవ విని సరదా పడవా
అ: అయ్ బాబో ఏంటే నీ చొరవ
ఓ... వద్దన్నా వీధుల్లో వీరంగం వేస్తావా
తప్పన్నా థెయ్యంటూ తారంగం చేస్తావా
ఊరంతా చూస్తోందే హోరెత్తే నీ తెగువా
నీ సంత గోలెంతో బాగుందే అపేయవా
ఆ: మరీ చిన్న పిల్లడివా... హవ్వా హవ్వా ॥హవ్వా॥
మగాడల్లె రాగురువా... హవ్వా హవ్వా
అ: ఒకే ఒక మాటివ్వవా
ఆ: ఒకే ఒక ముద్దివ్వా
అ: అలా కాస్త నిలబడవా
ఆ: ఒళ్లో పొద్దు పోనివ్వా

విహారాలే చేస్తాయి నా ఆశలూ
అ: ఏడేడు జన్మల్లో ఆరారు ఋతువుల్లో
నీతోడు నీతోడుగా
ఆ: నేనుంటాను నీ నీడగా ॥ఝుమ్మని॥

రచన: సాహితి **3** గానం: యస్.పి.బాలచరణ్, సునీత

ప/అ: ప్రియురాలా ప్రియురాలా నీ ఎదలో కొంచెం చోటీవా
ఆ: కలనైనా నిజమైనా నాప్రాణం సర్వం నీవేగా
అ: నిన్ను చూసి ఎందుకో నను నేనే మరిచానే
ఆ: నీవు నన్ను తాకగా పులకించే నామేనే
అ: ప్రియురాలా ప్రియురాలా ప్రియురాలా ॥ప్రియురాలా॥
చ/అ: ప్రేమ అన్నది పిచ్చైనా అమృతాన్నే కురిసేనా
ఆ: ఊపిరాగి పోతున్నా ఆగేది కాదు మనప్రేమ
అ: మదే నిండి పోయింది తుదేలేని తొలిప్రేమ
ఆ: జతే వీడి పోనంది ప్రియా నిన్ను ప్రళయానా
అ: ఏమైనా ఈలోకం ఆ: ప్రేమేగా మనలోకం
అ: ప్రియురాలా ప్రియురాలా ప్రియురాలా ॥ప్రియురాలా॥
చ/ఆ: మారిపోని మనప్రేమ ఓడిపోదు విధికైనా
అ: కాలమెంత ఎదురైనా గెలిచేను చూడు మనప్రేమ
ఆ: యుగాలైన నీకోసం ఇలా వేచి వుంటాలే
అ: జగాన్నైనా కాదంటూ నినే చేరుకుంటాలే
ఆ: చావైనా బ్రతుకైనా అ: ఆమాటే ఉహుహూహూ
అ: ప్రియురాలా ప్రియురాలా ప్రియురాలా ॥ప్రియురాలా॥

రచన: గురుచరణ్ **4** గానం: కనకేష్, ఉష

ప/అ: ముద్దబంతి పూలే ఎట్టి
ముందూ తలుపూ మూసిపెట్టి ఎనక గడీ ఎయ్యాలన్నావే
కడవ మీద కడవా బెట్టి
ఎడమాసెయ్యి ఎత్తిపెట్టి ఏళతప్పి రావొద్దన్నావే
ఆ: జాఁవ సెట్టుకింద మంచం ఏసీ జలీసీర ముస్తాబై
కూకున్నాను



మావ తప్పకుండ వస్తాడనీ మరీ మరీ కళ్లేమో చూస్తున్నాయి
అ: కళ్లుందీ నీకోసం వేచేందుకే
ఆ: కాలుందీ నీ మెట్టే తొడిగేందుకే
చెయ్యుందీ నీచెయ్యి పట్టేందుకే
అ: మనసుందీ నీ మనిషి నయ్యేందుకే ॥ముద్దబంతి॥
చ/అ: ముద్దాడా అడ్డొచ్చే ఈ ముక్కు పుడకా తీస్తే ఓపనైపోతదీ
ఆ: కౌగిళ్లే సడలించే బంగారు గాజులూ తీసేస్తే మరీ మంచిదీ
అ: కడియాలే నడిరేయి తెగ చప్పుళ్లే చేస్తాయి ఒగ్గేస్తేనె మేలు
ఆ: ఝల్లు మనిపిస్తూ నవ్వుండగా
మరీ మరీ గొల్లుమనే నగలెందుకూ
అ: పండు ఎన్నెల్లా నవ్వుండగా
మళ్లీ మళ్లీ దీపాలా ఎలుగెందుకే ॥ముద్దబంతి॥
చ/అ: పూవంటి నీమోము కాంతుల్లో
తిరిగే సూరీడు నన్నే అవ్వనీ
ఆ: మొలలోతూ నీళ్లల్లో మొగ్గల్లే విరిసీ చంద్రుణ్ణీ తల్లో పెట్టనీ
అ: మెరిసేవీ ఉరిమేవీ
మన పందిట్లో మోగేటి మేళాలే చూడు
ఆ: కంటీ పాపలకూ కట్టే కట్టీ నిన్నే నిన్నే
కట్టుకునే మనిషవ్వనీ
అ: సన్న సన్నానీ పైటంచులో అద్దాలతో
అందాలా రవికవ్వనీ ॥ముద్దబంతి॥

రచన: సాహితి **5** గానం: రాధాకృష్ణన్, ప్రదీప్‌రాజా, కనకేష్, సునీత, గాయత్రి

ప/ఆ1: ఎన్నడో పాత యుగములనాటి
బానిసే కదా మీ స్త్రీజాతి
ఆ2: తెలివినే మీరె జగమున ఇంతీ
తెలుసుకో ఇంకా ఓ మగజాతీ!
ఆ3: సాగదు ఇంకా మీ జులుము
చూపిస్తాము మా బలము
కో: ఎదురే తిరిగిన పడతులము



చ/ఆ: అలవాటే లేనట్టు ఎటువైపో చూడొద్దు అవకాశమే అందుకో
అ: పొరపాటే కానట్టు మితిమీరి పోవద్దు ఆరాటమే ఆపుకో
ఆ: కలిసొచ్చిన వరస అలుసైందా పురుషా
నను మించిన హంస అసలుండదు తెలుసా
అ: ఒద్దమ్మో ఓయమ్మో పైపైకి రాకమ్మో
ఒట్టమ్మో నీమీద ఏమాత్రం లేదమ్మో
ఆ: ఎంచక్క రమ్మంటే కొమ్మెక్కి పోకయ్యో
ముద్దంటే చేదంటే ఏదోలా ఉందయ్యో
అ: అబ్బో ఏది ఉన్మాదం హవ్వా హవ్వా
సహించడం ఎవడితరం హవ్వా హవ్వా ॥హవ్వా॥
కిరెక్కిందె యవ్వారం హవ్వా హవ్వా
చిరాగ్గుందె నీగారం హవ్వా హవ్వా
నడీధుల్లో సంచారం హవ్వా హవ్వా
అతుక్కుంటె అపచారం హవ్వా హవ్వా
అహో ఏఁవి ఉన్మాదం హవ్వా హవ్వా
సహించడం ఎవడి తరం హవ్వా హవ్వా ॥హవ్వా॥

**3** గానం: టిప్పు, గోపిక పూర్ణిమ

ప/ఆ: వీలుచూసి వేళచూసి వాలిపోనా అందగాడా
అ: చాటుచూసి చోటుచూసి ఏలుకోనా లేత ఈడా
ఆ: ఊసులెన్నో చెప్పుకుందాం గాలికూడా వినకుండా
అ: ఊహలెక్కి వెళ్లిపోదాం ఊరువాడా చూడకుండా
ఆ: హోయో హోయో హోయో
హోయో హోయో హోయో హోయో
అ: హోయో హోయో హోయో
హోయో హోయో హోయో హోయో ॥వీలుచూసి॥
చ/ఆ: ఏపూట కాపూటే సరికొత్త కాబట్టే
లౌగుట్టు చూపలేరు ఎవ్వరూ మరీ...
అ: ఏ జంట కాజంటే సొంతంగా చూడందే
తేలేది కాదు ప్రేమలోని వైఖరీ...
ఆ: దొంగ ముద్దే తీయనంటా - దానిమత్తే తీరదంటా



అ: కౌగిలింతే ఈయకుండా హోయి మంటే ఆరదంటా
ఆ: అవునో కాదో తేలేదెట్టా - అంతో ఇంతో అనుభవమే లేక
అ: హోయో హోయో హోయో
హోయో హోయో హోయో హోయో
ఆ: హోయో హోయో హోయో
హోయో హోయో హోయో హోయో ॥చాటుచూసి॥
చ/అ: ప్రేమించుకుందాంరా పిలిచింది ప్రియమారా
ప్రయివేటు క్లాసు పెట్టి వేడి కౌగిలీ...
ఆ: తంటాలు పడకుండా కంట్రోలు చెడకుండా
కవ్వింత ఆపనంది కొంటె ఆకలీ...
అ: యవ్వనమే కందకుండా ఆగదందాం కోడె జంట
ఆ: ఎవ్వరికీ అందకుండా ఎగరేద్దాం ప్రేమ జండా
అ: సందేహంగా ఉందా ఇంకా సంతోషంగా సర్లే అనుకోకా...
ఆ: హోయో హోయో హోయో
హోయో హోయో హోయో హోయో
ఆ: హోయో హోయో హోయో
హోయో హోయో హోయో హోయో ॥వీలు చూసి॥

**4** గానం: మనో, యస్.పి.చరణ్, స్వర్ణలత, సుజాత

చెల్లి: ఏంటంటావే అక్కా నాకేం వినపడక
ఏం జరుగుతుందక్కడ తలుపుల వెనక
అక్క: అర్థం కావట్లేదే నాకూ సరిగా
మొత్తానికి బాగుందే భలే సుఖంగా
పైకేమో చలిచలిగా లోపలేమో సలసలగా
కొరుకుతున్నవీ నీళ్ళు కొంటె తనంగా...
చెల్లి: కంటపడని కంటి చురుకు వెంటబడుతూ
వొంటె కులుకు అటు ఇటు అదే పనిగా
తడుముతు వున్నట్టుంటే...
అక్క: ఉంటే... అంటే...
చెల్లి: అంటే ఏంటంటే నీకదేదో అయినట్లే... యురేకా... యురేకా...
ప/అ: ఒంటిమీద పట్టుకోక కెవ్వుమంది వుండలేక
కొంటెబాధ పట్టలేక జివ్వుమంది చిట్టిరైక

జనవరి 18 సైగల్ వర్ధంతి సందర్భంగా

# అమరగాయకుడు కుందన్‌లాల్ సైగల్



**కుం**దన్‌లాల్ సైగల్ అనగానే మనకు ముందుగా జ్ఞప్తికి వచ్చేది అతని స్వరమాధుర్యం. పంతొమ్మిది వందల ముప్పై, నలభైలలో చరిత్ర సృష్టించిన గాయకుడుగాను, నటుడుగాను సైగల్ చలన చిత్రసీమలో పేర్గాంచాడు. చిన్న వయసులోనే (42 సం॥) అకాల మరణం చెందినా చిరాయువైన అతనిపాట ఇప్పటికీ సంగీత ప్రియులను వెంటాడుతూనే ఉంది. ఓ తరం వారికి అతడు ఆరాధ్యగాయకుడే!

పంజాబ్‌లోని జలంధర్ పట్టణంలో ఓ సామాన్య కుటుంబంలో పుట్టిన సైగల్ కలకత్తాకు వలసెళ్లాడు. అక్కడ జీవనాధారం కోసం ఎన్నోకష్టనష్టాలు పడ్డాడు. టైప్‌మిషన్ల సేల్స్‌మెన్‌గా ఉద్యోగం చేసాడు. ఒక ప్రైవేటు ఫంక్షన్‌లో సైగల్ పాడిన పాట అదృష్టవశాత్తు అక్కడ హాజరైన న్యూథియేటర్ ప్రముఖుల దృష్టినాకర్షించి ఆడిషన్‌కు కబురు వచ్చేట్లా చేసింది. ఆర్.సి.బోరల్, తిమిర్-బరన్ లాంటి గొప్ప సంగీతకారులు సైగల్‌ని ఉత్తమ శ్రేణి గాయకుడిగా ఆదరించారు.

అది నటగాయకుల యుగం. న్యూథియేటర్స్ అధినేత ఆర్.సి.బోరల్‌కు సైగల్ రూపురేఖలు నచ్చకపోయినా నటించడానికి ఛాన్స్ ఇచ్చారు. 1932లో సైగల్ నటించిన మొదటి మూడు చిత్రాలు 'మొహబత్‌కి ఆం సూ' 'జిందాలాష్', 'సుబహ్‌కా సితారా' ఘోరంగా ఫ్లాప్ అయ్యాయి. అయినా అతనికి 'యహూదీకీ లడ్‌కీ' (1933)లో ఛాన్సునిచ్చారు. నితిన్ బోసు దర్శకత్వంలో సైగల్ నటించిన 'చండీదాస్' (1934) చిత్రం మంచి పేరు ప్రతిష్టలు తెచ్చింది. అతని పాటలు ప్రతి చోట మారు మ్రోగాయి. సైగల్ నటించిన 'దేవదాసు' (1935) ఓ క్లాసిక్! దాని దర్శకుడు పి.సి.బారువా (ఇతనే బెంగాలీ 'దేవదాసు'లో దేవదాసు పాత్రను పోషించాడు). సైగల్ దేవదాసుగా ఎంతో హృద్యంగా పాడి, నటించాడు. తాగుబోతుగా పాట పాడేటప్పుడు తాగి పాడితేనే బాగుంటుందని నమ్మాడు. ఫలితంగా నిజజీవితంలో కూడా దానికి బలైనాడు. 'దేవదాసు' పాటలు దేశమంతా ప్రతి ధ్వనించాయి. దాంతో బాటు సైగల్ పేరు కూడా!

న్యూథియేటర్స్ పాలిట సైగల్ తురుపు ముక్క. వాళ్లు ఆ తురుపు ముక్కను చాలా బాగా ఉపయోగించుకున్నారు. 'ధర్తీమాతా' (1938), 'ప్రెసిడెంట్' (1937), 'దుష్మన్' (1939), 'లగన్' (1941)లాంటి చిత్రాలు సైగల్ వల్లనే విజయవంతమయ్యాయని అనవచ్చు. మరొక సింగర్-స్టార్ కాననదేవితో కలిసి సైగల్ నటించిన 'స్ట్రీట్ సింగర్' (1938) మరుపురాని సినిమాగా మిగిలింది. విషాద నటుడుగా పేరు వచ్చినా సైగల్ తరువాత రొమాంటిక్, కేర్ ఫ్రీ హీరోగా కూడా నటించినా ('ప్రెసిడెంట్', 'కరోడ్‌పతి') ప్రజలు సరదా పాత్రలలో, సరదా పాటలలో సైగల్‌ను ఐడెంటిఫై చేయలేదు. సైగల్ అంటే విషాద పాత్రలు విషాద గీతాలు అనే ప్రజల భావం.

'బాలమ్ ఆయె బసో మోరె మన్ మె', 'బాబుల్ మొరా నైహర్', 'సోజా రాజ్‌కుమారి' లాంటి పాటల్ని ప్రజలు నెత్తిమీద పెట్టుకున్నారు. కొన్ని సంవత్సరాల తర్వాత సైగల్‌ను బొంబాయి ఆకర్షించింది. కార్దార్ తీసిన 'షాజహాన్' (1946)లో నటించారు. ఇందులో నౌషద్ సంగీతాన్ని కొత్త పుంతలు పట్టించారు. 'తాన్‌సేన్' (1943), 'భక్తసూరదాస్' (1942)లలో కూడా నటించాక మళ్లీ కలకత్తా వచ్చి యుద్ధ నేపథ్యంలో తీసిన 'మేరీ బెహన్' (1944) చిత్రంలో నటించారు.

మళ్లీ బొంబాయిపై దృష్టి మరలింది. సురయ్యాకు జోడీగా 'పర్వానా' (1946), 'ఒమర్ ఖయ్యామ్' (1946) వంటి చిత్రాలు వచ్చాయి. కానీ అవి అతనికి పూర్వ వైభవాన్ని సమకూర్చలేక పోయాయి. మద్యపానం అతన్ని బలహీనుణ్ని చేసింది. నటించడానికి, పాడడానికి చాలా కష్టపడేవాడు. క్రమంగా ఆరోగ్యం క్షీణించింది. తాను ఎంతగానో అభిమానించిన జన్మభూమి జలంధర్‌లో 1947లో మరణించాడు.

బి.ఎన్.సర్కార్ సైగల్‌పై 'అమర్ సైగల్' అనే సినిమా తీసేడు. కాని అది ఫ్లాప్ అయింది. రేడియో సిలోన్‌లో ప్రతిరోజు 'పురానే ఫిల్మోంకే గీత్' కార్యక్రమంలో చివరి పాట సైగల్‌కి కేటాయించి, అతని ఖ్యాతిని అజరామరంగా ఉంచింది.

నౌషద్ చెప్పిన ఓ సంఘటన మనస్సును కలచి వేస్తుంది. నౌషద్ సంగీతంలో పాట పాడడానికి సైగల్ మద్యంతో సహా వచ్చాడు. 'ఎందుకండి?' అంటే ఇది తాగితేనే పాట బాగా వస్తుందన్నాడట. 'తాగకుండా పాట పాడండి' అని అడిగి అది రికార్డు చేయించాడట నౌషద్. తర్వాత రిహార్సిల్సు జరుగుతున్న కొద్దీ సైగల్ తాగుతూ పోయాడట. చివరగా పాట 'ఓకే' అని సైగల్ అనుకొన్నాక రికార్డింగు ఆగిందట. అప్పుడు నౌషద్ రెండు రికార్డింగులు వినిపించి ఏది మెరుగో చెప్పమంటే సైగల్ ఒక దాన్ని సెలక్ట్ చేసి 'చూశావా మద్యం మహిమ! పాట ఎంత బాగా వచ్చిందో!' అన్నాడట. 'సైగల్ సాబ్! ఇది మీరు తాగడానికి ముందు పాడినది' అని నౌషద్ చెబితే సైగల్ నిర్ఘాంతపోయాడట. 'నీలాంటివాడు నా జీవితంలో ముందే తారసిల్లి ఈ విషయం చెబితే పరిస్థితి ఇంతదాకా వచ్చేది కాదు. ఇప్పుడు టూ లేట్' అని బాధపడ్డాడట.

ఎంతగొప్ప కళాకారుడైనా సరే తాగుడుకి బానిసవుతే ఏమవుతుందో సైగల్ జీవితమే ఓ ఉదాహరణ!

-ప్రకాష్ రాయపనేని

## మరుపురాని సైగల్ పాటలు కొన్ని.....

బాలమ్ ఆయె బసో మెరె మన్‌మె - (దేవదాస్ (1935) సం॥ తిమిర్ బరన్ - రచన - కేదార్‌శర్మ), బాబుల్ మొరా -(స్ట్రీట్ సింగర్ (38) సం॥ ఆర్.సి.బోరల్, రచన: అమీర్ ఖుస్రో), కరూం క్యాఆస్ నిరాస్‌భయి - (దుష్మన్ (39) సం॥ పంకజ్ మల్లిక్, రచన: ఆర్జూ లఖ్నవీ) సోజా రాజకుమారి - (జిందగి (40) సం॥ పంకజ్ మల్లిక్, రచన: కేదార్‌శర్మ), నయన్ హీన్‌కోరాహ్‌దిఖా, మధుకర్ శ్యామ్ హమారే చోర్ (భక్తసూర్‌దాస్ (42) సం॥ జ్ఞాన్‌దత్, రచన: డి.ఎన్.మధోక్), కాహేగుమాన్‌కరె - (తాన్‌సేన్ (43) ఖేమ్ చంద్‌ప్రకాష్, రచన: పండిట్ ఇంద్ర), దోనైనామత్‌వారే, ఐకాతి బెతకదీర్ - (మైసిస్టర్ (44) సం॥ పంకజ్ మల్లిక్, రచన: పండిట్ భూషణ్), ఘమ్ దియే ముస్తకిల్ - (షాజహాన్ (46) సం॥ నౌషాద్ ఆలీ, రచన: మజ్రూ సుల్తాన్‌పురి)





# రాంపండు లీలలు

## రాంపండూ - శాండో షాలినీ

'ఏరోయ్, ఈ మధ్య కనబట్టం లేదు. ఊళ్లో లేవా?"

"లేను, దగ్గరే ఓ పల్లెటూళ్లో ఉంటున్నాను".

"నువ్వా? పల్లెటూరా? ఆశ్చర్యంగా ఉందే! పల్లెటూర్లంటే నీకెంత అసహ్యమో తెలిసున్నవాళ్లెవరూ ఈ మాట నమ్మరు".

"నమ్మకపోతే పోనీ! పొట్ట గడవాలంటే పల్లెటూరికి కాదు, వల్లకాటికైనా పోవాలి. ఉద్యోగికి దూరభూమి లేదన్నారు పెద్దలు!"

"నీకింత బుద్దెప్పణ్నుంచి వచ్చిందిరోయ్. అయినా నీకేం ఖర్మ? మీ బాబాయి ఉన్నాడుగా - ప్రతీనెలా నీ ఖర్చులకు సరిపడా పాకెట్‌మనీ ఇచ్చేటందుకు!"

"బాబాయి మాటెత్తకు నాకు ఒళ్లు మండిపోతుంది" అన్నాడు రాంపండు.

రాంపండు పెసరట్ల సుబ్బిని పెళ్లి చేసుకునే ఉద్దేశ్యంతో, వాళ్ల బాబాయి పాతతరం అభిప్రాయాలు మారుద్దామని ప్రయత్నించడం, ఆయన మార్చుకుని వంటామెను పెళ్లి చేసుకోవడం తెలిసున్న వాళ్లు రాంపండు కోపానికి కారణం సులభంగా ఊహించగలరు. అందునా అతనితో సంభాషణ జరుపుతున్న అనంతశయనం చిన్ననాటి మిత్రుడు కావడం చేత, పైగా సుబ్బి ప్రహసనంలో రచయితగా నటించడం వల్ల ఆ విషయం పూర్తిగా తెలిసున్నవాడు కాబట్టి రాంపండు కోపం చూసి జాలిపడి ఊరుకున్నాడు. కానీ రాంపండే ఊరుకోలేకపోయాడు.

"నీకు తెలుసా? మా బాబాయి ఎంత పీనాసి అయిపోయాడో! కొత్త పెళ్లాం వచ్చాక పాకెట్‌మనీ సగానికి సగం తగ్గించి వేశాడు. ఎలా చావమంటావు చెప్పు?"

"మరి రోజూ ఎలా ఛస్తున్నావు?"

"ఏం చేస్తాం? గుర్రప్పందాలు ఆడి ఓవర్ డ్రాఫ్టు భర్తీ చేసుకుంటున్నాను"

"పాపం రాష్ట్ర ప్రభుత్వానికి ఈ సౌకర్యం లేదు కదా!"

"నాకు ఉండి మాత్రం ఏం కలిసి వచ్చిందిలే... తూఫాన్‌రాణీ తెలుసా?"

"సినిమానా?"

"నీ మొహం! గుర్రంరా.... రేసుల్లో గొప్ప ఫేవరెట్‌లే. పాకెట్ మనీ వచ్చిన్నాడే మొత్తమంతా కాశా".

"మరింకేం?"

"పూర్తిగా విను. లాస్టు వచ్చింది. మనకు లాసు తెచ్చింది. మళ్ళీ ఫస్టుదాకా పాకెట్‌మనీ రాదు. పొట్ట గడవాలిగా. రామారంలో ఓ కుర్రాడికి ప్రైవేటు మాష్టారు కావాలని పేపర్లో వేశారు. అప్లయి చేయగానే రమ్మన్నారు. తిండికి లోటు లేకుండా రోజులు గడిచిపోతున్నాయి"

"రామారంలో బండవారని మా దూరపుబంధువులు ఉన్నారులే!"

"మీ బంధువులా? వాళ్లబ్బాయికే నేను చదువు చెబుతున్నది....!"



# ఓల్డ్ హార్స్ ఘర్ యా



"ఎవరూ బుజ్జిగాడంటారు. వాడా? వినడమే తప్పు ఎప్పుడూ చూడలేదు..."

"చూడకపోతే ఇక చూడక. చెడు కనకు, వినకు, మాట్లాడకు అని గాంధీ గారు చెప్పలే!?"

"....నిజానికి వాళ్లింట్లో నాకు తెలుసున్న అమ్మాయి షాలిని మాత్రమే...."

అనంతం మాట పూర్తి చేసే లోపునే రాంపండు మొహంలో ఓ కొత్త వెలుగు. కళ్లు పెద్దవయ్యాయి. బుగ్గలు బూరెల్లా అయ్యాయి. గొంతులో ఉన్న ముడి పైకి కిందకి, సైన్సు ఎగ్జిబిషన్‌లో నీటిమీద పింగ్‌పింగ్ బాలులా ఆడసాగింది.

"అనంతం" అన్నాడు రాంపండు ఆర్తిగా.

ఆ వాయిస్ అనంతానికి బాగా గుర్తే. రాంపండు ప్రేమలో పడ్డప్పుడెల్లా ఆ సదరు ప్రేయసి ప్రస్తావన వచ్చినప్పుడు ఇలాటి టోనులోనే మాట్లాడడం, నిట్టూర్చడం చేస్తూ ఉంటాడు. అందునా రాంపండు ప్రేమలో పడడం అనేది చాలా తరచుగా జరిగే వ్యవహారం. కానీ ఈసారి మాత్రం ఆ సందర్భం అయివుండక పోవచ్చు అనుకున్నాడు అనంతం. ఎందుకంటే అవతలి శాల్తీ - శాండో షాలిని!

అనంతానికి షాలిని ఎంతమాత్రం రుచించకపోవడానికి రెండు కారణాలు ఉన్నాయి ఒకటి ఆమె బుర్ర పెద్దది. చాలా ఇంటెలిజెంటు లేడీగా బంధువర్గాల్లో పేరు తెచ్చుకుంది. రెండు - ఆమె శరీరం పెద్దది. తిండి పుష్టి తద్వారా కండపుష్టి సంపాదించుకుని కాలేజీ రోజుల్లో రౌడీలను చావగొట్టేది. బాక్సింగు పోటీల్లో కూడా పాల్గొందేమోనని అనంత్‌కి అనుమానం. భళ్లున నవ్విందంటే పిల్లలు దడుసుకొని దాంకోవాల్సిందే. అనంతం లాటివాడైతే ఆమె నవ్వకపోయినా దాంకుంటాడు.

కానీ రాంపండు కథ వేరు. "అనంత్, నేను ఆమెను ఆరాధిస్తానురా. ఆమెను మాత్రమే కాదు, ఆమె నడిచే భూమిని, పీల్చేగాలిని....దేనినైనా సరే ఆరాధిస్తాను. అంతేకాదు. ఆమె.."

"ఇక చాల్లే. విషయం అర్థమయింది. ఇంతకీ నీ ప్రేమ సంగతి చెబితే ఏవుంది?"

"ఇంకా చెప్పనే లేదు. ఎలా చెప్పడం చెప్పు? తమ్ముడికి ప్రైవేటు చెబుతూంటే అప్పుడప్పుడు వస్తూంటుంది. గార్డెన్లో నేను పిచ్చెక్కినట్లు తిరుగుతూ ఉంటే వచ్చి పలకరిస్తుంది. నేను నా మనసు విప్పి చెప్పేద్దామనుకుంటాను. కానీ ఎలా చెప్పగలను? ఆ చూపు ఉందే... ఆమె చూపు..."

"... తెలుసులే. కమెండో చూపు".

"ఛ, ఛ, అచ్చుతప్పు. కన్నె చూసే కమ్మటిచూపు. ఓ లతాంగి చూసే లాలిత్యపు చూపు. ఒక దేవత వెదజల్లే కారుణ్యపు చూపు..." రాంపండు సినిమా పాటలు రాసే మూడ్‌లోకి వెళ్లిపోవడంతో అనంతానికి అనుమానం వచ్చేసింది.

"ఒరేయ్, ముందొక విషయం తేల్చు. మనిద్దరం ఒకే అమ్మాయి గురించి మాట్లాడుతున్నామా? లేక రెండు అమ్మాయిలా? నేను మాట్లాడేది బండవారి అమ్మాయి... షాలిని అని. అ ఆమ్మాయికి చెల్లెలెవరైనా ఉందా? లేదా మాలిని అనే కవల అక్క ఉందా?"

"నోర్ముయ్, ఇదేమీ సీతాగీతా టైపు కథ కాదు. షాలిని ఒక్కతే! నో అక్క, నో చెల్లెలు. షాలినిలాటి మరొకరు ఉండడానికి వీల్లేదు."

"మరి తను నీకు లతాంగిలా కనబడుతోంది"

"అవును. కనబడుతోంది" రాంపండు మొండికేశాడు.

"గాడ్ బ్లెస్ యూ" అన్నాడు అనంతం జాలిగా.

"పాడుతా తీయగా చూస్తూ కూచో. ఇలాటి మాటలే వస్తాయ్. నాకు పనుంది. పోవాలి. బుజ్జిగాడిని డెంటిస్టు దగ్గర కూచోబెట్టి వచ్చా".

"అక్కడికి నేనొక్కణ్నే ఖాళీగా ఉన్నట్టు! మా ఉషారత్తయ్య లంచ్‌కి పిలిచింది. ఈ మధ్య మా ఇద్దరికీ కొంచెం మనస్పర్థలు వచ్చాయిలే. ఎలా పాచప్ చేయాలని అనుకుంటూ ఉంటే, ఇవాళ హోటల్‌కి లంచ్‌కి పిలిచింది. తను చెప్పిన పనేదో చేసేస్తే ఇక చల్లబడుతుంది. వస్తా".

అనంతానికి అత్తయ్యలంటే మంట. అందునా పెద్దత్తయ్య మాంకాళి అంటే మరీనూ. చిన్న అత్త పేరు ఉష. అయినా అన్నిట్లో హుషారవడంతో ఉషారత్తయ్య అని పిలుస్తాడు అనంత్. ఆవేళ అత్తయ్య చెప్పే మాట వినేస్తే సరి అనుకున్నాడు కానీ అది తన పీకకు చుట్టుకునే వ్యవహారం అని ఊహించలేకపోయాడు.

"ఒరే అనంతం, నువ్విక పెళ్లి చేసుకోక తప్పదు. అమ్మాయి నాకు నచ్చింది. అవతలివాళ్లకు మాటిచ్చేశాను. నువ్వు చుట్టపుచూపుగా వాళ్లింటికి వెళ్లి వారం రోజులుండి ఆ అమ్మాయిని చూడు. బాగా ఆలోచించుకుని సరేనని చెప్పు".

"అది కాదు అత్తయ్యా.... పెళ్లి చేసుకోవడం గురించి నా అభిప్రాయం తెలిసికూడా..." అంటూ నాన్చేడు అనంతం.

"తెలుసుకాబట్టే నిన్ను మార్చగల అమ్మాయి కోసం ఇన్నాళ్లూ చూశాను. షాలినికి ఆ కెపాసిటీ ఉంది కాబట్టే..." అని ఉషారత్తయ్య చెప్పబోతూండగానే అనంతం ఉలిక్కిపడ్డాడు. "ఎవరూ శాండో షాలినా?" అని అరిచాడు.

"సిల్లీ ఫెలో.. వాళ్ల ఇంటిపేరు బండవారు. శాండోవారు కారు. నీలాటి మతిమరుపువాణ్ని బాగు చేయాలంటే షాలినే సరైన అమ్మాయి. రేపే రామారం



వెళ్లు. అలా అయితేనే నిన్ను క్షమిస్తాను." అని తేల్చేసింది ఉషారత్తయ్య.

తోటలో చెట్టునానుకుని సిగరెట్టు కాలుస్తున్న రాంపండు అనంతాన్ని చూడగానే ఎగిరి గంతేశాడు. "నువ్వెలా వచ్చేవురోయ్?" అంటూ.

"చెప్తాగానీ ఈ తోటలో, ఈ బ్రిజ్ దగ్గర నీకేం పని?" అని అడిగేడు అనంత్ ఆశ్చర్యపడుతూ.

"అదిగో ఆ కుర్రాడు లేడూ, బ్రిజ్ మీద చేపలు పడుతూ కూచున్నాడే.... వాడే బుజ్జిగాడు. వాడికోసం వెయిట్ చేస్తున్నాను. ఆ ఫిషింగ్ ప్రోగ్రాంలో ఒక్క చేపైనా దొరికితేనే పాఠం చెప్పించుకోడానికి వస్తాట్ట".

అనంత్ జాలిపడ్డాడు. 'ఇటువంటి వాడితో ఎలా వేగుతున్నావురా?" అని.



"కష్టమే..."

"ఏమిటి? పాఠాలు చెప్పడమా?"

"కాదు, వాణ్ని ప్రేమించడం"

"బుజ్జిగాణ్ని.... ప్రేమిస్తున్నావా!!"

"ఏం చెయ్యనూ, షాలిని కోసం.... తమ్ముడంటే పడిఛస్తుంది."

"నువ్వు ఆమె అంటే పడిచావటం లేదూ....! ఇంతకీ నీ మనస్సు విప్పి చెప్పావా లేదా?"

"అబ్బే. ఇంకా ఎక్కడరా? ఈ కుర్రాడి కంచిగరుడసేవతో సరిపోతోంది".

"వాణ్ని... అలా...గే వంతెన మీదనుంచి కాలవలోకి తోసేయకూడదూ.?"

"అవకాశం వస్తే ఆ పని చేయడానికి ఛస్తుండేది నేనే. కానీ షాలిని ఉండగా అలా జరగడం అసంభవం. వాడి మీద ఈగ వాలినా సహించలేదు తను".

"ఐడియా" అని అరిచాడు అనంత్. ఒక్క దెబ్బకు రెండు పిట్టలు అని ఘోషించింది అతని మనస్సు. ఎలా అయినా సరే షాలిని, రాంపండులను కలిపితే తను హాయిగా బ్రహ్మచారిగా మిగలవచ్చు. బుజ్జిగాడిని అడ్డుపెట్టుకుని రాంపండు షాలినికి చేరువయితే చాలు. అప్పుడు ఉషారత్తయ్య తననేమీ తప్పుపట్టలేదు.

"ఒరే రాంపండూ, నువ్వో పని చేయి. ఎవరికీ తెలియకుండా ఆ కుర్రాణ్ని ఏక్సిడెంటల్‌గా తోసేసినట్టు నీట్లోకి తోసేసి నీ ముచ్చట తీరుస్తా.... తర్వాత షాలిని కళ్లెదురుగా వాడికోసం నీట్లోకి ఉరికి, వాణ్ని కాపాడి ఆమె అభిమానాన్ని పొందు".

రాంపండు కళ్లు చెమర్చాయి. "కుర్రాడు నిజం చెప్పేస్తే షాలిని నిన్ను జీవితంలో క్షమించదు. నా కోసం ఇంత త్యాగమా?".

"సెంటిమెంటు తర్వాత. ముందు వ్యవహారం చూడు. నేను రేపు సాయంత్రం నాలుగు గంటలకు షాలిని వెంటబెట్టుకుని తోట చూద్దాం రా, అని తీసుకువస్తాను. నువ్వు ఓ అరగంట ముందుగా వచ్చేసి ఆ పొదల దగ్గర దాక్కో. నేను షాలిని మాటల్లో పెట్టి సమయం చూసి వాణ్ని తోసేసి, హెల్ప్ అని అరుస్తాను. షాలిని వెనక్కి తిరిగి చూస్తుంది. నువ్వు పొదలచాటునుండి వచ్చి నీట్లోకి ఉరికి రక్షించేయ్. తను థాంక్స్ చెప్పబోతే 'థాంక్స్ కాదు, నీ ప్రేమ కావాలి' అను."

రాంపండు కళ్లలో ఎడ్మిరేషన్. "ఒరేయ్, అనంతం... అచలపతి నీ దగ్గర చేరిన తర్వాత నీకు తెలివి తేటలు పెరిగిపోయాయిరోయ్." అని ఒకటే మెచ్చుకోవడం... ఉక్రోషంతో అనంత్‌కి మాటలు రాలేదు. 'వీడికి సాయం చేయకపోతే ఏం" అన్న ఆలోచన కూడా వచ్చింది కానీ అంతలోనే తన లాభం కూడా దీంట్లో ఇమిడి ఉందని గుర్తు తెచ్చుకుని "సర్లే, రేపు సరిగ్గా నాలుగు గంటలకే ఏడు" అన్నాడు.

మర్నాడు మూడున్నరయినా షాలిని కనబడకపోవడంతో అనంతానికి ఖంగారు పుట్టింది, రాంపండు పొదల్లో ఎంతసేపు ఉండవలసి వస్తుందోనని. మూడు ముప్పావవుతూంటే షాలిని కార్లోంచి దిగింది. అదీ ఓ ఫ్రెండుని వెంటేసుకుని.

"మా క్లాసుమేటు సుజాత. పల్లెటూళ్లో పొలాలు, తోటలు చూస్తానని ముచ్చటపడింది. బస్టాండ్‌కి వెళ్లి రిసీవ్ చేసుకున్నాను. కాఫీ తాగేసి, మనం ముగ్గురం కలిసి తోటకు వెళదాం." అంది షాలిని ఎపాలిజిటిక్‌గా.

"అవునండి. నాకు విలేజెస్ అంటే చాలా ఇష్టం" అంది సుజాత అందమైన కళ్లు టపటపలాడిస్తూ. అనంతానికి గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్టయింది. వెంటనే వెలక్కాయ ఉమ్మేసి, గొంతు సవరించుకుని "సుజాత ఒక్కత్తే వెళ్లి చూస్తే ఇంకా ఎక్కువ ఎంజాయ్ చేస్తుందేమో, షాలినీ, మనిద్దరం విడిగా వెళదామా?" అన్నాడు.

అనంతం మాటలకు షాలిని ఓరగా చూస్తే, సుజాత మనోహరంగా నవ్వి, ... "ఓకే క్యారీ ఆన్, ఐ కెన్ అండర్‌స్టాండ్" అంది అతి ఉదారంగా.

అరగంటసేపు నడిచిన తర్వాత కూడా అనంతానికి విషయం ఎలా మొదలు పెట్టాలో తెలియలేదు. ఇటు షాలిని చూస్తే ఏమోమో ఊహించేసుకున్నట్టుగా ఉంది. దగ్గర, దగ్గరగా అంటిపెట్టుకుని నడవడానికి చూస్తోంది. అటు చూస్తే వంతెన దగ్గర పడుతోంది. ఇంట్రడక్షన్ లేకుండా రాంపండు నీట్లోకి ఉరికితే స్విమ్మింగ్ కోసమేమోనని షాలిని పొరబడే ప్రమాదం ఉంది. ఇక లాభం లేదని అనంతం గొంతు సవరించుకున్నాడు.

"షాలినీ, మా ఫ్రెండు ఒకడు... ఉన్నాడు. నువ్వంటే పడిఛస్తాడు..." అన్నాడో లేదో, షాలిని ఇంకో ఓరచూపు విసిరింది." అలాగా పాపం..." అని.

ఛస్తున్నాడని ఓ పక్క చెబుతూంటే ఇంత సరదాగా మాట్లాడడం అనంతానికి



నచ్చలేదు. డోసు చాల్లేదనుకున్నాడు. "అతని దృష్టిలో నువు నడిచే నేల ఓ పూదోట. నీ చూపు ఓ కన్నె కమ్మటి చూపు.... ఓ లతాంగి.... చూసే లాలిత్యపు చూపు. ఓ దేవత చూసే కారపు... కాదు... కాదు... కారుణ్యపు చూపు."

షాలిని కళ్లు పెద్దవయ్యాయి. ఆ కళ్లల్లో ఆరాధనాభావం ప్రవేశించింది. "అనంత్ నీ గురించి మీ అత్తయ్య చెప్పింది తప్పు. నీ కింత కవిత్వం వచ్చని ఆవిడ చెప్పనే లేదు. చూశావా....?" అంది ఫిర్యాదు చేస్తూ.

అనంత్ ఖంగారు పడ్డాడు. "ఇది నా కవిత్వం కాదు. ఆ ఫ్రెండుది" అని నిజాయితీగా చెప్పేశాడు.

వెంటనే షాలిని చిలిపిగా చూస్తు.... "మరి ఆ ఫ్రెండు నా ఎదుటబడి చెప్పడేం?" అంది బుంగమూతి పెట్టి.

"అతనికి భయం... బెరుకు... ఇప్పుడున్న అవకాశం కూడా చేజారిపోతుందన్న సంకోచం" అన్నాడు అనంతం

"చూశావా.... మళ్లీ కవిత్వం... ఈ మాటలు కూడా అతనివేనా?" అంది షాలిని పగలబడి నవ్వుతూ. 'సారం గంలో నుండి రైలు వెళ్లేటంత గట్టిగా నవ్విందిరా బాబూ ఈ శాండో' అనుకున్నాడు అనంత్. కాస్త దూరంలో వంతెన మీద ఫిషింగ్ చేస్తున్న బుజ్జిగాడూ అదే అనుకున్నాడేమో! వెనక్కి తిరిగి చూసి "అంతగట్టిగా నవ్వకక్కా.. చేపలన్నీ బెదిరి పారిపోతాయి" అన్నాడు విసుగ్గా.

అనంత్ అదృష్టం కొద్దీ షాలిని దృష్టి తమ్ముడి మీదకు మరలింది. "అయ్యో, వాడు అంచుమీద కూచున్నాడు. పడిపోతాడేమో" అని గాభరాపడింది.

వచ్చిన అవకాశాన్ని అనంత్ పోగొట్టుకోదలచుకోలేదు. "నువ్విక్కడే కూచో. నేను వెళ్లి మీ తమ్ముడికి చెప్పి వస్తాను" అన్నాడు.

వంతెన ఎక్కిన తర్వాత బుజ్జిగాడిని చేరుకోవడానికి పదడుగుల కంటె ఎక్కువ నడవనక్కరల్లేదు. కానీ అనంత్‌కి ఆ పది అడుగులూ పది మైళ్ళనిపించింది. ఒక మైలు నడిచాక చూస్తే, రెండో మైలు మరింతదూరం వెళ్లిపోయి నట్టనిపించింది. చిన్నప్పుడు స్కూల్లో వేసిన వేషం వేసిన నాటకం గుర్తుకు వచ్చింది. ఫ్రెండ్స్ బలవంతం మీద ఓ చిన్న వేషం కట్టాల్సి వచ్చింది. ఖాళీగా ఉన్న స్టేజి మీదకు నడిచివచ్చి ట్రేను టీపాయ్ మీద పెట్టాలి అంతే. రిహార్సల్స్‌లో గబగబా వాకింగ్ రేస్‌లోలా నడిచేయకు అని చెప్పడం వల్ల నెమ్మదిగా నడవడం ప్రాక్టీసు చేశాడు. నాటకం రోజున అది కొంప ముంచింది. ఆ స్టేజి ఓ పెద్ద.. ఎంతకీ తరగని ఎడారిలా... అనిపించింది. ప్రకృతి అంతా ఊపిరి స్తంభింపజేసి తననే గమనిస్తున్నట్లు అనిపించింది. నడుస్తున్న కొద్దీ టీపాయ్ మరింత దూరం వెళ్లిపోయినట్టనిపించింది.

ఇప్పుడు అదే ఫీలింగ్‌తో సతమతమవుతున్నా నడక ఆపకుండా ముందుకు సాగి, బుజ్జిగాణ్ని చేరుకోవడం. "హలో" అని పలకరించడం జరిగింది.

అక్కకు అనంత్ మీద ఉన్న ఇంట్రస్టులో పదోవంతు కూడా తమ్ముడికి లేనట్టుంది. వెనక్కి తిరక్కుండా, పలక్కుండా ఎడమ చెవి కాస్త ఆడించి ఊరుకున్నాడు. తనను ఇంత నిర్లక్ష్యం చేసిన కుర్రవెధవను రాంపండు ఎఫైర్ లేకపోయినా నీట్లో తోసేయడం తప్పు లేదనిపించింది అనంత్‌కి.

"హలో, ఫిషింగా?" అంటూ భుజం మీద చెయ్యి వేసాడు.

"ఏయ్... జాగ్రత్త, పడేశేట్టున్నావ్" అన్నాడు కుర్ర కాలజ్ఞాని.

మనసులో ఉద్దేశ్యం బయట పడిపోయాక ఇక అనంతానికి తప్పలేదు. 'నౌ ఆర్ నెవర్' అనుకుని కళ్లు మూసుకుని ఒక్క తోపు తోసేశాడు. భళ్లుమన్న శబ్దం, ఓ కేక వగైరా వినబడ్డాయి కానీ పొదల్లోంచి లేచి మనిషి పరిగెత్తిన శబ్దం వినబడలేదు.

అనంత్ కళ్లు తెరిచిచూసాడు. బుజ్జిగాడు నీటిపైకి తేలుతున్నాడు. "హెల్ప్" అని అరిచాడు అనంత్ పొదలను ఉద్దేశించి పొదలు కదల్లేదు.

"హెల్ప్‌రా బాబూ!" అని అసహనంగా పొదల్ని తిట్టాడు అనంత్.

అయినా పొదల్లో కదలిక లేదు. తన నటనా జీవితం తాలూకు జ్ఞాపకాలు అనంత్‌ని చుట్టుముట్టాయి. ఆ రోజూ అంతే. పనివాడి వేషంలో ట్రే టీపాయ్‌మీద పెట్టాక హీరోయిన్ వచ్చేదాక నిలబడాలి. కానీ ఆ మాయదారి హీరోయిన్ టైముకి రాలేదు. రిబ్బన్ మాచ్ కాలేదని గ్రీన్‌రూమ్‌లో పోట్లాట వేసుకుని కూచుంది. దర్శకత్వం వహిస్తున్న డ్రాయింగు మాష్టారు ఆమెను తిట్టి తీసుకొచ్చేదాకా అనంత్ అలాగే నిలబడిపోవలసి వచ్చింది - ప్రేక్షకుల అసహనపు దృక్కులు భరిస్తూ. 'కవులు రాసే కాలం స్తంభించడం' అంటే ఇదే గాబోలు' అనుకుంటూ చేతులు నులుముకుంటూ.

అంతలోనే అనుమానం వచ్చేసింది. "నాలుగంటలకల్లా ఏడు" అని తను అన్నదాంట్లో ఏడు మైండ్‌లో రిజిస్టరయిపోయి తోపుడు కార్యక్రమం ఏడు గంటలకి అనుకున్నాడా అని. కావచ్చు. ఇక ఆలోచించే టైము లేదు. ఇవతల బుజ్జిగాడు టపా కట్టేయచ్చు. వాడిలాటి వాడు భూమి మీద ఉండకపోతే సంతోషమే అయినా ఆ పని తన చేతుల మీదుగా జరగడం అనంత్‌కి ఇష్టం లేకపోయింది.

'తప్పదురా దేవుడా' అనుకుంటూ నీట్లోకి ఒక్క గెంతుగెంతాడు. పది సెకండ్లు దాటకుండా పైకి తేలాడు. కానీ చేతిలో బుజ్జిగాడి చొక్కా కాలరు లాటి పదార్థం, దాంట్లో బుజ్జి లేడు. అది సినిమాలలోనే జరుగుతుంది కాబోలు అనుకుంటూ కళ్లు తుడుచుకుని అటూ ఇటూ చూసేసరికి బుజ్జిగాడు పది గజాల దూరంలో గబగబా ఈదుకుంటూ పోతున్నాడు. 'రక్షించబడాలన్న కోరిక వాడికి లేకపోతే మనమేం చేస్తాం?' అనుకుని సర్దిచెప్పుకుని అనంత్ ఈసురో దేవుడాని ఈదుకుంటూ ఒడ్డుకి చేరేసరికి బుజ్జిగాడు తిట్టుకుంటూ వెళ్లిపోవడం జరిగింది.

గట్టున చేరిన అనంత్‌కి మళ్లీ సారంగంలో రైలు... ఈసారి



తూఫాన్‌మెయిల్... ప్రత్యక్షమయింది. షాలిని పొట్టచేత్తో పట్టుకుని పడిపడి నవ్వుతోంది. మధ్యమధ్యలో, "అబ్బ... అబ్బ.... ఏం ప్లానురా బాబూ" అనడం. మళ్లీ కాళ్ల నేలకేసి తంతూ నవ్వడం. ఆ శౌండో తాపులకు వంతెన పునాదులు కదిలిపోతాయేమోనని భయపడుతూనే "ఏం ప్లాను?" అని అడిగాడు అనంత్ బెదురుతూ.

"అబ్బ, చిలిపి. ఏమీ తెలియనట్టు... ఎలాగైనా నా ప్రేమ పొందుదామని.... పాపం బుజ్జిగాణ్ని నీట్లో తోసేసి... నేను చూశానులే... నువ్వు కళ్లు మూసుకుని... నా పేరే జపిస్తూ... తోసేశావ్. బుజ్జిగాడు స్విమ్మింగ్ ఎక్స్‌పర్ట్ కాబట్టి సరిపోయింది. మరొకరెవరైనా అయితే...? ఇది బాలేదు.... డియర్" అంది శాలిని దగ్గరికి చేరి.



తడిసిన బట్టల వల్ల కన్నా షాలిని వల్ల మరింత వణికాడు అనంత్. అయినా "భలేదానివి..." అన్నారు. వణుకు తెలియకుండా మేనేజ్‌చేస్తూ

"నేను కాదు నువ్వే భలేవాడివి. మనస్సులో ఉన్న ప్రేమ బయట పెట్టడానికి అంత డొంక తిరుగుడు ఎందుకు చెప్పు. మీ ఫ్రెండంటావ్... పైకి చెప్పడానికి బెరుకంటావ్. నన్ను ఇంప్రెస్ చేయడానికి తెలుగు సినిమా స్టయిల్ కాపాడ్డం సీనొకటా?... నువ్వు నాకు నచ్చావ్. ఇప్పుడే మీ అత్తయ్యగారికి ఫోన్ చేసి చెప్పేస్తా." అని అంటూనే బంగళా వైపు పరి గెత్తింది షాలిని.

నీళ్లోడుతున్న బట్టలతో కాళ్ళీడ్చుకుంటూ అనంత్ బంగళా వైపు వస్తూండగా రాంపండు గొంతు వినబడింది. - 'ఏ నిమిషానికి ఏమి జరుగునో' అనే పాట పాడుతూ, ఎక్కడున్నాడో కనబడక "ఒరేయ్ రాంపండూ" అని పిలిచాడు అనంత్. పక్కన ఎవరో ఉన్నట్టున్నారు. 'జస్ట్ ఎ మినిట్' అంటూ రాంపండు వచ్చిపడ్డాడు.

"గుడ్, సరిగ్గా నీకోసమే చూస్తున్నాను రా. భలే కనబడ్డావ్. ఒరేయ్, అనంతూ నీకో విషయం... విషయం ఏమిటిలే ... గొప్ప సంగతి చెప్పాలిరా" అన్నాడు రాంపండు పొంగిపోతూ.

"ఒరే సన్నాసీ, ఎక్కడ చచ్చావురా? ఏడు అంటే. ఏడవమని కానీ, ఏడుగంటలని కాదురా...."

రాంపండు కళ్లల్లో ఆశ్చర్యం. "అదా? ఆ పొదల సంగతా? అది వదిలేయ్. అదంతా కాన్సిల్. నీతో చెబుదామంటే నువ్వెక్కడా కనిపించలేదు".

"కాన్సిల్ ఏమిట్రా.... నీ శ్రాద్ధం? ఇవతల నేను నీట్లో మునిగి చచ్చి ఉంటే....

"ఒరే ఎంతసేపూ నీ గోలేనా... నా సంగతి వినిపించుకోవా? నేను ఆ పొదల దగ్గరకు వద్దామనే అనుకున్నానురా... బాబూ. మూడున్నరకే బయలుదేరాను కూడా. కానీ అంతలోనే ఓ అద్భుతం జరిగింది. ఒక అందాల దేవత. ఒక ప్రేమైకమూర్తి, చూపుల్లో తేనె, పలుకుల్లో పంచదార.... తొలి చూపులోనే ప్రేమ పుట్టిందంటే పుట్టదూ? ఎవరా అనుకున్నాను. షాలిని ఫ్రెండుట. పేరు సుజాత. జస్ట్ ఇప్పుడే ఊళ్లోకి అడుగు పెట్టింది. నా కంటబడింది. తనను తీసుకునే వాకింగ్‌కి బయలు దేరాను. పల్లెటూళ్లంటే ఇష్టంట. జానపద గేయాలు పాడి వినిపించమంది. నాకొచ్చిన సినిమా పాటలనే ఫోక్‌లోర్ పాటలుగా ఫిరాయిస్తున్నాను. ఆమెది ఒక చూపా? కాదు, కన్నెపిల్ల కమ్మని..."

"మరి షాలిని....?" అన్నాడు అనంత్ గొంతు ఆర్చుకుపోతూండగా.

"అదంతా ఓ గతం. పాసింగ్ ఫేజ్. ప్రేమ కాదురా అది. ఒట్టి వ్యామోహం. అది క్షణికం. ఇది ప్రేమ. శాశ్వతం. నన్ను పూర్తిగా చెప్పనీ... సుజాత చూపు కన్నెపిల్ల కమ్మని..."

అనంత్ వినలేదు. ఆగలేదు. భారమైన అడుగులు వేసుకుంటూ బంగళా వైపు సాగిపోయాడు.

(వచ్చే సారి కామ్రేడ్ రాంపండు)

(పి.జి.ఉడ్‌హౌస్ రాసిన 'ది ప్రైడ్ ఆఫ్ ఉస్టర్స్ ఈజ్ వూండెడ్', 'ది హీరోస్ రివార్డ్' కథల ఆధారంగా).

**- ఎమ్బీయస్ ప్రసాద్**



# అతని మరణం ఒక మిస్టరీ...!

## జనవరి 27 పాశ్చాత్య సంగీతంలో ధృవతార మొజార్ట్ జయంతి సందర్భంగా

కె.విశ్వనాథ్ తీసిన "స్వాతికిరణం" సినిమాలో తన కంటె ప్రజ్ఞావంతుడైన శిష్యుణ్ణి చూసి గురువు అసూయపడితే అది ఎటువంటి దుష్పరిణామాలకు దారితీస్తుందో చూపబడింది. మన వాతావరణంలో గురువును తండ్రిగా, దేవుడిగా భావిస్తాం కాబట్టి గురువు ఆ విధంగా ప్రవర్తించడం మన ప్రేక్షకులకు మింగుడు పడలేదు. అసలు అటువంటి గురువులు ఉంటారని ఊహించడం కూడా కష్టం మనకు. కానీ ప్రపంచ ప్రఖ్యాతి చెందిన సంగీతకారకుడు మొజార్ట్ (1756-91)) విషయంలో అటువంటిదే జరిగిందంటారు.

ఎవరీ మొజార్ట్? పాశ్చాత్య సంగీత ప్రపంచంలో ధృవతార అనదగినవాడు మొజార్ట్, ఇంకొక ప్రముఖుడు బీతోవెన్ ఇతని వారసుడే! 35 సంవత్సరాల అల్పాయుర్దాయంలోనే 626 కంపోజిషన్స్ (వాటిలో 50 సింఫనీలు, 19 ఒపేరాలు) చేసి, అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించిన మొజార్ట్ క్లాసికల్ వెస్టర్న్ మ్యూజిక్ అభిమానులెవరూ మరిచిపోలేని వ్యక్తి. ఆయన కంపోజ్ చేసిన మ్యూజికల్ పీసెస్ ఎన్నో ఇప్పటికీ ప్రజాదరణ పొందుతూనే ఉన్నాయి. మొజార్ట్ జన్మించిన సాల్జ్‌బర్గ్ (ఆస్ట్రియా దేశం)లో అతని పేర ప్రతీ ఏటా వారం రోజుల పాటు సంగీతోత్సవాలు జరుపుతారు. అతను పుట్టిన ఇంటిని నేషనల్ మ్యూజియంగా మార్చారు. సిటీలో ముఖ్యమైన సెంటర్‌కు మొజార్ట్ స్క్వేర్ అని పేరు పెట్టారు.



మొజార్ట్ ఆరేళ్ళకే ప్రాడిజీ అనిపించుకున్నాడు. ఆ వయస్సులో వయొలిన్, ఆర్గన్, క్లావియర్ ఉపయోగించి అతను చేసిన 5 పియానో పీసెస్ ఇప్పటికి కూడా ప్రాచుర్యంలో ఉన్నాయి. అతని తండ్రి లియోపోల్డ్ మొజార్ట్ సాల్జ్‌బర్గ్ ఆస్థానంలో కంపోజర్. తండ్రి వద్ద తొలివిద్య అభ్యసించిన మొజార్ట్ తండ్రితో బాటు యూరోప్ అంతా తిరిగి ఆయన కచ్చేరీలలో పాల్గొనేవాడు. 13వ యేట అతన్ని సాల్జ్‌బర్గ్ ఆస్థానంలో కన్సర్ట్ మాస్టర్‌గా ఉద్యోగం వరించింది. ఇటలీలోని మిలాన్‌లో పోప్ చేతుల మీదుగా ఇటలీలో షెవలియార్ అనే బిరుదుతో గౌరవం, ఒక ఒపేరా రాసే పని అతనికి దక్కాయి. 14 యేళ్ళ వయస్సులో అత్యద్భుతంగా ఆ ఒపేరాను తయారు చేసినందుకు అతనికి అఖండ సన్మానం జరిగింది. అప్పుడే మొజార్ట్ స్వంత ఊరికి తిరిగిరావడం, అలంకరంగా పదవి లభించినా ధనం దొరక్క భంగపడి వెళ్ళిపోవడం జరిగాయి.

యూరోప్ రాజాస్థానాలు ఈ 21 ఏళ్ళ సంగీతజ్ఞుణ్ణి నిరాదరించాయి. మంచి ఉద్యోగం కోసం వెతుకుతూనే అలోసియా వెబర్ అనే అమ్మాయి ప్రేమలో పడ్డాడు. తండ్రి ఇష్టానికి వ్యతిరేకంగా తండ్రిని కాదనలేక ప్రేమను చంపుకున్నాడు. చివరికి ఐదేళ్ళ తర్వాత అలోసియా చెల్లెలు కాన్‌స్టేంజ్‌ను పెళ్ళాడాడు. ఈ లోపల రాజుల మన్ననలు పొందడాలు, రాజాస్థానాల కుట్రలతో విసిగి బయటకు నడవడాలూ కూడా జరిగింది. ఆరోగ్యం దెబ్బతింది. దారిద్ర్యం చుట్టుముట్టింది. అతని ఒపేరాలు ప్రదర్శించినవారు పారితోషికం ఇచ్చేవారు కారు. "ది మాజిక్ ఫ్లూట్" అనే మ్యూజికల్ పీస్ తయారుచేస్తూండగా ఒక అజ్ఞాత వ్యక్తి అతని వద్దకు వచ్చి ఒక 'రిక్వెమ్' తనకై చేసిపెట్టమని అడిగేడు. దాన్ని 'న భూతో న భవిష్యతి' స్థాయిలో చేసే ప్రయత్నం అంతంతమాత్రంగా ఉన్న అతని ఆరోగ్యాన్ని పూర్తిగా దెబ్బ తీసింది. డిసెంబరు 5, 1791 న మొజార్ట్ టైఫాయిడ్‌తో మరణించాడని అధికారికంగా ప్రకటించినా అతని చావుకు సెలియేరీయే కారకుడని పుకార్లు వచ్చాయి.

మొజార్ట్‌కు ఏన్టోనియో సెలియేరీతో పరిచయం ఏర్పడింది రాజాస్థానాలలోనే! సెలియేరీ కూడా మంచి పండితుడు. ప్రజ్ఞాశాలి. వీటితో బాటు రాజదర్బారులలో ఎలా ప్రాపు సంపాదించాలో, ఎలా నిలబెట్టుకోవాలో తెలిసినవాడు. వియన్నా రాజాస్థానంలో ఆస్థాన సంగీతకర్తగా ఉన్నాడు. తనకన్నా చిన్నవాడు, ఓ పల్లెటూరి కుర్రాడు అయిన మొజార్ట్ అంత ఖ్యాతి గడించడం సహించలేకపోయాడు. రాజును మభ్యపెట్టి, కుట్రచేసి, దరిచేరిన ఈ యువకళాకారుణ్ణి మట్టుబెట్టాడు. మొజార్ట్‌ని ఎవరూ పట్టించుకోకుండా చేయగలిగాడు. చివరికి అతని సమాధి ఎక్కడుందో కూడా తెలియనంత దిక్కుమాలిన చావు దాపురించింది మొజార్ట్‌కి.

మొజార్ట్, సెలియేరీల వైరం ఆధారంగా రష్యన్ కంపోజర్ నికొలాయ్ కొర్సాకోవ్ 1898లో "మొజార్ట్ ఎట్ సెలియేరీ" అనే ఒపేరాను కూర్చాడు. దానిని అలెగ్జాండర్ పుష్కిన్ రష్యన్ డ్రామాగా మలిస్తే. బ్రిటిష్ నాటకకర్త పీటర్ షాఫర్ ఆంగ్లనాటకంగా తయారుచేసాడు. దాని పేరు "ఎమెడియస్" (మొజార్ట్ పూర్తి పేరు ఉల్ఫ్‌గాంగ్ ఎమెడియస్ మొజార్ట్) అదే పేరుతో 1984లో ఒక ఇంగ్లీషు సినిమా తయారయి అనేక ఆస్కార్ అవార్డులు గెలుచుకుంది. దాని ప్రకారం మొజార్ట్‌కి చివరి రోజుల్లో రిక్వెమ్ తయారుచేసిన పని అప్పగించినది మారువేషంలో ఉన్న సెలియేరీనే! ఎంతో ప్రతిభ గల ఒక జూనియర్‌ను అసూయతో మట్టిపాలు చేసిన అపరాధ భావన అతన్ని తొలిచివేయగా మతిభ్రష్టుడవుతాడు. 30 ఏళ్ళనాటి తన కథను ఫ్లాష్‌బ్యాక్‌లో చెబుతాడు. ఇక్కడ మనకు "స్వాతికిరణం" గుర్తుకువస్తుంది.

కల్పనల మాట అలావుంచితే మొజార్ట్ చావుకి అసలు కారణం ఏమిటి అన్న ప్రశ్న సంగీత ప్రియులను ఇంకా వేటాడుతూనే ఉంది. అతను మరణించగానే మొట్టమొదట వచ్చిన పుకారు - సెలియేరీ స్లోపాయిజినింగ్ ద్వారా మొజార్ట్‌ని చంపేశాడని! ఈ పుకార్లకు కారణం మొజార్ట్ భార్య అంటారు. దుర్భరదారిద్ర్యంలో మగ్గుతున్న ఆమె మొజార్ట్ మరణానంతరం వెల్లువెత్తిన సానుభూతిని సొమ్ము చేసుకోవడానికి ప్రయత్నించింది. ఆమె, ఆమె రెండో భర్త నికొలస్ నిస్సెన్ కలిసి మొజార్ట్ స్మృతులలో ఒక పుస్తకాన్ని వెలువరించారు. దాంట్లో ఇలాటి పుకార్లకు అవకాశాన్నిచ్చారు. 1823లో, అంటే మొజార్ట్ మరణించిన 32 ఏళ్ళకు, సెలియేరీ పియానిస్టు మోషెలెస్‌కి ఇంటర్వ్యూ ఇస్తూ - తను మొజార్ట్‌కి విషప్రయోగం చేయలేదని స్పష్టం చేశాడు. గత సంవత్సరం వెలువడిన కొత్త పరిశోధనల ప్రకారం మొజార్ట్ చావుకి అసలు కారణం, విషపూరితమైన కుక్కగొడుగులు తినడమేనట!

ఈ వాస్తవాలు ఎలా ఉన్నా, ఇద్దరు ప్రజ్ఞావంతుల మధ్య స్పర్ధ కాల్పనిక కథలకు, సినిమాలకు మంచి ముడిసరుకు అని మరొక్కమారు ఋజువు కాబోతోంది. ప్రస్తుతం నిర్మాణంలో ఉన్న "సుర్" హిందీ సినిమాలో గురువు, శిష్యురాలి పట్ల అసూయతో కీడు తలపెడతాడు. తనూజచంద్ర డైరక్షన్‌లో లక్కీ ఆలీ ఈ పాత్రను ఎలా పోషిస్తాడో చూడాలి!

-కమ్యూనికేటర్ ఫీచర్స్




అభిరుచికి అద్దం పడుతూ కొత్తందాలతో తియ్యందనాలు అద్దుకుంటూ శిఖరాయమాన ప్రమాణాలను అందుకునే పాటలను అందించే స్థాయిగల భరణీ సంస నిర్మించిన చిత్రం

# విప్రనారాయణ

ఈ చిత్రం లోని సంగీతం - తెలుగువారంతా మరోసారి గర్వంతో తలెత్తుకోదగ్గదీ, తలకెత్తుకోదగ్గదీనూ! స్వరాల నరాలలో రాగ చైతన్యాన్ని కలిగించే యస్.రాజేశ్వరరావు ఈ చిత్రంతో 'రాగేశ్వరరావు'గా తన ముద్రను మరింత పటిష్టం చేసుకోగలిగారు. 'విప్రనారాయణ' చిత్రానికి ఆయన సమకూర్చిన ఆణిముత్యాల వంటి పాటలలో ఓ నాలుగింటి గురించి:

చూడుమదే చెలియా కనులా ॥చూడు॥
బృందావనిలో నందకిశోరుడు ॥బృందా॥
అందముగా దీపించే లీలా ॥చూడు॥
మురళీకృష్ణుని మోహనగీతికి ॥మురళీ॥
పరవశమైనవి లోకములే ॥పరవశ॥
విరబూసినవి పొన్నలు పొగడలు ॥విర॥
పరిమళమెగసెను మలయానిలయముల
సోలెను యమునా ॥చూడు॥
నారీ నారీ నడుమ మురారీ ॥నారీ॥
హరికి హరికి నడుమ వయ్యారీ ॥హరి॥
తానొకడైనా... ఆ....
తానొకడైనా తలకొకరూపై ॥తానొక॥
మనసులు దోచె రాధామాధవ
కేళీ నటనా.... ॥చూడు॥



అక్కినేని నాగేశ్వరరావు, భానుమతి అభినయించిన ఈ పాటను సముద్రాల రాఘవాచార్య రచించారు. ఎ.ఎమ్.రాజా ఆలపించారు. అంతవరకూ ఘంటసాల గళంతో ముడిపడ్డ అక్కినేని అభినయానికి ఎ.ఎమ్.రాజా స్వరాన్ని జత చేయటం అప్పట్లో సాహసమే అయినా, 'చూడుమదే చెలియా' పాటకు లభించిన ఆదరణ - అటు ఎ.ఎమ్.రాజా సుతిమెత్తని స్వరసౌందర్యాన్ని, ఇటు సంగీత దర్శకునిగా రాజేశ్వరరావు సామర్థ్యాన్ని తెలుగు వారికి తేటతెల్లం చేసింది.

ఇక సాహిత్యపరంగా చెప్పుకోవాలంటే-పామరుడి నోట కూడా పలికే విధంగా 'నారీ నారీ నడుమ మురారీ/హరికీ హరికీ నడుమ వయ్యారీ/తానొకడైనా తలకొక రూపై' అంటూ శ్రీకృష్ణుని శృంగార లీలా విలాసాలను అతి క్లుప్తంగాను, అతి గుప్తంగాను అందించిన సముద్రాల వారి సాహితీ ఆధ్యాత్మిక సంయమనానికి - నైతిక విలువలకు ప్రాధాన్యతనిచ్చే ప్రతి మనస్సు నమస్సులర్పిస్తూనే వుంటుంది. ఇక్కడ చిత్రీకరణ పరంగా కూడా కొంత చెప్పాలి. ఈ సన్నివేశ సమయానికి విప్రనారాయణుడిలో శృంగార భావాలకు సంబంధించిన చిత్తచాంచల్యం మొదలు కాదు. అతనికి దేవదేవిలో కూడా కృష్ణుడే కనిపిస్తూ ఉంటాడు. ఈ భావాన్ని ప్రేక్షకుని మదిలో ఖచ్చితంగా నాటుకునేలా భానుమతిని శ్రీకృష్ణుని గెటప్‌లో 'నారీ నారీ నడుమ మురారీ' చరణానికి ముందు చూపిస్తారు. ఆ సన్నివేశ అంతరార్థాన్ని తన సాహిత్యంతో తెలిపిన సముద్రాల వారిని, చిత్రీకరణలో తేటతెల్లం చేసిన దర్శకుడు పి.రామకృష్ణని కృతజ్ఞతున్నవాడెవడూ మెచ్చుకోకుండా ఉండలేడు. ఇటువంటి సన్నివేశాలలో ప్రేక్షకుని బలహీనతలను సొమ్ము చేసుకోకుండా-తెలిసినదేదో చెప్పి వీలైనంత వరకూ వారిని మరింత ఉన్నతులుగా చేయాలనుకునే వారి సంస్కారానికి జోహార్లు అర్పించకుండా

ఉండలేము.

ఈ పాట గురించిన ఒక ఉదంతం - 'నారీ నారీ నడుమ మురారి' అనే భావన ప్రముఖ రచయిత, అనువాదకుడు మద్దిపట్లసూరి గారికి బాగా నచ్చిందిట. ఈ సినిమాకు సముద్రాల గారితో కలిసి పనిచేసిన మల్లాది రామకృష్ణశాస్త్రి గారితో 'చాలా బాగా రాసారండీ' అని మెచ్చుకోబోతే ఆయన "మాదేముంది, లీలాశుకుడు శ్రీకృష్ణకర్ణామృతం లో చెప్పిన భావమే కదా తెలుగులో చెప్పాం" - అంటూ ఆ శ్లోకాన్ని పాడి వినిపించారట -

"అంగనా అంగనా మన్తరే మాధవో, మాధవం మాధవం చాన్తరే ణాంగనా
ఇత్థ మాకల్పితే మండలే మధ్యగః, సంగౌ వేణునా దేవకీనందనః ॥"

(తా॥ ఒక్కొక్క స్త్రీకిని నడుమ తానును తన రెండు రూపుల నడుమ ఒక్కొక్క స్త్రీయునుగా వృత్తాకార మండలముగా తీర్చి మధ్య తాను వేరొకడై నిలచి దేవకీ నందనుడు శ్రీకృష్ణుడు చక్కగా వేణుగానం చేసెను.)

ఇక సంగీతపరంగా చెప్పాలంటే - హిందోళ రాగంలో ఎన్ని సినీ గీతాలు వచ్చినా సరే ఎప్పటికప్పుడు కొత్త సొగసులతో అందిస్తున్నారు మన సంగీత దర్శకులు. పరిధులు ఎంత తక్కువగా వున్నా, పరిమితులు ఎంత ఎక్కువగా వున్నా ఆ రాగానికి వున్న శక్తి ఎంతటిదో ఈ పాట ద్వారా మరోసారి నిరూపించారు యస్.రాజేశ్వరరావు. ముఖ్యంగా 'నారీ నారీ నడుమ మురారీ' చరణానికి ముందు యింటర్లూడ్‌లా వినిపించే వాద్య సంగీతాన్ని రాజేశ్వరరావు పరంగానూ, ఆ చరణం ఎత్తుకుంటున్నప్పుడు మంద్రస్థాయిలో మన చెవికి సోకే గళ మాధుర్యాన్ని ఎ.ఎమ్.రాజా పరంగానూ ఒకసారి వింటే మరిచిపోలేం.

ఎందుకోయీ తోటమాలి
అంతులేని యాతనా ॥ఎందు॥
ఇందుకేనా నీవు చేసే
పూజలన్నీ తపోధనా ॥ఇందు॥ ॥ఎందు॥
వన్నెవన్నె చిన్నెలీను ఈ విలాసం ॥వన్నె॥
చందమామ చిన్నబోవు ఈ ప్రకాశం
నిన్నేలు వానీ లీలలేరా ॥నిన్నేలు॥
కన్నారా కనరా ఏలుకోరా ॥కన్నారా॥
ఓ... ఓ... ఓ... ఓ ॥ఎందు॥
అందరానీ విందుపైనా ఆశలేలా ॥అంద॥
పొందుకోరు చిన్నదానీ పొందవేలా
అందాల రాయా, అందరార ॥అందా॥
ఆనందమిదియే అందుకోరా ॥ఆనందా॥
ఓ... ఓ... ఓ... ఓ ॥ఎందు॥



ఈ పాటను సముద్రాల రాఘవాచార్య రచించగా భానుమతి ఆలపించగా అక్కినేని, భానుమతి అభినయించారు.

'ఎందుకోయి తోటమాలి' విషయానికొస్తే.... వాహినీ వారి 'స్వర్గసీమ' సినిమాలోని 'ఓహోహో పావురమా' పాట తరువాత రకరకాల పోకడలతో, విన్యాసాలతో మలచబడ్డ పాటగా ఈపాటను చెప్పుకోవాలి. అరబిక్, పర్షియన్ సంగీతంలో ఒక రకమైన వశీకరణ శక్తి వుంటుంది. ఆ ఆకర్షణను ఛాయామాత్రంగా స్పృశిస్తూ, ఆ స్వభావాన్ని అందించడానికి 'కీరవాణి' రాగాన్ని ఎన్నుకోవటంలోనే రాజేశ్వరరావు గారి ప్రజ్ఞ తెలుస్తుంది. పైగా పాడింది 'భానుమతి కనుక ఆ గమకాలు, ఆ సంగతులు అతి అందంగా అతికిపోయాయి ఆ కంఠానికి. అందుకే ఆ రోజుల్లో కొందరనేవారు 'భానుమతి గళంలో అద్భుతంగా పలుకుతాయి - గమకాలూ, సంగతులూ.... అదే మిగతా కంఠాలకిస్తే యిక అంతే సంగతులు' అని.

విరహే.... తవ.... దీనా.....
సా విరహే తవ దీనా రాధా
సా విరహే తవ దీనా... రాధా
సా విరహే తవ దీనా రాధా
సా విరహే తవ దీనా రాధా
సా విరహే తవ దీనా.....
నిందతి చందన మిందు కిరణమను
విందతి ఖేదమధీరమ్
వ్యాళనిలయమిళ నేన గరళమివ ॥వ్యాళ॥
కలయతి మలయ సమీరం ॥సా విరహే॥

కుసుమ విశిఖర తల్పమనల్ప
విలాసకళా కమనీయమ్
వ్రతమివ తవపరి రంభసుఖాయ ॥వ్రతమివ॥
కరోతి కుసుమ శయనీయం ॥సా విరహే॥
ప్రతిపదమిదమపి నిగదతి మాధవ
నిగదతి మాధవ నిగదతి మాధవ
తవ చరణే పతి తాహం
త్వయివిముఖేమయి
సపది సుధానిధి
రపితనుతే తనుదాహం ॥సా విరహే॥
కృష్ణా... తవ విరహే... దీనా...



ఈ పాటను భానుమతి ఆలపించగా అక్కినేని నాగేశ్వరరావు, భానుమతిపై చిత్రీకరించారు. 12వ శతాబ్దానికి చెందిన జయదేవ మహాకవి రాసిన గీతగోవిందంలోని ఈ అష్టపదికి యస్.రాజేశ్వరరావు చేసిన స్వరకల్పన ఆయన సంగీత జైత్రయాత్రలో ఓ మధురమైన మజిలీగా చెప్పుకోక

తప్పదు. 'విప్రనారాయణ' చిత్రం విడుదలకు ముందు యీ గీతాన్ని తెలుగువారు ఎలా గుర్తుంచుకునే వారో ఏమో గానీ తరువాత నుంచీ ఎప్పుడు ఎవరు వుదహరించవలసి వచ్చినా రాజేశ్వరరావు చేసిన వరసను ఆశ్రయించడం తప్ప గత్యంతరం లేదనే అనిపిస్తుంది. యమన్ కళ్యాణి రాగంలో రాజేశ్వరరావు చేసిన పాటలన్నీ ఆ రాగంలోని సారాన్నంతా ఎప్పటికప్పుడు తేనెలూరుతూ అందిస్తూనే వున్నాయి. ఆ పాటల వరుసలో అగ్రస్థానంలో వుంచదగ్గ గీతమిది. ఈ పాటల్లో ఫ్లూట్‌ని, హవాయిన్ గిటార్ని ఆయన వుపయోగించిన తీరు ఆ రాగం పైనా, ఆయా వాద్యాల పైనా ఆయనకున్న పట్టుని పట్టిస్తాయి. ముఖ్యంగా 'తవ చరణేపతి తాహం' అనే పాదం తరువాత వచ్చే ఫ్లూట్ బిట్, చరణాల మధ్యలో వచ్చే యింటర్ల్యూడ్‌లతో పాటు గీతానికి ఆద్యంతమే కాక ఆది అంతాలలో కూడా వినిపించే హవాయిన్ గిటార్ బిట్లు - యివన్నీ మధుర లోకాలకు తీసుకుపోయే మెట్లు.

ఇక యీ పాటను భానుమతి పాడిన తీరు అన్యులకు అసాధ్యమనే అనిపిస్తుంది. వేరొకరి గళంలో యీ పాటని వింటే భానుమతిపై గౌరవం ఇంకా యినుమడిస్తుంది. ఏకంగా భానుమతి పాడిన పాటనే గనుక వింటే అంతటి గొప్ప జిలుగులను అందించగల కంఠం ఆమెకున్నందుకు, వాటిని అందుకోగల చెవి మనకున్నందుకు ముచ్చటేస్తుంది. పాటకు ముందునా, చివర్నా వచ్చే 'తవ విరహే దీనా' దగ్గర 'దీ...నా'.. అంటూ ఆమె తన స్వరం ద్వారా చూపిన 'అప్స్ అండ్ డౌన్స్' నభూతోఅని చెప్పక తప్పదు.

అతడు : మధుర మధురమీ చల్లని రేయి
ఆమె : మరువతగనిదీ ఈ హాయీ ॥మధుర॥
అతడు : నవ్వుల వెన్నెల నాలో వలపుల ॥నవ్వుల॥
ఆమె : స్వాముల సోయగమెంచీ
పులకించునదేమో రే రాణి ॥మధుర॥
అతడు : విరికన్నెలు అరవిరిసిన కన్నుల
దరహాసించునో దేవీ
ఆమె : మన అనురాగము చూసీ..... ॥విరికన్నెలు॥
చిరునవ్వులు చిలుకును స్వామీ ॥మధుర॥
నీ వరమున నా జీవనమే
పావనమాయెను స్వామీ ॥నీ వరమున॥
అతడు : ఈ వనసీమయె నీ చెలిమీ.... ॥ఈ వన॥
జీవన మాధురి చవిచూపినదే ॥మధుర॥

ఇది పూర్తిగా యస్.రాజేశ్వరరావు పాట, మోహనరాగం ఆయన చేతిలో ఎంత సమ్మోహనంగా రూపుదిద్దుకుంటుందో నిరూపించే పాట. ఈ పాటలో కూడా హవాయిన్ గిటార్ని ఆయన వాడుకున్న తీరుకి మన మనసులు పులకించిపోతాయి. ఏదైనా ఒక వాద్యంతో అంతోయింతో ప్రవేశం వున్న వారికి యీ హవాయిన్ గిటార్ని కూడా నేర్చేసుకుంటే బావుండుననేటంత ఆకర్షణీయంగా ఈ పాటలోని యింటర్ల్యూడ్‌లను మలచారాయన. మోహన రాగంలో అతి తక్కువ సినీ గీతాలను పాడిన భానుమతి స్వరజీవితంలో చిరస్థాయిగా నిలిచిపోయిన పాట కూడా యిదే. ముఖ్యంగా మన అనురాగము చూసీ దగ్గర - దగ్గర గమకాలతో ఆవిడ తీసిన ఆలాపన - మోహన రాగంలో విన్యాసాలను చేయాలనుకునే వారికి స్వంతంగా స్వరపరీక్ష చేసుకునేందుకు ఉపయోగపడే ఓ గీటురాయి. ఇక సహ గాయకుడిగా ఏ.ఎమ్.రాజా కాంట్రిబ్యూషన్ కూడా తక్కువదేం కాదు. మంచి పాటకు చెవియొగ్గి వినేవారి హృదయాలలో శాశ్వత పీఠాన్ని వేసుకోదగ్గ అర్హతలన్నీ వున్న పాట యిది. ఈ పాటను తెరపై అక్కినేని నాగేశ్వరరావు, భానుమతి అభినయించారు.

కేవలం పాటల పరంగానే కాకుండా తదితర విలువల పరంగా కూడా చక్కని ప్రమాణాలను కన్వరచిన ఈ విప్రనారాయణ చిత్రం రాష్ట్రపతి ప్రశంసలను అందుకుని జాతీయ స్థాయిలో మన తెలుగు వారికి మంచి గుర్తింపుని తెచ్చి పెట్టింది.

ఈ సినిమాకి సంబంధించిన ఓ ఉపకథ వుంది. ప్రముఖ దర్శకుడు, రచయిత కీ.శే. జంధ్యాల ఈ చిత్రాన్ని చూసి ప్రభావితులైన వారిలో ఒకరు. అప్పుడాయనకి మూడేళ్ళుంటాయేమో! సినిమా చూసినప్పట్నించి విప్రనారాయణుడిని చూడాలనివుందనేవారు. ఒకసారి అక్కినేని నాగేశ్వరరావు ఏదో పనిమీద విజయవాడకు రావటం జరిగింది. అది తెలుసుకున్న జంధ్యాల బంధువులు ఆయన్ని అక్కినేని దగ్గరకు తీసుకువెళ్ళి "ఇదిగోరా నీ



విప్రనారాయణుడు" అంటూ చూపించారు. అక్కినేని అప్పుడు పాంటు, షర్ట్‌లో వున్నారు. జంధ్యాల మనసులో భక్తుడి గెటప్‌లో ఆయన రూపం ముద్రపడిపోయి ఉండటం వలన "అరె... నామాలేవీ....!" అంటూ ఆశ్చర్యపోయారు. పవిత్రమైన ఆ అమాయకత్వానికి ముచ్చటేసింది అక్కినేనికి. వెంటనే జంధ్యాలను ఎత్తుకుని వొళ్ళో కూర్చోపెట్టుకున్నారు. చాలా సేపటివరకూ దింపలేదు కూడా. "మీ కిబ్బందిగా వుందేమో" అని పక్కనున్న వాళ్ళు మొహమాటపడుతున్నా "ఫరవాలేదండీ" అంటూ వొదల్లేదు జంధ్యాలని. అదే జంధ్యాల భవిష్యత్తులో దర్శకుడౌతాడని, అక్కినేనితోనే ఓ సినిమాని



తీస్తారని ఎవ్వరూ అనుకోలేదు అప్పటికి. అదే జీవితచిత్రం. ఆనాటి ఆ తీపి గురుతుని తన మనసులో భద్రంగా దాచుకున్నారు జంధ్యాల. తను దర్శకుడిగా మారిన తరువాత 'అమరజీవి' అనే చిత్రాన్ని అక్కినేనితో తీసినప్పుడు అందులో విప్రనారాయణుని కథను ఓ సంగీత రూపకంగా మలచి ఆనాడు తన మనసులో ముద్ర పడిపోయిన ఆ వేషధారణలో అక్కినేనిని మరోసారి చూసుకున్నారాయన. 'అసుర సంధ్య వేళ యిది' అంటూ ప్రారంభమయ్యే ఆ సంగీతంరూపకంలో అక్కినేనితో దేవదేవి పాత్రలో నటించినది జయప్రద.




రమణ సినిమాలలోకి వచ్చేముందు ఆంధ్ర పత్రికలో సినిమా పేజీలకు ఇన్‌ఛార్జిగా ఉండేవారు. ఆయన రాసిన చిత్రసమీక్షల గురించి చాలా మంది తెలిసే ఉంటుంది. సమీక్ష రాయడంలో ఆయన ఒక విలక్షణమైన మార్గాన్ని మొదలుపెట్టారు. అటు చిత్ర నిర్మాతల పట్ల, ఇటు పాఠకుల పట్ల బాధ్యతను సమానంగా నిర్వర్తించారు. సమీక్షలు రాయడంతో బాటు సినిమారంగంలోని వ్యక్తులపై, సాంకేతిక అంశాలపై వ్యాసాలు రాసారు. విదేశీ చిత్రాల కథలు మన కర్థమయ్యేలా సింపుల్‌గా రాయడం, సినిమాలలో కనబడే అవకతవకలను ఎత్తిచూపుతూ హాస్యశీర్షికలు నడపడం- ఇలా బహుముఖాలుగా సినీరంగానికి సేవచేశారు. రమణ ఆ రోజుల్లో రాసినవి చూస్తే వారి నుండి ఎంతో నేర్చుకోవలసి ఉందని అనిపిస్తుంది. అర్థశతాబ్ది క్రితం ఈ నాడు అందుబాటులో ఉన్న సమాచార సాధనాలు లేవు కదా! అయినా రమణ వ్యాసాలు ఎంతో సమగ్రంగా, ఆథెంటిక్ గా ఉన్నాయంటే వాటి వెనుక ఆయన కృషిని, చిత్తశుద్ధిని గమనించాలి. రమణను ఒక ఫిక్షన్ రైటరుగా మాత్రమే గుర్తించేవారు ఆయనలో ఉన్న ఒక పెర్‌ఫెక్ట్, టాప్ ర్యాంకింగ్ జర్నలిస్టుని గమనించలేదనే అనాలి.

తెలుగునాట కూడా విజయదుందుభి మ్రోగించిన చిత్రరాజం - "టెన్ కమాండ్‌మెంట్స్", ఆ సినిమా చూడని వాళ్లెవరైనాఉన్నా నేరెళ్ల వేణుమాధవ్ దాని బాక్‌గ్రౌండ్ మ్యూజిక్ అనుకరించగా విని ఉంటారు. ఆ చిత్ర దర్శక నిర్మాత సిసిల్.బి.డిమిల్. హాలీవుడ్ వ్యవస్థాపకుడు. బాపు మాటల్లో చెప్పాలంటే, 'హడిలి చచ్చేట్లా సినిమాలు తీయగల ఘనుడు'. 1958 ఆగస్టులో రమణ ఆయన ఘనత తెలుపుతూ ఆంధ్రపత్రిక వీక్లీలో ఓ వ్యాసం రాసారు. ఆయన ఎంత ఆత్మీయంగా రాసారంటే, తెలియని వాతావరణం తాలూకు మనుష్యుల గురించి చదువుతున్నామన్న భావనే రాదు పాఠకుడికి. 1959 జనవరి 21 న డిమిల్ మరణించినప్పుడు రమణ నివాళి అర్పిస్తూ మరొక వ్యాసం రాసారు. **డిమిల్ వర్ధంతి సందర్భంగా** ఆ రెండు వ్యాసాలు కలిపి తయారు చేసిన రచన ఇది-



శాంసన్ అండ్ డిలైలా (1949) చిత్రంలో ఒక భారీదృశ్యం





టెన్‌కమాండ్‌మెంట్స్ (1956)లో మోజెస్‌గా చార్లటన్ హెస్టన్, రామ్‌సెస్‌గా యూల్‌బ్రిన్నర్

# మిస్టర్ హాలీవుడ్ - సిసిల్ బి డిమిల్

చలనచిత్ర చరిత్రలో నిలబడి, పదికాలాలపాటు వినబడే పేరు గలవాడు, తోటివారు, మేటివారు సగౌరవంగా చెప్పుకోవలసిన పేరుగలవాడూ, అమెరికన్ చలనచిత్ర పరిశ్రమ సాంకేతిక పారిశ్రామిక ప్రగతికి దోహదకారుడు, బ్రహ్మాండమైనవనతగ్గ చలనచిత్రాల నిర్మాణ కథకు నాయకుడూ అయిన సిసిల్ బ్లౌంట్ డిమిల్ హఠాన్మరణం (1959 జనవరి 21) దేశదేశాల చలనచిత్ర అభిమానులకు విచారం కలిగించింది. మరణకాలం నాటికి 77 ఏళ్ల వయోవృద్ధులైనా, ఆయన జవసత్వాలను, ఆయన వేసుకున్న పథకాలను కన్నవారికే గాక విన్నవారికి కూడా వారిది అకాలమృత్యువు అనిపించింది.

హాలీవుడ్ ప్రొడ్యూసర్లకు గల ఆర్భాటం అనండి, మరి ఏమైనా అనండి - చుట్టపీకలు నమలడం, హంగామా చేయడం మొదలయిన లక్షణాలు డిమిల్‌లో లేకపోవటం చేత ఆయనను "మిస్టర్ హాలీవుడ్" అని పిలవటం కొంచెం చిత్రంగానే కనిపిస్తుంది, హాలీవుడ్ ఆవిర్భావం చరిత్ర తెలియనివారికి -

హాలీవుడ్ ప్రొడ్యూసర్లకు గల వికారాలు అనండి మరి ఏమైనా అనండి - చుట్టపీకలు నమలటం, హంగామా చేయడం మొదలయిన లక్షణాలు డిమిల్‌లో లేకపోవడం చేత ఆయనను 'మిస్టర్ హాలీవుడ్' అని పిలవడం కొంచెం చిత్రంగానే కనిపిస్తుంది, హాలీవుడ్ ఆవిర్భావం చరిత్ర తెలియనివారికి -

1913 - కన్నుల విందనతగ్గ ప్రకృతి దృశ్యాలు, పుష్కలంగా సూర్యకాంతి లేకపోతే కథ నడవదని, ఫిల్ము తీసి చూడలేమనీ అంగీకరించవలసిన రోజులు. ఫిల్ముతీస్తే తీసినా, చూడగలమని నమ్మకం లేదు. అందువల్ల 'స్క్వామాన్' చిత్రం నిర్మాణబృందం 'గో వెస్ట్' అనుకుని రైలెక్కి పడమటి దిశగా బయల్దేరారు. ఎండ, అందమైన కొండలూ అడవులూ

మెండుగా ఉండగల చోటు వెతుకుతూ! వెళ్లి వెళ్లి అరిజోనా రాష్ట్రంలో ఫ్లాగ్‌స్టాఫ్ పట్నం దగ్గిర దిగారు. తీరా చూస్తే ఎండ ఏమాత్రం మెండుగా లేదు. ఆ మాటకొస్తే హోరున వాన కురుస్తోంది. ప్రకృతి దృశ్యాలు కూడా, కామెరా కంటికి యింపుగా లేవు. దండుగ అయితే అయిందని, ఆ బృందం నాయకుడు సిసిల్ బ్లొంట్ డిమిల్ మళ్లీ రైలెక్కమన్నాడు. ఈ సారి ఈ రైలు ఎందాకా పోతుందో అక్కడికి టిక్కెట్టు తీసుకున్నాడు.

వెళ్లి వెళ్లి ఆ రైలు ఒక కుగ్రామం దగ్గిర ఆగిపోయింది. అక్కడ ఎండ వెచ్చగా, నారింజరంగులో అందంగా ఉంది. ప్రకృతి కూడా రమణీయంగా ఉంది. నారింజతోటలూ, మిరియాల చెట్లూ అవీను. డిమిల్ అక్కడ ఒక గొడ్లచావడి వాడితో మాట్లాడి ఒక పెద్ద చావడిలో సగభాగం అద్దెకు తీసుకుని ఇదే స్టూడియో అన్నాడు. గుర్రాలు కట్టేసే గదులు చూపించి ఇవి మేకప్ రూమ్స్ అన్నాడు.

ఇదే జగద్విఖ్యాతి నొందిన చలనచిత్ర దర్శక నిర్మాత సిసిల్ డిమిల్ కథకు మొదలు. ఆ గొడ్లసావిడే ఇప్పటి సువిశాలమైన పారమౌంట్ చిత్రభువనభవనాలకు పునాదిరాయి లాంటిది. ఆ సావిడి పెద్ద స్టుడియోగా పెరిగినట్టే ఆ కుగ్రామం ఆనాడు మొదలై ఈనాటి ప్రపంచ చలనచిత్ర పరిశ్రమ రాజధాని హాలీవుడ్‌గా విస్తరించింది. అందువల్లనే సిసిల్ డిమిల్‌ను హాలీవుడ్ వ్యవస్థాపకుడు అంటారు.

హాలీవుడ్‌లో పెరిగిన, లేదా దాన్ని పెంచిన డిమిల్ చలనచిత్రకళకు రెండు ముఖ్యసాధనాలు, ప్రప్రథమంగా సమకూర్చి, అభివృద్ధికి దారితీశాడు. ఒకటి సెట్ మీద లైటింగుకి సంబంధించినది.

### రెంబ్రాంట్ లైటింగ్

కాలిఫోర్నియాలో కూడా సూర్యుడు ఎప్పుడు పడితే అప్పుడు కాల్‌షీటుకి హాజరవుతాడని గారంటీ కనబడక, ఒక చిత్రానికని డిమిల్ ఒక అపెరా హౌస్ వాళ్ల దగ్గిర్నుంచి ఒక స్పాట్‌లైట్ ఎరువు తెచ్చాడు. దాని కాంతిని ఒక నటుని మొహం బాగా చూపించడానికి వాడాడు. ఆ వాడడంలో మొహం అంతా కాకుండా కామెరా వైపు బాగా ఉన్న భాగం మీద మటుకు పడేలా వేశారు. అలా చెయ్యడానికి అదే తొలిసారి. సరే చిత్రం పూర్తయింది. న్యూయార్కు పంపించారు ప్రదర్శనకి. హఠాత్తుగా న్యూయార్కు డిస్ట్రిబ్యూషన్ వ్యవహారాలు చూసే శామ్యుల్ గోల్డ్‌విన్ ( దరిమిలా ఈయన మెట్రో గోల్డ్‌విన్ మేయర్ సంస్థ స్థాపకులలో ఒకడైనాడు) దగ్గిర్నుంచి తంతి వచ్చింది.

సిసిల్ డిమిల్ కొంపముంచాడనీ, ఫిలింలో హీరో మొహం సగానికే లైటింగు ఉంది కాబట్టి, సినిమాహాలు యజమానులు సగం రేటే ఇస్తానంటున్నారని తంతి వార్త వెల్లడించింది.

డిమిల్‌కి మతి పోయింది.

''కాని హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చేసింది,''అంటాడాయన ఆ సంగతి ప్రస్తావనకి వస్తే.

అదే లైటింగులో కొత్త అధ్యాయానికి నాంది అయింది. డిమిల్ డబాయింపు జవాబు ఇలా ఉంది. "నీకూ ఆ హాలు వాళ్లకీ రెంబ్రాంట్ టైపు లైటింగు తెలియకపోతే మీ ఖర్మం అది. నా తప్పుకాదు." అని.

మర్నాటికల్లా కథ తరహా మారిపోయింది. "రక్షించావు. నీ రెంబ్రాంట్ లైటింగ్ నచ్చిందట. హాలువాళ్లు మామూలురేటుకి రెట్టింపు ఇస్తున్నారు." అని గోల్డ్‌విన్ జవాబు పంపాడు.

డిమిల్ చిత్రపరిశ్రమకు సమకూర్చిపెట్టిన మరోకొంగు 'కెమెరా బూమ్'. అది సంభవించిన సందర్భం కూడా తమాషాగానే ఉంటుంది.

ఒక చిత్రంలో ఒక మేడమీద గది షూట్ చెయ్యవలసి వచ్చింది. మేడ ఇవతల నుంచి, గోడ వెంబడే కెమెరాను పైకి ఎక్కించి కిటికీలోంచి లోపలి మనుషుల్ని తియ్యాలనుకున్నాడు డిమిల్.

'కెమెరాలు ఎక్కడైనా గోడలెక్కుతాయా' అన్నాడు ఒక 'వాస్తవిక వాది' విడ్డూరంగా, వెటకారంగా.

డిమిల్ అతనికేసి ఒక క్షణం చూసి "నేర్చుకుంటే ఎక్కగలవు" అన్నాడు. వెంటనే ఒక మేడ నిచ్చెన (దన్ను ఉండేది) తెచ్చారు. దాని మీద పొడుగుపాటి పలక వేసి బిగించారు. ఈ చివర కెమెరా ఉంచి, ఇంకో చివర ఇసుక బస్తాలు పెట్టి తూకం అమర్చుకుని షూట్ చేశారు. చక్రాలు, బండీ, హంగులు కుదిరాక కొన్నాళ్ళకి అదే కెమెరా బూమ్ అయింది. కెమెరా చుట్టూ తిరగడానికి పై నుంచి కిందకు చూడటానికి సదుపాయం కలిగింది.





టెన్‌కమాండ్‌మెంట్స్ (1956)

ఈ విధంగా తన చిత్ర నిర్మాణయాత్రే చలన చిత్ర పరిశ్రమ ప్రగతిగా కొత్తవింతలు కనిబెడుతూ, ప్రపంచావధిని అద్భుతమైన చిత్రాలు తీస్తూ పేరు, ప్రఖ్యాతులు గడించిన సిసిల్ డిమిల్ ఆగస్టు 12వ తేదీని 1881లో జన్మించాడు. ఆయన నిర్మించిన 'ది టెన్ కమాండ్‌మెంట్స్' బ్రహ్మాండమైన చలన చిత్రమనీ, అలాంటి చిత్రాన్ని ఇంత వరకు ఎవరూ నిర్మించ లేదనీ, ఇంతలో నిర్మించ గల అవకాశాలు కూడా ఉండక పోవచ్చునని చెప్పవచ్చు. తన 44 సంవత్సరాల చలన చిత్ర జీవితంలో డిమిల్ నిర్మించిన చిత్రాలలో అది 70వది.

తొలిసారిగా 1931లో "ది స్క్వామాన్" అనే చిత్రం నిర్మించాడు. హాలివుడ్ కూడా అప్పటి నుంచే అభివృద్ధి చెందుతూ వచ్చింది. 1915లో ఆయన 'కార్మెన్' అనే చిత్రం నిర్మించాడు. 1918లో ఆయన దర్శకత్వం వహించిన 'జోన్ ది ఉమన్' విజయవంతం గావటంతో ఆయన ఖ్యాతి ద్విగుణీకృతమైంది. దానిలో యుద్ధ దృశ్యాలూ, స్వప్నలోక విహారాలూ, డబుల్ ఎక్స్‌పోజర్లు ప్రేక్షకులనూ, విమర్శకులనూ కల్పనా లోకంలో విహరింప చేశాయి.

1927లో సిసిల్ బి.డిమిల్ నిర్మించిన 'కింగ్ ఆఫ్ కింగ్స్' ఏ నాటికీ మరవలేనిది. అలాటి అద్వితీయ కళాఖండాల్లో 'ది సైన్ ఆఫ్ ది క్రాస్' 'క్లియోపాత్రా' 'ది క్రూసేడ్స్'', 'ది గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్', 'అన్‌కాంకర్డ్' నిత్యనూతనంగా భాసిస్తూ చలన చిత్ర ప్రేక్షకులను ఆకర్షిస్తున్నవి..

డిమిల్ చలన చిత్ర కళకు రసపుష్టి కూర్చలేక పోయినాడని ఆయనను కొందరు విమర్శకులు అనవసరంగా వెక్కిరించవచ్చు. స్నానమందిరాలు, రాజసభలు, యుద్ధ రంగాలు మొదలైన వాటికి ఆయన వెచ్చించే ధనానికి ఆయనను హేళన చేయవచ్చు. కాని సిసిల్ బి.డిమిల్

చిత్రాలు ప్రపంచంలో మరి ఏ ఇతర నిర్మాత తీసిన చిత్రాలకన్న ఎన్నో రెట్లు ప్రేక్షకులను ఆకర్షించి కోటాను కోట్లుగా కనకవర్షం కురిపించేసినవి అనేది వారంతా ఒప్పుకొంటారు. ఆయన నిర్మించిన చిత్రాలు 'బ్రహ్మాండం'గా ఉండటమే గాక, చలనచిత్ర సీమలో ఎంతో మంది నిర్మాతలు ఉన్నప్పటికీ, ఆయన ఒక్కడే 'మిస్టర్ హాలీవుడ్' అనే నామధేయంతో విశ్వవిఖ్యాతి గాంచేటట్టు చేశాయి. ఆ బిరుదు ఆయన కొక్కడికే తగును. తగదని ఎవరూ అనలేదు. అనరు.

ఆయనలో కళాకారుని లక్షణాలు, వ్యాపారవేత్త లక్షణాలు ఆధునిక రూపంలో సమన్వయమయిగా వుండేవి. ప్రతిరోజూ 12 నుండి 14 గంటల వరకు నిర్విరామంగా పని చేసేవాడు' ఎక్కడ వున్నా ప్రొడ్యూసర్ - డైరెక్టరుగా సాంకేతిక నటీ నట బృందం మీద అజమాయిషీ చేస్తూ ప్రతి పని అనుకొన్న ప్రకారం నిర్విఘ్నంగా జరిగేటట్లు చూసేవాడు. ఆయన బృందం అంటే సామాన్యం కాదు - 'టెన్ కమాండ్‌మెంట్స్' చిత్రంలో ఒకేసారి 15000 మంది వరకు పని చేశారు.

మోసెస్ జీవితం ఆధారంగా తీసుకొని నిర్మించిన 'టెన్ కమాండ్‌మెంట్స్' షూటింగ్స్ ప్రారంభించక పూర్వం అన్ని ఏర్పాట్లు చేయటానికి మూడు సంవత్సరాలకు పైగా పట్టింది. ఇతిహాస పరిశోధనలో 1800 గ్రంథాలూ, అన్ని ఖండాలకు సంబంధించిన ఎన్నో పత్రాలు పరిశీలించవలసి వచ్చింది. వేలాది ఉప నటీనటులనూ, ఒంటెలు మొదలైన పశుగణాలనూ ఉపయోగించుతూ ఈజిప్టు, పాలస్తీనాలలో రెండు నెలలు అవుట్‌డోరు షూటింగ్ జరిపారు. అంతకు పూర్వం ఒక సంవత్సరం నుంచీ ఈజిప్టులో నూరు అడుగులకు పైగా ఎత్తుగల సెట్లు నిర్మించారు. సాధారణంగా పెద్ద ప్రొడక్షన్‌కు పట్టేదానికంటె రెట్టింపు రోజులు అంటే నూరు రోజులకు పైగా హాలీవుడ్‌లో ఆ పిక్చరు షూటు చేశారు.

ఆయన తొలి 'టెన్ కమాండ్‌మెంట్స్' కూడా మిలియన్ డాలర్లు (సుమారు 45 లక్షల రూపాయలు) ఖర్చుతో పేరమౌంట్ వారికి తీసిపెట్టాడు. అంతడబ్బు వెచ్చించి తీసినందుకు ఆయునను పేరమౌంట్ వారు ఎన్నో మాటలన్నారు.

చిత్రం విడుదల అయింది. పెట్టుబడికి ఎన్నో రెట్లు డబ్బు వచ్చిపడింది. డిమిల్‌ను తొందరపడి మాటలన్నందుకు పేరమౌంట్ వారు ఎంతో నొచ్చుకున్నారు.

1912లో న్యూయార్కు నగరంలో ఒకనాటి భోజన సమయంలో ఆయన జెస్సీ లాస్కీతోనూ,



క్లాడెట్ కోల్బర్ట్ నాయికగా నటించిన

క్లియోపాత్రా (1934)

సామ్యూల్ గోల్డ్‌విన్‌తోనూ చలన చిత్ర నిర్మాణ భాగస్వామిగా చేరాడు. అంతకుముందు ఆయనకు కెమెరా అంటే ఏమిటో అట్టే తెలియదు. కాని నాటక కళారాధ కుల కుటుంబంలో మనిషి కాబట్టి దాని గురించి తెలుసు. ఆ పైన స్వయంకృషి వల్ల అమోఘమైన అనుభవం గడించాడు.

బ్రాడ్వే ప్రొడ్యూసర్ డేవిడ్ బెలాస్కొతో, సిసిల్ తండ్రి హెన్రీ, సి.డిమిల్ కలిసి పని చేస్తుండే వాడు. తల్లి బ్రాడ్వే నాటక ప్రతినిధిగా ప్రఖ్యాతి చెందింది. న్యూయార్కులోని అమెరికన్ అకాడెమి ఆఫ్ డ్రమెటిక్ ఆర్ట్స్‌లో శిక్షణ పొందాడు. నటుడిగా ఆయన అమెరికాలో పది సంవత్సరాలు పర్యటించాడు. నాటకాలు రచించాడు. తర్వాత సొంత కంపెనీ స్థాపించాడు. 1913లో చిత్ర నిర్మాణం ప్రారంభించాడు.

పది సంవత్సరాలైన పిమ్మట త్రిమూర్తులు (డిమిల్, లాస్కీ, గోల్డ్విన్) విడిపోయారు. అప్పుడే పారామౌంట్ వారికి 'టెన్ కమాండమెంట్స్' తీసి పెట్టడం జరిగింది. ఆ తర్వాత డిమిల్ తన సొంత స్టూడియో స్థాపించి చలన చిత్ర నిర్మాణం నిర్విరామంగా సాగిస్తూ వచ్చాడు. దానితో పాటు మెట్రో గోల్డ్‌విన్ మేయర్ సంస్థలో ప్రొడ్యూసర్‌గా కూడా పని చేశాడు. అలా ఎనిమిది సంవత్సరాలు గడిచింది. తిరిగి పేరమౌంటు సంస్థలో చేరాడు.

బ్రహ్మాండమైన సెట్‌ల మీద నిజం అనిపించే వాతావరణంలో చిత్రిస్తే తప్ప కథలో రసపోషణ సాధ్యం కాదని డిమిల్ నమ్మకం. ఆయన కృషి ఫలితాలలో ఎక్కువ భాగం క్రైస్తవ పౌరాణిక గాథలు ఆధారంగా తీసిన చిత్రాలే. 'ది కింగ్ ఆఫ్ కింగ్స్' 'ది క్రూసేడ్స్', 'ది టెన్ కమాండ్‌మెంట్స్' (మూకీ, టాకీ) 'శామ్సన్ అండ్ డిలైలా' వంటివి.

ఒళ్లు ఝల్లుమనిపించే దృశ్యాలతో నింపుతూ డిమిల్ చేసిన ఇతర చిత్రాలలో 'ది అన్ కాంకర్డ్', 'ది గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్' చెప్పుకో తగ్గవి. వెస్టర్న్ చిత్రాలలో డిమిల్ చిత్రం 'ది ప్లెయిన్స్‌మన్' నాటికీ నేటికీ కూడా విశిష్ట చిత్రంగా పరిగణించబడుతోంది.

బ్రహ్మాండమైన సెట్‌లో కానీ, లక్షలాది డబ్బు తీసుకునే తారాగణం గానీ, ప్రముఖ దర్శకత్వం గానీ ఒక చిత్రాన్ని విజయవంతంగా నడిచేటట్లు చేయలేవు. కానీ ఒక్కదానికి మాత్రమే ఆ మహత్తర శక్తి ఉన్నది - అదే కథ' అని అయన నొక్కి వక్కాణించేవారు.

ఆయనకు సిరితోపాటు సంతానం కూడా ఉన్నది. 1902లో కాన్స్టన్స్ ఆడమ్‌ను వివాహమాడారు. వారికి నలుగురు పిల్లలూ. ఆయన పోయే నాటికి, 77వ పడిలో పడినప్పటికీ, 40 సంవత్సరాల వాడి చురుకుదనం ఆయన మరణించేవరకూ కానరావడానికి కారణం - ఆయన 'రసస్పృష్టి' అనే ఔషధం సేవించడం.

మామూలు కాన్వాసుమీద పెయింట్ చేసి, నాలుగు ప్లాట్లు అడ్డం పెట్టి, ఇవే రాజసౌధాలు, లతానికుంజాలు, భీకర రణరంగాలు, పర్వత శిఖరాలు, పాతాళలోకాలు అనే రోజుల్లో సాధ్యమైనంత వరకు అవి యథార్థంగా ఎలా కనిపిస్తాయో అంత కళ్లు చెదిరేలా సెట్‌లు వేయాలని ఆయనకు ఎంత పట్టుదల ఉండేదో, ఇందులో గుండుసూది ప్రాముఖ్యాన్ని కూడా గుర్తించి ఆలోచించేటంత శ్రద్ధ కూడా ఉండేది. ఊహలూ, మాటలూ ఎగిరినంత ఎత్తుకి తాను ఎగరాలన్న పట్టుదల, దానికోసం లక్షలు ఖర్చు పెట్టే సాహసం, అహోరాత్రులు తాను శ్రమపడి, తోటి పని వారిని శ్రమపెట్టి ఫలితాన్ని సాధించ ప్రయత్నించే ఓర్పు (ఒక సారి భోజనానికి ఆలస్యమయిన కారణంగా ఉప నటీనటులు విసుక్కొనడం, మొదలు పెట్టగా ఆయన 'మీరందరూ నన్ను అసహ్యించుకొన్న మరేం ఫరవాలేదు. కాని రేపు మీ మొహాలను తెరమీద చూసుకొని మిమ్మల్ని మీరే అస్యహించుకోకుండా ఉంటే అదే పదివేలు' అని గర్జిస్తే వారంతా బుద్ధి తెచ్చుకొని మనస్ఫూర్తిగా నటించేరట) వ్యయ ప్రయాసలు రెండిటినీ లవలేశం కూడా పొల్లుపోకుండా పూర్తిగా సద్వినియోగం చేసుకొని ప్రేక్షకులకు తృప్తిని కలిగించగల ప్రజ్ఞా డిమిల్‌కి గల సిరిసంపదలు.

ఇతరులు ఖర్చుపెట్టే మిలియన్ డాలర్లకూ డిమిల్ ఖర్చుపెట్టే 'డి-మిలియన్' డాలర్లకూ ఉన్న తేడా ఇదే. పరాజయంతో పరిచయం కాకుండా ప్రజల మనస్సుల్లో కలకాలం నిలిచి పోయేట్లా డిమిల్‌ను నిలిపిన శక్తి ఇదే.

# రాజా ఆడియో రివ్యూ



**విడుదల: సుప్రీమ్ వెల: రూ. 35/-**

సాయి కిరణ్, లయ హీరో హీరోయిన్‌లుగా తమ్మారెడ్డి భరద్వాజ్ దర్శకత్వంలో సీనియర్ నిర్మాత కెసి శేఖర్‌బాబు నిర్మించిన 'ఎంత బావుందో' సినిమా ఆడియో క్యాసెట్ సుప్రీం సంస్థ ద్వారా విడుదలయింది. సాకేత్ సాయిరామ్ అనే నూతన స్వరకర్త ఈ చిత్రం ద్వారా సంగీత దర్శకుడిగా పరిచయమయ్యాడు.

'ఇంటర్నెట్ చాటింగ్‌లోన తగిలాడు నాయుడు బావా' అనే పాటతో క్యాసెట్ మొదలవుతుంది. బాచీ, ఇట్లుశ్రావణి సుబ్రహ్మణ్యాం చిత్రం ద్వారా మంచి సంగీత దర్శకుడిగా పేరు తెచ్చుకున్న చక్రి, గాయని సునీత ఈ పాటను పాడేరు. పాటకు హాంటింగ్ ట్యూన్ జత పడింది. ముఖ్యంగా కోరస్‌కి కేటాయించిన లైన్ల యొక్క ట్యూన్ చాలా క్యాచీగా ఉంది. లేటెస్ట్ ట్రెండ్‌ని సాహిత్యంలో చక్కగా చూపించాడు సాహితి.

గురుచరణ్ రాయగా పార్థసారధి, సునీత, రాధాకృష్ణన్ పాడిన 'ఝుమ్మని రాగాలే కమ్మని గీతాలే నాలో మౌనంగా నీ ప్రేమే పలికినది' పాట చక్కని అభిరుచి గల పాట. భీంప్లాస్ రాగంలో మొదలై చరణాల చివర భాగేశ్వరి రాగాన్ని టచ్‌చేసి తిరిగి భీంప్లాస్ రాగంలో ల్యాండ్ అయిన పద్ధతి బావుండడమే కాకుండా పాడుకోడానికి కూడా వీలుగా వుంది.

సాహితి రాయగా చరణ్, సునీత పాడిన 'ప్రియురాల ప్రియురాల నీ ఎదలో కొంచెం చోటీవా' పాట ఛానల్స్ పుణ్యమా అని ఆల్రెడీ హిట్టయి పోయింది. చరణాలు పూర్తయ్యాక పల్లవిని అందుకొనే ముందు 'ప్రియురాలా' అంటూ మూడు సార్లు అన్న పద్ధతి జాగ్రత్తగా గమనిస్తే 'ప్రేమదేశం' సినిమాలో 'నను నేనె మరచినా నీతోడు' పాటలో 'రావా నా వాకిట్లో / నీకై నేవేచాను' అనే వాక్యాలను బాలు పాడిన పద్ధతి గుర్తొస్తుంది.

గురుచరణ్ రాయగా కనకేష్, ఉష పాడిన 'ముద్దబంతి పూలే ఎట్టి ముందు తలుపూ మూసి పెట్టి' పాట వెరీగుడ్ కంపోజిషన్. ఎక్కడ పాడినా ఎవరు పాడినా పాడే వాళ్ళకి మంచి పేరుని తెచ్చిపెట్టే ట్యూన్ ఇది. సాహిత్యపరంగా చూసుకుంటూ 'కళ్ళుందీ నీ కోసం వేచేందుకే/ చెయ్యుందీ నీ చెయ్యి పట్టేందుకే' లాంటి ఎక్స్‌ప్రెషన్‌లు 'మురారి' సినిమాలోని 'అందానికీ అందానివే కట్టున్న బొట్టున్న గోదారివే' పాటలో 'నువ్వు పిలిచేందుకే నాకు పేరున్నది' లాంటి వాక్యాల ద్వారా వినేశాం. అలాగే ఆభరణాలు అడ్డొస్తున్నాయంటూ చరణాల్లో వర్ణించిన తీరు 'వీరాభిమన్యు' సినిమాలో 'చల్లని సామివి నీవైతే' పాటలోని చరణాల సాహిత్యాన్ని జ్ఞాపకం చేస్తుంది.

సాహితి - సాహితీపరంగా చెడుగుడు ఆడుకున్న 'ఎన్నడో పాతయుగముల నాటి బానిసే కదా మీ స్త్రీ జాతి' పాటని రాధాకృష్ణన్, ప్రదీప్‌రాజా, కనకేష్, సునీత, గాయత్రి అంతకన్న హుషారుగా పాడేరు. టోటల్‌గా చాలా సరదా అయిన పాట ఇది.

రమణ్‌లోక్ రాయగా రవివర్మ, సునీత పాడిన 'నీ చూపు నీ వూపు చూసి మనసంతా ఆగిందే పిల్లా' పాట కూడా చాలా మంచిపాటే. మధ్యమావతి రాగచ్ఛాయలలో సాగిన అలనాటి హిందీ చిత్రం 'మధుమతి'లో సలిల్ చౌదురి స్వరపరచిన 'దయ్యారె దయ్యారె ధేఖొరె పాపీ బిచువా' పాట స్టాండర్డ్‌ని గుర్తు చేస్తుంది. మొత్తం ఉన్న ఆరు పాటలూ సాకేత్ సాయిరామ్‌ని స్వరపరచగా చక్కని సృజనాత్మకత గల టెక్నీషియన్‌గా ఋజువు చేస్తాయి. వీటిలో 'ముద్దబంతి పూలే ఎట్టి' పాట సినిమాలో కనిపించే అవకాశం లేదు(ట).



**విడుదల: సుప్రీమ్ వెల: రూ. 35/-**

శ్రీకాంత్, గజలా, రాజా, ఆశాసైనీ తారాగణంగా ఇవీవీ శిష్యుడు ఇ.సత్తిబాబు (తిరుమల తిరుపతి వెంకటేశ ఫేమ్) దర్శకత్వంలో ముళ్ళపూడి బ్రహ్మానందం నిర్మించిన 'ఓ చినదాన' క్యాసెట్ సుప్రీమ్ ద్వారా విడుదలయింది. అద్భుతమైన ప్రతిభ గల విద్యాసాగర్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు కాగా ఉన్న అన్ని పాటలు సిరివెన్నెల సీతారామశాస్త్రి రాశారు.

'తన చిరునామా అడిగితే ప్రేమ నిను చూపెడుతోందె' పాటను పాడిన దేవాశిష్ 'నిన్నడిగికుడుతుందా చీమైనా దోమైనా' అనే సాకీలో 'చీమెనా, దోమైనా, ఏమైనా' అనే పదాలను పలికిన తీరు నువ్వు తెప్పిస్తుంది. ట్యూన్ మాత్రం మూడుసార్లు వింటే మూడో సారి నుంచీ వెంటాడుతూ ఉంటుంది. సాహిత్యం ఆసాంతం ఓ రెండుసార్లు గమనించి అవలోకించుకుంటే సీతారామశాస్త్రి ఎంత చిలిపిగా రాశాడు అని అనిపిస్తుంది.

మనో, స్వర్ణలత పాడిన 'హవ్వాహవ్వా ఒకే ఒక ముద్దివ్వా, హవ్వాహవ్వా' పాట మంచి ఊపున్న పాట. ఒక విధంగా ఈ పాటని మనో విజృంభించి మరీ పాడేడనిపిస్తుంది. టిప్పు, గోపికా పూర్ణిమ పాడిన 'వీలు చూసి వాలు చూసి వాలిపోనా అందగాడా' పాటని చెవికి ఎటువంటి ఇబ్బందినీ కలిగించని పాటగా చెప్పుకోవాలి. మనో, యస్.పి.చరణ్, సుజాత, స్వర్ణలత పాడిన 'ఒంటి మీద పట్టుకోక కెవ్వుమంది ఉండలేక' పాట కేవలం మాస్‌కి నచ్చే సన్నివేశం కోసం చేసినట్టనిపిస్తుంది. సాహిత్యపరంగా చూస్తే సీతారామశాస్త్రి ఓవర్‌డోస్‌ని చాలా తెలివిగా మ్యానేజ్ చేశాడనిపిస్తుంది.

బాలు, ఉషా రమణన్ పాడిన 'చెయ్యి గిల్లి చిననాటి బాసలు' పాట చక్కని పాట. పాటతో రిపీట్‌గా వచ్చే 'దిందింతార' వినసొంపుగా హాయిగా ఉంది. మోహనరాగాన్ని ఆధారంగా చేసుకొన్న స్వరపరచిన ఈ పాట సాహిత్యపరంగా, సంగీతపరంగా 'తూనీగా తూనీగా' (మనసంతా నువ్వే) పాటను గుర్తుచేస్తే అందుకు విద్యాసాగర్‌ని, సీతారామశాస్త్రిని తప్పుగా అనుకోరాదు. ఇలాంటి సమయాల్లో రంధ్రాన్వేషణ కన్నా రసాస్వాదనే మంచిది.










**విడుదల: హెచ్.ఎం.వి., వెల: రూ. 40/-**

అనుబంధాలు' అనే మకుటంతో మూడవ వాల్యూమ్‌గా హెచ్.ఎం.వి. వారు 'నువ్వు - నేను' కాన్సెప్ట్‌తో విడుదల చేసిన ఆడియో క్యాసెట్ ఇది. మిగిలిన వాల్యూమ్‌లలో లాగానే ఘంటసాల వారి సతీమణి శ్రీమతి సావిత్రి గారి వ్యాఖ్యానంతో మొదలవుతుందీ క్యాసెట్.

ఈ క్యాసెట్‌లో - నీవేనా నను తలచినది ( మాయాబజార్), నీ వెవ్వరివో (రాజ్‌కపూర్ ప్రేమలేఖలు), నన్నువదలి నీవు పోలేవులే (మంచి మనసులు), నీవు నాకు రాజా మరి నేను నీకు రోజా ( రాజకోట రహస్యం), నీకేం తెలుసు నిమ్మకాయ పులుసు (కొడుకు కోడలు), నీవు రావు నిదుర రాదు ( పూల రంగడు), నువ్వు నేను నడిచేది ఒకే బాట ( డబ్బుకు లోకం దాసోహం), నీవు లేక నేను లేను (మంచి మనుషులు), నీవే నీవే నిన్నే నిన్నే ( ఇంటికి దీపం ఇల్లాలే) నీతోనే ఉంటాను శేషగిరి బావా (జమీందార్), నువ్వంటే నాకెందుకో ఇంత ఇది(అంతస్థులు), నువ్వు నేను ఏకమైనాము(కొడుకు కోడలు), నీవని నేనని(పాండురంగ మహత్యం) నీ కోసమే నే జీవించునది(మాయాబజార్) పాటలతో పాటు నిన్నే నిన్నే చెలి నిలు నిలుమా(బబ్రువాహన) నీవు నా ఊహలందే నిలిచావు (ఇల్లాలు) వంటి అరుదుగా దొరికే పాటలు కూడా ఉన్నాయి. మిగిలినవన్నీ సంపాదించుకోవచ్చుగాని ఈ రెండు పాటలకోసం మొత్తం క్యాసెట్‌ని కొన్నా నష్టం లేదు. ఇన్‌లే కవర్‌లో ఇచ్చిన సాంకేతిక సమాచారంలో కొన్ని తప్పులు దొర్లాయి. నిన్నే నిన్నే చెలి (బబ్రువాహన) పాటను ఘంటసాలతో పాడిన గాయని యస్. వరలక్ష్మి కాదు. అది పాడినది సుశీల. అలాగే 'నీవని నేనని' పాట 'అల్లుడే మేనల్లుడు' చిత్రంలోనిదని రచన నారాయణ రెడ్డి అనీ సంగీతం బి.శంకర్ అని పేర్కొన్నారు. ఆ పాట పాండు రంగ మహత్యంలోనిది. రచన సముద్రాల సంగీతం టి. వి. రాజు. ఇది మాత్రం చాలా పెద్ద తప్పు.

**విడుదల: ఆదిత్య వెల: రూ. 28/-**

కమల్‌హాసన్, సిమ్రాన్ జంటగా మౌళి దర్శకత్వంలో రమ్య మూవీస్ పతాకంపై ప్రముఖ నిర్మాత ప్రసాద్ తెలుగుకి అనువదించిన 'బ్రహ్మాచారి' సినిమా ఆడియో క్యాసెట్ ఆదిత్య మ్యూజిక్ ద్వారా విడుదలయింది. దేవా ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

శివగణేష్ రాయగా శ్రీనివాస్, సుజాత పాడిన 'సకల కళా వల్లభుడా' పాట వింటున్నంత సేపు చెవికి ఏ మాత్రం ఇబ్బంది కలిగించని పాట. భువనచంద్ర రాయగా మనో పాడిన 'చంద్రస్వామి బాలస్వామి సుబ్బు స్వామి కళ్యాణం చేసుకొన్నారో' పాట పూర్తిగా తమిళ వాసనలను వెదజల్లుతూ వుంటుంది.

నారాయణ పాడిన 'భామా ప్రేమా కోసం ఎన్నడైనా పరితపించావా' పాటకి వీలయినంతగా తెలుగుదనం అద్దిన భువన చంద్ర కృషి ఆద్యంతం కనిపిస్తూనే వుంటుంది. భువనచంద్ర రాసినదే మరోపాట - 'ఘటోత్కచా గదాధరా' పాటను శ్రీనివాస్, సుజాత, వి.చంద్రన్ ఆలపించారు. ఇది హిట్ సాంగ్ ఆఫ్ ది క్యాసెట్ అండ్ ఫిల్మ్ కూడా! రిపీట్ వాల్యూ ట్యూన్ పరంగా, లిరిక్‌పరంగా ఎక్కువగా ఉన్న ఈ పాట అనుపల్లవి సెకండాఫ్ లోని 'ఇంద్రుడు చంద్రుడు అంటూ నాయకుడంటూ ఇండియానంటూ ఆశపడ్డా అతివకు నీకె దొరికావే,' అనే వాక్యాల దగ్గర ట్యూన్ 'జీన్స్' సినిమాలోని 'పూవుల్లో దాగున్న పళ్ళెంతో అతిశయం' అనే పాటలో 'వేణువుల గాలి సంగీతాలె అతిశయం' అనే వాక్యాల వద్దగల ట్యూన్‌ని గుర్తు చేస్తూ ఉంటుంది. భువనచంద్ర రాయగా టిప్పు, స్వర్ణలత పాడిన 'నక్రేకల్లు బీగం వేసి నోరుమూసుకో' పాట జస్ట్ కాలక్షేపం పాట... అంతే!

## కీరవాణికి ఆ పేరు ఎలావచ్చింది..!?



సంగీత దర్శకుడు ఎం.ఎం.కీరవాణి పేరు వినగానే ఇదేదో సినిమా ఫీల్డుకి వచ్చిన తర్వాత పెట్టుకున్న పేరే తప్ప ఒరిజినల్‌గా పెద్దవాళ్ళు పెట్టినదై ఉండదని చాలామందికి అనిపిస్తూ ఉంటుంది.

కానీ అది నిజం కాదు!

'కీరవాణి' అన్నది ఓ రాగం పేరు కాబట్టి శాస్త్రీయ సంగీతం మీద గౌరవం కొద్దీ ఆయనకా పేరు చిన్నప్పుడు పెట్టేసి ఉంటారని మరి కొంతమంది అనుకుంటూ ఉంటారు.

ఇది కొంత నిజం!

అసలు నిజం ఏమిటంటే - మరకతమణి కీరవాణి - అదే.... ఎం.ఎం. కీరవాణి వాళ్ళ నాన్నగారికి 'విప్రనారాయణ' సినిమాలో భానుమతిపాడిన 'ఎందుకోయీ తోటమాలీ అంతులేని యాతనా' అనే పాటంటే ఎంతో ఇష్టం. ఆ పాట కీరవాణి అనే రాగంపై ఆధారపడింది. అంచేత ఆ రాగం పేరునే తన తనయుడికి పెట్టేసుకున్నారాయన. అదీ కీరవాణి పేరు వెనుక నున్న కథ!!

గత సంచికలో 'బాపూరాసిన'
అంటూ వచ్చిన ప్రకటనపై
ఎంతోమంది ఫోన్‌చేసి
తెలుసుకోవడానికి ప్రయత్నించడం
జరిగింది

**ఆ ప్రకటన నిజమే...!!!**

పత్రికలకు కార్టూన్‌లు వేయడం తప్ప
ఆర్టికల్స్ రాయని
శ్రీబాపు
'హాసం' పాఠకులకోసం
ప్రత్యేకంగా రాశారో
అద్భుతమైన ఆర్టికల్
చూడండి

**వచ్చే సంచికలో...**






# 2001 లో సంగీత విశేషాలు

- ప్రముఖ షెహనాయ్ విద్వాంసుడు ఉస్తాద్ బిస్మిల్లాఖాన్, గాన కోకిల లతామంగేష్కర్‌లకు 'భారతరత్న' అవార్డు లభించింది. సినీ పరిశ్రమకు చెందిన వ్యక్తి ఈ పురస్కారాన్ని పొందిన ఏకైక వ్యక్తి - లతా!
- రాక్-పాప్ గాయకుడు బ్రయాన్ ఆడమ్స్ మే నెలలో బెంగళూరు, బొంబాయిలలో ప్రదర్శనలిచ్చారు.
- యేసుదాస్ తొలిసారిగా 'అహింస' అనే ఆల్బమ్ కోసం ఇంగ్లీషులో పాడారు. రికార్డో బరాంటెస్ సంగీతం సమకూర్చారు.
- 'ఆప్‌కీ ఆశా' ఆల్బమ్ ద్వారా ఆశా భోంస్లే సంగీతదర్శకురాలిగా మారారు. రచయిత మజ్రూ సుల్తాన్‌పురి.
- ప్రధానమంత్రి అటల్ బిహారీ వాజపేయి పద్యాలకు సంగీతాన్ని సమకూర్చబోతున్నానని నౌషద్ ప్రకటన.
- ప్రముఖ సంగీత దర్శకుడు కళ్యాణ్‌జీ (కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ జంటలోని అన్నగారు) ప్రథమ వర్ధంతి సందర్భంగా  ఆగస్టు 24 న అమితాబ్ బచ్చన్ ఆయన విగ్రహాన్ని ఆవిష్కరించారు.
- ఆరు సంవత్సరాల తర్వాత మైకేల్ జాక్సన్ 'ఇన్‌విజిబుల్' ఆల్బమ్ విడుదల చేశారు
- 'యే జిందగీ కా సఫర్' చిత్రం ద్వారా అనూ మాలిక్ సోదరుడు దాబూ మాలిక్ సంగీత దర్శకుడిగా పరిచయమయ్యారు.
- ఎ.ఆర్.రెహమాన్ శిష్యుడు హారిస్ జయరాజ్ 'రహనా హై తేరే దిల్ మే' చిత్రం ద్వారా బాలీవుడ్ కి పరిచయమయ్యారు
- మెహదీ హసన్ కొత్త గజల్ ఆల్బమ్ 'సదా -ఎ- ఇశ్క్' విడుదలయింది. అనారోగ్యంతో బాధపడుతున్న మెహదీ తర్వాతి ఆల్బమ్ ఇప్పట్లో రిలీజ్ కాకపోవచ్చు.
- 'లగాన్' సినిమాగానే కాకుండా, మ్యూజికల్ హిట్ కూడా అనిపించుకుంది. ఎ.ఆర్.రహమాన్‌కు గొప్పపేరు తెచ్చిపెట్టింది.
- అనూ మాలిక్‌కు 2001 బాగా కలిసివచ్చింది. 'ముఝే కుఛ్ కహ్‌నా హై', 'అశోకా', 'అక్స్', 'అజ్‌నబీ'లలో మొదటిది, చివరిది మ్యూజికల్ హిట్సే!
- 'మిషన్ కశ్మీర్' (2000) లలో గుర్తింపు తెచ్చుకున్న శంకర్-లాయ్-ఎహ్‌శాన్ 'దిల్ చాహతా హై' తో హిట్ కొట్టారు. 'అభయ్'కు మార్కులు రాలేదు.
- కవి కైఫీ ఆజ్మీ, సంగీతదర్శకుడు ఖయ్యామ్ చాలా సంవత్సరాల తర్వాత 'షగుఫ్తగీ' అనే ఘజల్ ఆల్బమ్‌కు కలిసి పనిచేశారు.
- 6.5 కోట్లు ఇచ్చి ఆడియో హక్కులు కొనుకున్న సుభాష్ పై 'యాదే' పెద్ద డిజప్పాయింట్‌మెంట్.
- గతంలో 'త్రిదేవ్', 'మొహ్రా', 'గుప్త్' వంటి హిట్స్ ఇచ్చిన రాజీవ్ రాయ్ కి టిప్స్ బోల్డంత డబ్బు కోసి కొనుక్కున్న 'ప్యార్, ఇశ్క్, మొహబ్బత్' నిరాశను మిగిల్చింది.
- ఉదిత్ నారాయణ్, సోనూ నిగమ్, అల్కా యాగ్నిక్‌లు తమ హవా ఈ ఏడాది కూడా నడిపించారు. సునిధి చౌహాన్ కూడా మంచి పేరే సంపాదించుకుంది. 'పాప్' ఆల్బమ్స్ నుండి నేపథ్యగాయకులుగా మారిన వారిలో 'షాన్' కొత్తగా చేరాడు.






## 2001 లో చార్ట్‌బస్టర్స్

తెలుగు సినిమాలు - 1. ఖుషీ 2. నువ్వేకావాలి 3. నువ్వు-నేను 4. మనసంతా నువ్వే 5. ఆనందం

హిందీ సినిమాలు - 1. లగాన్ 2. దిల్ చాహతాహై 3. యాదే 4. కభీ ఖుషీ కభీ గమ్ 5. ముఝే కుఛ్ కహనా హై

ఇండీ పాప్ - కభీతో నజర్ మిలావో (ఆశా - అద్నన్ శామీ) 2. వో చలీ (బాంబే వైకింగ్స్) 3. కిషోర్ దా ఎన్ ది డాడీ మిక్స్ 4. లక్కీ ఆలీ - గెట్ లక్కీ 5. ఎక్ హసీనా థీ

ఇంటర్నేషనల్ -1. బెస్ట్ ఆఫ్ మీ (బ్రయాన్ ఆడమ్స్), 2. మేక్స్ బి 3. ది పార్టీ ఆల్బమ్ (వెంగాబాయ్స్) 4. ది డిఫినిటివ్ డాన్స్ ఆల్బమ్ (హాట్ స్టఫ్) 5. డిజర్ట్ గ్రూవ్

## ఫెస్టివల్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్

గతపక్షంలో 4, 11 తారీకుల మధ్య హైదరాబాదులో 'ఫెస్టివల్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్' పేర చక్కటి కార్యక్రమాలు జరిగాయి. డా. బాలమురళీకృష్ణ (కర్నాటక గానం), విశ్వమోహన్ భట్ (మోహనవీణ), ఉస్తాద్ షాహిద్ పర్వాజ్ షకీర్‌ఖాన్ (సితార్) రాజన్‌మిశ్రా, సాజన్ మిశ్రా (హిందూస్తానీ గానం), పంకజ్ ఉధాస్ (గజల్స్), జాకీర్ హుస్సేన్ (తబలా), విక్కువినాయకం (ఘటం), శివమణి, సెల్వగణేశ్ (వాద్యం), బిస్మిల్లాఖాన్ (షెహనాయ్), హరిహరన్ (గజల్స్), అసద్‌ఖాన్ (సితార్), హరిప్రసాద్ చౌరాసియా (వేణువు), ఎల్.వి.సుబ్రహ్మణ్యం (వయోలిన్), కవితా కృష్ణమూర్తి (ఫ్యూజన్ మ్యూజిక్), నూకల చినసత్యనారాయణ (కర్నాటక గానం) ప్రభృతులు పాల్గొని కార్యక్రమాలను రక్తి కట్టించారు.

### ఈలపాట రాగాలు

హైదరాబాదు రవీంద్రభారతిలలో జనవరి 1 వ తేదీ విజిల్ విజర్డ్ కె.శివప్రసాద్ నిర్వహించిన "ఈలపాటలలో వాగ్గేయకారుల రాగాలు" కార్యక్రమంలో సంగీత కళానిధి డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

### సర్ 'బీటిల్'?

నవంబరు 29 న మరణించిన బీటిల్ జార్జి హారిసన్‌కు నైట్‌హుడ్ ప్రదానం చేస్తారని అనుకుంటున్నారు. మరణించిన తర్వాత ఈ అవార్డు ఇవ్వడం ఇదే మొదటిసారిట.

### నవ్వుతూ బతకాలిరా ...

నవ్వు నాలుగు విధాల చేటు అనే నానుడిని మార్చి నవ్వు నాలుగు విధాల గ్రేటు అని నిరూపిస్తున్నారు హైదరాబాదు లాఫ్టర్ క్లబ్ వారు, తమ ఎబిసి (ఆల్వేజ్ బీ ఛీర్‌ఫుల్) ప్రాజెక్ట్ ద్వారా. సంవత్సరం క్రింద మొదలుపెట్టిన ఈ ప్రోగ్రాం క్రింద అనాథ పిల్లల పై లాఫింగ్ థెరపీ ప్రయోగిస్తున్నారు. దీనివల్ల చాలా సత్ఫలితాలు కలుగుతున్నాయని అంటున్నారు ఎబిసి అధ్యక్షురాలు షిరీన్ పంజ్వానీ. అవునంటున్నారు హైదరాబాదులోని కార్ఖానా లో సెయింట్ మేరీస్ చాపెల్ లోని 50 మంది పిల్లలు. పొద్దున్నే పగలబడినవ్వటం వల్ల క్లాసులో నిద్రరాదనీ, రాత్రి చదివిన పాఠాలు గుర్తుంటున్నాయి కూడా." అంటున్నాడు ఓ కుర్రాడు. హైదరాబాదులో జరుగుతున్న ఈ లాఫింగ్ క్లబ్ కార్యకలాపాలు స్విజర్లండ్ నుండి వచ్చిన గాబ్రియేలా బ్రూడర్ అనే టూరిస్ట్‌ని ఆకర్షించాయి. తమదేశంలో కూడా ఇలాటి క్లబ్బులను పెట్టాలని అనుకుంటున్నారామె.



# ఇంటర్వ్యూ

## ఆ శహనాయ్ - ఎంతో హాయి
## ఆయనో రసపాయి

# ఉస్తాద్ బిస్మిల్లాఖాన్



“భగవంతుడిని మనం చూడలేం. ఎలావుంటాడో కూడా తెలియదు. అయినా రోజూ ధ్యానం చేసుకుంటాం. అలాగే సంగీతాన్ని కూడా మనం చూడలేం. రోజూ విని ఒక అనుభూతిని చెందుతాం. సంగీతం భగవత్ అనుగ్రహం. కాబట్టే అది యీ సృష్టి వున్నంతకాలం వుంటుంది. యిటీవల అమెరికాలో ఎంతో ఎత్తయిన భవనసముదాయాన్ని కొందరు పడగొట్టగలిగారు కానీ సంగీతాన్ని పడగొట్టలేరు. కారణం ఆ భవనాలు మానవ నిర్మితాలు, సంగీతం భగవంతుడు సృష్టించింది.” అన్నారు ప్రముఖ షెహనాయ్ విద్వాంసుడు, భారతరత్న బిస్మిల్లా ఖాన్.

వారణాసి నుండి ఇటీవల ప్రత్యేకంగా హైదరాబాద్‌కు వచ్చిన బిస్మిల్లా ఖాన్‌తో కొద్దిసేపు ముచ్చటించే అవకాశాన్ని“ హాసం” అందిపుచ్చుకుంది. ‘హాసం’ పత్రికలోని పేజీలను తిరగేస్తూ మధ్య పేజీలలో గల మరికొందరు సంగీత కళాకారుల ఫొటోలు చూస్తూ వారి పేర్లు చెపుతూ “ ఏ దునియా కే మహా కళాకార్ హై కేవల్ హిందుస్థాన్ కే నహీ హై” అంటూ “హాసం” పత్రికను రెండు చేతులతో ఎత్తి ప్రక్కనున్న వారందరికీ చూపిస్తూ ఇలాంటి పత్రికలలో వ్రాస్తున్న సంగీత కళాకారుల పరిచయాల వలన రాబోయే తరం వారికి యీ ప్రముఖుల గురించి తెలుసుకునే అవకాశం కలుగజేస్తున్నారు. సంగీతం పట్ల శ్రద్ధ వహిస్తూ ఇలాంటి పత్రికను నిర్వహిస్తున్నందుకు“ హాసం సంపాదక్ జీ ఔర్ భాయియోంకో మేరే ముబారక్” అన్నారు ఎంతో ఆనందంతో.

హిందుస్తానీ సంగీతం పట్ల తనకు గల అభిమానం గురించి బిస్మిల్లాఖాన్ మాట్లాడుతూ “నాకు భోగ భాగ్యాల మీద మోజు లేదు. అతి సాధారణమైన జీవితాన్ని గడిపే ఒక కళాకారుడిని, మా ఇంటికి ఎవరైనా వస్తే నాతో పాటు చాపమీద కూర్చోపెట్టుకుని మాట్లాడతాను. నిలువెత్తు ధనం ఇచ్చినా సంగీతాన్ని ఇవ్వమంటే ఇవ్వను. నా సంగీతమే నాకు అన్నింటికన్నా విలువైనది” అన్నారు భారతరత్న బిస్మిల్లాఖాన్.“ హాసం” అడిగిన వివిధ ప్రశ్నలకు ఎంతో ఓపికగా అక్కడక్కడ రాగ యుక్తంగా సమాధానాలు ఇచ్చారు.

**అన్ని వాయిద్యాలకు తర్వాత తరం వారు వస్తున్నారు. మరి మీరు వాయిస్తున్న షెహనాయ్‌కు మీ తర్వాత తరం ఉద్భవించట్లేదు. కారణం?**

అన్ని వాయిద్యాలు చేతులతో వాయించేవి. షెహనాయ్ శ్వాసతో వాయించేది. దీనికి శరీర దారుఢ్యం, ఆరోగ్యం కావాలి. నా చిన్నప్పుడు ఒకే అణాతో గ్లాసు పచ్చిపాలు కొనుక్కుని బాదాం కలిపి తాగేవాడిని. అలా ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతూ సంగీత సాధన చేసాను. ఇవ్వాళ స్వచ్ఛమైన పాలు కూడా దొరకట్లేదు. ఇక సాధన ఎలా కుదురుతుంది?



హాసం ఏడవ సంచికలో అమ్జద్ అలీఖాన్ ‘దేశికోత్తమ’ అవార్డు ప్రదానం ఫోటో చూస్తున్న ఉస్తాద్. ఒళ్లో కరీంఖాన్, సిద్ధేశ్వరీదేవిపై వ్యాసాలున్న తొలి సంచిక పేజీలు

**నేటి యువత పాశ్చాత్య వాయిద్యాలపై మోజు చూపెడుతున్నారు. దీనిపై మీ కామెంట్?**

నాకూ అదే అర్థం కాని విషయం. విదేశాలలో నేను కచేరీలు నిర్వహించేటప్పుడు అక్కడి వారు మన సంప్రదాయ సంగీతాన్ని విని ఆనందించటమే కాకుండా నేర్చుకోవటానికి కూడా ఎంతో ఆసక్తి చూపుతున్నారు. మన యువత అందుకు రివర్స్‌గా పాశ్చాత్య సంగీతం పై మోజు పడ్తున్నారు. ఈ పాశ్చాత్య సంగీతం కొంతకాలం వరకే ఉంటుంది. తర్వాత అది పాతబడి పోతుంది. కానీ హిందుస్తానీ సంగీతం ఎన్ని వేల సంవత్సరాలు గడిచినా ఇగిరిపోని గంధం. ఇంకా ఇంకా అభివృద్ధి చెందుతుంది. అది నేటి యువత గ్రహిస్తే సంతోషం.

**సంగీతంతో రాళ్ళు కరుగుతాయి అంటారు. వర్షింపవచ్చు అంటారు. రెండు దేశాలలో మీకున్న అభిమానుల అండదండలతో పొరుగు దేశమైన పాకిస్థాన్‌తో మైత్రికి మీ లాంటి కళాకారులు ఎందుకు ముందుకు రాకూడదు?**

నేను పాకిస్థాన్ లో కూడా సంగీత కచేరీలు నిర్వహించాను. అసలు పాకిస్థాన్ అంటే ఎవరు? ఒకప్పటి మనవారే కదా! స్వాతంత్ర్యం తర్వాత రెండు దేశాలుగా ఏర్పడ్డాయి. పాకిస్థాన్ లోని ప్రముఖ సంగీత విద్వాంసులు ఆలపించేది హిందుస్తానీ సంగీతమే. అంటే మనదేశంలో పుట్టిందే. మన దేశంలో పుట్టిన సంగీతాన్ని రోజూ ఆ దేశంలో అక్కడ ఆలపిస్తూ మనదేశంతో వైరం ఎందుకు



## బిస్మిల్లాఖాన్ పొందిన అనేక పురస్కారాలు

1956- సంగీత నాటక అకాడమీ అవార్డు
1961- పద్మశ్రీ అవార్డు
1963- అఖిల భారతీయ షెహనాయ్ చక్రవర్తి
1965- తాన్‌సేన్ అవార్డు
1968- పద్మ భూషణ్
1980- పద్మ విభూషణ్
1986-మరాఠ్‌వాడా యూనివర్శిటి గౌరవ డాక్టరేట్
1988- విశ్వ భారతి శాంతినికేతన్ గౌరవ డాక్టరేట్
1989- బనారస్ హిందూ యూనివర్శిటి గౌరవ డాక్టరేట్
1994-భారత్ శిరోమణి అవార్డు
1995- మహాత్మా గాంధీ కాశీ విద్యాలయ పీఠ్ యూనివర్శిటి, వారణాసి గౌరవ డాక్టరేట్
2000 - గుప్తా అవార్డు
2001 - భారత రత్న అవార్డు

అన్నది నాకు అర్థం కాని విషయం. నాకు రాజకీయాల గురించి బొత్తిగా తెలియదు. ఈ విషయంలో ఇంతకంటే ఏమీ చెప్పలేను. నా వలన రెండు దేశాల మైత్రి ఏర్పడుతుంది అంటే నా వంతు బాధ్యత నెరవేర్చటానికి నేను సిద్ధంగా ఉన్నాను.

**వివాహ శుభకార్యాలలో ఎక్కువుగా షెహనాయ్ వాయిద్యం ఉంటుంది. దీనికి ప్రత్యేకత ఏమైనా ఉందా?**

షెహనాయ్ వాయిద్యం అంటేనే ఒక శుభ కార్యానికి సూచన. కలవాడు, లేనివాడు అందరూ శుభకార్యానికి సూచికగా షెహనాయ్ వాయిద్యానికే ప్రాధాన్యత ఇస్తారు. అక్బర్ పరిపాలనలో ప్రాతః కాలం నుండి రాత్రి వరకూ షెహనాయ్ వాయిద్యం రాజ దర్బార్ నుండి వినిపించేదట. ప్రాతఃకాలంలో విన్పించే షెహనాయ్ వాయిద్యం ద్వారా అక్బర్ నమాజ్ చేసుకుంటున్నాడని, ఆ తర్వాత విన్పించే వాయిద్యం బట్టి మంత్రులతో కొలువు తీర్చి పరిపాలనావ్యవహారాలు చూస్తున్నారని ఇలా రాత్రి వరకూ విన్పించే వివిధ రాగాలను షెహనాయ్ వాయిద్యం ద్వారా ప్రజలు అక్బర్ దినచర్యను తెలుసుకోగలిగేవారు. అలా ఉదయం రామ్‌కలి, గుణ్‌కలి రాగంలోనూ, మధ్యాహ్నం జోన్‌పురి, సారంగ్, సాయంత్రం ముల్తానీ, భీంపలాస్ రాత్రి వేళలలో మాల్కోస్ రాగాలలో షెహనాయ్ రాగాలలో సంగీతం వినిపిస్తుండేది అని అంటూ ఉంటారు.

**హిందుస్తానీ సంగీతం ప్రాముఖ్యత గురించి ఒక్కమాటలో చెప్పండి.**

హిందుస్తానీ సంగీతం గురించి ఎన్ని గంటలైనా విసుగు, విరామం లేకుండా మాట్లాడగలను. ఇది నాటి రాజుల కాలం నుండి వచ్చిందే. అంటే చరిత్ర ఆధారాల బట్టి 2000 సంవత్సరాల చరిత్ర గలిగింది. ఎందరో విద్వాంసులు హిందుస్తానీ సంగీతం సాధనచేసి పేరు ప్రఖ్యాతులు పొందారు. ఆ ప్రముఖులు గతించినా తర్వాత తరంలో కూడా ఎందరో ప్రముఖులు ఉద్భవిస్తున్నారు. వేలాది సంవత్సరాలుగా పారే ఒక జలపాతంలా సంగీతం ప్రవహిస్తుంది. ఈ సృష్టి ఉన్నంత వరకూ ఉంటుంది.

**నేటి యువ తరానికి మీ సందేశం...**

నేను చదువుకున్నవాడిని కాను. అందుకని నేటి యువతరం చక్కగా చదువుకోవాలని, చదువుతో పాటు సంగీతం కూడా అభ్యసించాలని నా సూచన, అంటూ ఇంటర్వ్యూ ముగించారు బిస్మిల్లాఖాన్.

- పర్చా శరత్ కుమార్

# పండిట్ బిస్మిల్లాఖాన్ గురించి క్లుప్తంగా...

బిస్మిల్లాఖాన్ వంశంలో ఐదు తరాల పూర్వీకులు షెహనాయ్ విద్వాంసులుగా పేరు ప్రఖ్యాతులు పొందిన వారే. బిస్మిల్లాఖాన్ తండ్రి పెగంబర్ బక్స్‌ఖాన్ పేరుపొందిన షెహనాయ్ విద్వాంసులు. అలాగే తాతగారు రసూల్ బక్స్‌ఖాన్, తాతగారి తాతగారు ఉస్తాద్ సాలార్ హుస్సేన్‌గార్లు కూడా షెహనాయ్ నవాజ్ బిరుదుతో కీర్తి నార్జించినవారే కావటంతో పాటు వారణాసిలో బిస్మిల్లాఖాన్ టెలిగ్రాఫిక్ అడ్రస్ కూడా "షెహనాయ్" కావటం ఓ విశేషం.

1916 మార్చి 21న బీహార్‌లో గల దుమ్రాన్‌లో జన్మించిన బిస్మిల్లాఖాన్ తమ ఆరవ ఏట బనారస్‌లో గల తన బంధువు ఉస్తాద్ అలీ బక్స్ వద్ద షెహనాయ్ శిక్షణ ప్రారంభించారు. వీరి సంగీత సాధన అంతా బెనారస్‌లో గల గంగానది వడ్డున, బాలాజీ ఆలయం, జారూ మందిర్, మంగళ మైమ్యా ఆలయాల్లోనే కొనసాగింది. పవిత్రమైన గంగానది ఒడ్డున గల మందిరాల వద్ద గల నా సాధనకు ఓ పవిత్రత చేకూరింది అని సగర్వంగా చెప్పుకునే బిస్మిల్లాఖాన్ విదేశాలలో గౌరవ పురస్కారాలతో సత్కరిస్తామని ముందుకు వచ్చిన అనేక అవకాశాలను తిరస్కరించారు. "గంగానది నా సంగీత సాధనలో ఒక భగవత్ అనుగ్రహంలా ఉపయోగపడింది" అని గర్వంగా చెప్పుకునే బిస్మిల్లాఖాన్ అమెరికాలో తనకోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన సన్మానసభలో "మా దేశంలో గల గంగను ఇక్కడకు తీసుకురాలేరు కదా" అంటూ ఆ గౌరవ పురస్కారాన్ని తిరస్కరించారు. తన ఆప్త మిత్రులు విజయ్‌భట్, శంకర్‌భట్ నిర్మించిన చిత్రం "గూంజ్ వుఠీ షెహనాయ్" అలాగే దక్షిణాది నిర్మాత విక్రమ్ శ్రీనివాస్ నిర్మించిన "సనాది అప్పన్న" కన్నడ చిత్రానికి తన షెహనాయ్ సహకారం అందజేసి ఆ రెండు చిత్రాలు సంగీత భరిత చిత్రాలుగా అఖండ విజయం సాధించటానికి దోహద పడ్డారు. ఆ తర్వాత సంగీత దర్శకునిగా అనేక చిత్రాలలో అవకాశం వచ్చినా 'ఆ వాతావరణం నాకు నచ్చదు' అంటూ సున్నితంగా తిరస్కరించారు.

1930లో తన 14 వ ఏట అలహాబాద్‌లో ఏర్పాటుచేసిన అఖిల భారత సంగీత సమ్మేళనంలో మొదటిసారిగా షెహనాయ్ కచేరి ప్రారంభించిన బిస్మిల్లాఖాన్ ఏడు దశాబ్దాలుగా దేశవిదేశాలలో అనేక కార్యక్రమాల ద్వారా ప్రశంసలు పొందారు. 1992లో టెహరాన్‌లో నిర్మించబడిన అధునాతనమైన ఆడిటోరియంకు బిస్మిల్లాఖాన్ పేరు పెట్టి సత్కరించారు. 1995లో అమెరికాలో జరిగిన ప్రపంచ సంగీత సమ్మేళనంలో అక్కడి అభిమానులు బిస్మిల్లాఖాన్ 80 వ జన్మదినోత్సవాన్ని ఘనంగా నిర్వహించారు.




కె.వి.రావు

## నటన ముందు -చావు తరువాత



శ్రీ నాగయ్య నటులు, గాయకులు, సంగీత దర్శకులు, నిర్మాత కూడా.

వారు నటించిన వాహిని చిత్రాలు వందేమాతరం (1939), సుమంగళి (1940), దేవత (1941), పోతన (1942). వేమన (1947), వారు నిర్మించిన త్యాగయ్య (1946), రామదాసు (1964), చిరస్మరణీయాలు. ఆయన అత్యధిక పారితోషికం తీసుకున్న నటులు కూడా.

కాని ఆయన తుదిరోజుల్లో ఏ పాత్రనైనా అంగీకరించేవారు. పారితోషికం గురించి నిర్మాత అడిగితే- "అదేం వుందండీ - ఆ భగవంతుడు మీకు ఎంత తోస్తే అంత ఇవ్వండి" అనేవారు.

ఒకానొక నిర్మాత తన చిత్రానికి మూడు వేల రూపాయలు ఇవ్వడానికి అంగీకరించారు. చిత్రం పూర్తయింది. ఇహ ఆయనకు 500/-లు మాత్రం బాకీ ఉంది.

ఈలోగా ఆయన హాస్పిటల్‌లో చేరారు. నిర్మాతకు కబురు పంపినా, డబ్బు పంపలేదు. వారిని చూడ్డానికి వెళ్ళిన సహాయ దర్శకుడితో-

"నాయనా! మీ నిర్మాత నాకు 500/- ఇవ్వాలి. అది ఇమ్మని చెప్పు. చిత్రం పూర్తి కాకుండా నేను చచ్చిపోను. సినిమాల్లో ఇన్ని చావులు చచ్చిన నాకు చావు అంత తొందరగా రాదు. డబ్బు పంపమనండి" అని ప్రాధేయపూర్వకంగా అడిగారు.

ఆ మాటలకు కన్నీరు పెట్టుకున్న సహాయ దర్శకుడు నిర్మాతను ఒప్పించి 500/- పంపేనాటికి వారు సంపూర్ణారోగ్యంతో ఇంటికి వచ్చేశారు.

## నత్తికి కోటా



ఒక నిర్మాత తను తాజా చిత్రాన్ని నిర్మిస్తున్నట్టు, తనకు రా ఫిలిం పర్మిట్ వెంటనే మంజూరు చేయవలసిందిగా ఛాంబర్‌కు దరఖాస్తు పెడుతూ, వెనకటి చిత్రం కన్నా 10 వేల అడుగులు ఎక్కువ కావాలని కోరాడు.

మంజూరుచేసే ఛాంబరు కొత్త చిత్రం ప్రారంభిస్తున్నందుకు సంతోషాన్ని ప్రకటిస్తూ, 10 వేల అడుగులు ఎందుకు అధికంగా కావాలో వివరంగా తెలపమని అడిగింది.

దానికి జవాబిస్తూ నిర్మాత తన గత చిత్రానికి దర్శకత్వం వహించి రాఫిలింను వృధా చేసినందుకు దర్శకుణ్ణితీసేసి, తాను దర్శకత్వం వహిస్తున్నాననీ, తనకు నత్తి వుండటం చేత, షూటింగు సమయంలో 'స్టార్ట్' 'కట్' అనేటప్పుడు ఆ మాటలు నోటివెంట రావడం ఆలస్యమై కెమెరామెన్ విని కట్ చేసేసరికి కొంత వృధా అవుతుందనీ, విశదీకరించాడు.

దానికి ఛాంబరు 'మీరు స్టార్ట్ అన్న తర్వాత ఆలస్యంగా కెమెరా స్విచ్ ఆన్ చేసినా ఫిలిం వృధా కాదు. ఎటొచ్చీ 'కట్' అన్నప్పుడు కొంత వృధా కావచ్చు. అంచేత 5 వేల అడుగుల్ని మాత్రమే మంజూరు చేయడమైనది, అని సమాధానం యిచ్చింది.



## బెదిరి పోయిన భర్త

ప్రభా ప్రొడక్షన్స్ వారి 'ఆడపెత్తనం' (1955) చిత్రంలో శ్రీ చదలవాడ శ్రీమతి కన్నాంబగారి భర్త వేషం వేశారు. అంతవరకూ, నౌకరు, చాకలి, మంగలి వంటి చిన్నచిన్న పాత్రలు ధరించే చదలవాడకు, ఆమె దగ్గరకు రావాలన్నా, ఆమెతో మాట్లాడాలన్నా, ఆమె పక్కన నిలబడాలన్నా బెదురు బెదురుగా వుండేది. తప్పించుకుతిరుగుతూ వుండేవారు.

అది గమనించిన శ్రీమతి కన్నాంబ దర్శకుడు ఆదుర్తి సుబ్బారావుతో-

"సుబ్బారావుగారూ! ఆయన వరసేం బాగాలేదు. ఆయన ఇలా చేస్తే నేను మరీ గయ్యాళిలా కనబడతాను. నా పాత్ర మీద సానుభూతి పోతుంది. అది మంచిది కాదు'' అన్నారు.

"అవునమ్మా, నాకూ అలాగే అనిపిస్తోంది. ఏం చెయ్యాలో తోచడం లేదు'' అన్నారు సుబ్బారావుగారు.

"మీరు మరోలా అనుకోకపోతే, నేనొకటి చేస్తాను. మన దారికి తీసుకు వస్తాను'' అన్నారు కన్నాంబ.

"అంతకన్నానా?'' అన్నారు సుబ్బారావుగారు.

ఓ రోజున సెట్‌లోకి రాగానే, ఆమె చదలవాడ పక్కన నిలబడి, ఆయన్ని చూడనట్లు సెట్‌లో అందరినీ-

"మా వారేరీ కనబడరేం? మీరు చూశారా?'' అని అడిగారు కాస్సేపాగి అటూ ఇటూ చూసి

"ఇదేవిటండీ! పక్కనే వుండి ఉలకరూ?'' అని చనువుగా ఆయన భుజం మీద తట్టింది. - భార్య భర్తను మందలించినట్టు! దాంతో చదలవాడకు బెరుకుపోయింది. ధైర్యం వచ్చింది. ఆ తర్వాత దర్శకుడూ, ఆమె ఆశించిన మేరకు నటించారాయన.

## నమ్మకం విలువ



అన్నపూర్ణా వారి 'చదువుకున్న అమ్మాయిలు' (1963) చిత్రంలో సావిత్రిగారిది ముఖ్యపాత్ర. (ఆ చిత్రంలో కృష్ణకుమారి, ఇ.వి.సరోజ మరో రెండు ముఖ్యపాత్రలు ధరించారు)

ఆ సమయంలో సావిత్రిగారు ఆమె వద్ద వున్న రొఖ్ఖం ఏభై వేల రూపాయలు ఓ సహాయ దర్శకుడికి యిచ్చి నేషనల్ ప్రైజ్ బాండ్స్ కొనమన్నారు. ఆ రోజే ఆమె నాగార్జునసాగర్ డామ్‌కు అవుట్‌డోర్ షూటింగుకు వెళ్లిపోయారు.

ఆ నగదును బాండ్స్‌గా మార్చి ఆమె షూటింగ్‌నుంచి రాగానే ఆ అయిదు కట్టలు (ఒక కట్టలో వంద రూపాయల విలువ గల బాండ్స్ వంద వుంటాయి) ఆమెకు ఇచ్చాడు.

ఆమె వాటిని మామూలు కాగితాల్లా తీసుకుని, లోపలకు పట్టుకువెళ్ళబోతుంటే - సహాయ దర్శకుడు.

"వాటిని లెక్కపెట్టండమ్మా!'' అన్నాడు.

"లెక్క పెట్టవలసిన అవసరం వస్తుందనుకుంటే అంత పెద్దమొత్తం మీకు ఇవ్వను గదండీ?'' అంది ఆమె.




నలభై ఏళ్లుగా సినీపరిశ్రమ తీరుతెన్నులపై
అధ్యయనం చేసిన రచయిత,

జర్నలిస్టు, నటుడు
## రావికొండలరావు
రాసిన వ్యాసమిది



# “తలనొప్పితో నటించవలసిన దృశ్యంలో నిజంగా తలనొప్పి వస్తే...?” అన్నారు ఎన్‌టిఆర్

“విజయచిత్ర” పుట్టి నాలుగో సంచిక (అక్టోబరు, 1966) అనుకుంటాను - యన్.టి.ఆర్. కవర్ పేజీతో వచ్చింది. లోపల ఆయన మేటరు వెయ్యాలి. మామూలుగా అయితే - ఆయనంత గొప్ప నటుడు, ఇంత గొప్ప నటుడు - అని రాయాలి. అందరికీ తెలిసిన విషయాలే కదా. అలా కాకుండా ఆయన చేతనే ఏదైనా సందేశం రాయిస్తే? అనిపించింది. అప్పుడే ఇంకోటి కూడా అనిపించింది. ఆయన రాత ముత్యాలు పేర్చినట్టుంటుంది. ఆయన చేతనే రాయిస్తే? - వెళ్లి విషయం చెప్పి, విన్నవించగానే “తప్పకుండా బ్రదర్” అన్నారు. ఆ మర్నాడు తెల్లవారు జామున రమ్మన్నారు. (ఎవరితో ఏ పని వున్నా, ఎవరికి ఏ పని వున్నా తెల్లవారు జామున నాలుగు, నాలుగున్నర గంటలకి రమ్మనే వారు. ఆ టైము - బ్రహ్మ ముహూర్తం - అన్నట్లు ఆయనకి మంచి టైము. అలా రమ్మన్న నటులు ఇంకెవరూ కనిపించరు!) అనుకున్నది రాసేశారు - చదివారు. ప్రేక్షకులకి కృతజ్ఞతలు రాశారు. సినిమాకి ప్రభుత్వం ఏం చేస్తోందనీ రాశారు. (తర్వాత ఆయనే ప్రభుత్వం అయ్యారు. ఆ విషయం అప్పుడు ఎవరికీ తెలీదు) “అన్నగారూ! చాలా బాగుంది. నల్ల రంగు సిరాగల పెన్ను, కాగితాలు, పాడ్ అన్నీ తెస్తాను. ఎప్పుడు తెమ్మంటారు?” అని అడిగితే, “తొమ్మిది గంటలకి వాహినీలో వుంటాను. రండి” అన్నారు. ఎవరిదో షూటింగు. తొమ్మిదో గంటకల్లా సెట్లో వున్నారు. “రండి బ్రదర్. మీ కోసమే చూస్తున్నాను” అని, కాగితాలు, పెన్నూ తీసుకుని “జాగ్రత్తగా పట్టుకో. అడిగినప్పుడు ఇయ్యి” అని తన ‘టచప్ బాయ్’ చేతికిచ్చారు. “ఖాళీ వున్నప్పుడు రాసేస్తాను. సాయంకాలం రండి” అన్నారు అన్నగారు. సాయంకాలం వెళితే, చాలావరకూ నల్లని ముత్యాలు పేర్చేశారు. ఇంకాస్త వుండిపోయింది. కూచోమన్నారు. పేజీ అంతా అయిపోయింది. చివర్లో అక్షరం తప్పు వచ్చింది. “కొట్టి వేయడం బాగుండదు. మళ్లీ రాస్తాను” అని మళ్లీ ముందునుంచి, పేజీ అంతా పట్టి పట్టి రాశారు. ఏం ఓపిక! ఏం చిత్తశుద్ధి! పూర్తి చేసి సంతకం పెట్టారు. చదవమన్నారు. చదివాను. “బాగానే వుందిగా, తప్పుల్లేవుగా” అన్నారు. “చాలా బాగుంది అన్నగారూ. అచ్చులా వుంది. మంచిరాత” అన్నాను ఏదో అనాలని... “ఆ రాతకేం - ఈ రాత బాగుండాలి ఎవరికైనా” అన్నారు నుదుటి మీద బొటన వేలు నడిపించి, ప్రశంసాహాసం చేశాను అన్నగారు అన్న చమత్కారానికి.

ఎన్.టి.ఆర్ - స్ట్రిక్ట్ డిసిప్లేనిరియన్. ఆ డిసిప్లిన్ ఇంకొకరి దగ్గర కనిపించదు. సొంత సినిమా అయితే ఇంకా స్ట్రిక్టు. అంచేత ఎప్పుడూ ఎక్కడా చమత్కారాలు, జోక్సు దొర్లే అవకాశం లేదు. ఎవరూ నోరెత్తడానికి లేదు. ఎప్పుడైనా, మూడ్ బాగుంటే, ఓ చిన్న బాణం వేస్తారు. ‘కులగౌరవం’లో నా పాత్ర మేడపై నుంచి దిగుతూ, సిగార్ కాలుస్తూ డైలాగు చెప్పాలి. డైలాగు క్షుణ్ణంగా చదువుకుని రెండు మూడు రిహార్సల్సు చేశాను. “టేక్” అన్నారు సీరియస్‌గా. (ఆ చిత్రానికి దర్శకుడు పేకేటి శివరామ్) నా గుండె దడదడమంటే, చేత్తో వారించాను. అంతకుముందు సిగార్ వెలిగించి, రిహార్సలు చెయ్యలేదు. దగ్గొస్తుందా? పొగ వస్తుందా? భయం. చుట్ట వెలిగించాను. పైన నించున్నాను. “పొగ బాగా రావాల” అని కిందనుంచి కేక పెట్టారు అన్నగారు. గుండె దడ ఎక్స్‌ప్రెస్ స్పీడులోకి వెళ్లి పోయింది! దేవుడి మీద కాకుండా అన్నగారి మీదనే భారం వేశాను. పొగ వదుల్తూ డైలాగు చెబుతూ చుట్ట పీలుస్తూ కిందకి దిగాను. “కట్” అని వినిపించింది ఎక్కడినుంచో అందరి వేపూ అటూ ఇటూ చూశారు అన్నగారు. ‘ఓ.కె.’ అన్నారు. “అమ్మయ్య” రెండో టేకు రాలేదు” అనుకుంది గుండె బ్రిడ్జి ఎక్కుతూ. “స్పెన్సర్స్ నుంచి తెప్పించాను ఆరు సిగార్స్. చాలా కాస్ట్లీ. ఆరు టేకులయినా వస్తాయేమోనని, సేఫ్టీకి తెప్పించాను. ఐదు మిగిలాయి.” అని పక్కకి చూసి “ఈ ఐదింటి ఖరీదు కొండల్రావుగారి అకౌంటులో వెయ్యండి” అన్నారు - చిరుచిరు మందహాసం తొణికిస్తూ. మూడ్ బాగుంది గదా అనుకుని నేనూ చిన్న చమత్కారం చేశాను. “ఆరు టేకులు వరకూ నాకు లెక్క వేశారు అన్నగారూ! అంచేత, ఐదు టేకులకి ఫిలిమూ, టైము ఆదా చేశాను గదా, మీరే నాకు ఎక్కువ ఇవ్వాలి” అన్నాను నవ్వుతూ. ఫకాలున నవ్వారు అన్నగారు. అంతే! మళ్లీ వెంటనే సీరియస్. “సైలెన్స్” అని అరిచారు ఆయనే. పిన్‌డ్రాప్ సైలెన్స్!



ఎన్నిరకాల పాత్రలో, ఎన్నెన్ని వేషాలో వేశారాయన, భిన్నవిభిన్నమైన నటన. కొన్ని సినిమాల్లో కామెడీ. మారువేషాలొస్తే కామెడీ. ‘అగ్గిరాముడు’ గుర్తుందా, ‘గులేబకావళి’ గుర్తుందా? ఇలాంటి మారువేషాలు కాకుండా గుండమ్మ కథ, పెళ్లిచేసి చూడు, అప్పుచేసి పప్పుకూడు, ఇంటిగుట్టు లాంటి సినిమాల్లో హాస్యమే ఒలికించారు అన్నగారు. నడక, మాటతీరు, ఎక్స్‌ప్రెషనూ అన్నీ మార్చేస్తారు.

కృష్ణుడయితే చిలిపి వాడు గనుక, చిన్న ఎక్స్‌ప్రెషన్‌తోనే నవ్విస్తారు... ఇంకోటుంది, హాస్యంగా చేస్తున్నప్పుడు మాత్రం సరదాగానే వుంటారు - ఏదో అంటూ వుంటారు - నవ్వుతూ వుంటారు - నవ్విస్తూనే వుంటారు.

ఆయనకి సిగరెట్టు అలవాటు లేదు. సీన్లో కాల్చవలసి వస్తే మాత్రం - రిహార్సిల్సులోనే పెట్టిలు ఊదేస్తారు. "నిర్దోషి"లో అలాగే చేస్తున్నారు "అలవాటు లేదు కదా, అలా సిగరెట్టు మీద సిగరెట్టు...." అని గొణిగాను. "గొంతులోకి వెళ్ళనివ్వను బ్రదర్... ఇక్కడే వుంటుంది" అన్నారు. ఆ సినిమాలో నేను డాక్టర్ని. ఆయనది తాగి వుండే పాత్ర. తాగినట్టు నటిస్తున్నారు. రిహార్సిల్సు అయిన తర్వాత "నిజంగా నాకు భయం వేసింది అన్నగారూ! నిజంగా తాగి వచ్చినంతగా ఫీల్ అయ్యాను" అన్నారు.

"బ్రదర్! మీకొకటి తెలుసా? తాగుడు సీను సహజంగానే వుండాలనుకుని, తాగివస్తే ఎవరైనా నటించగలరా? తలనొప్పితో నటించవలసి న దృశ్యంలో నిజంగా తలనొప్పి వస్తే - ఎక్స్‌ప్రెషనూ వుండదు, డైలాగే రాదు" అన్నారు ఆయన!

తనేమిటో తన పనేమిటో అంతే! ఒకరి గురించి పొల్లు మాటలు మాట్లాడ్డం, పనికిరాని కబుర్లు చెప్పడం - ఆయన ఒంటికి పడనివి.

రామారావు హీరోయే అయినా, కారెక్టర్ యాక్టర్. పౌరాణిక, సాంఘిక, చారిత్రక, జానపద చిత్రాలన్నిటా నటించగల ప్రజ్ఞాశాలి. నటుడే కాదు, దర్శకుడు, నిర్మాత, దేశాభిమాని. రాజకీయాలకి రాకముందు ప్రజా సంక్షేమ కార్యాలెన్నో చేశారు. ఆ ఓనమాలే ఆయనకి రాష్ట్ర సింహాసనం వరకూ చదివించాయి. ఐతే, అంతకుముందు ఆయనకి రాజకీయాలు తెలీవు. అక్కర్లేదు. ఆ రోజుల్లో మాలాంటి వాళ్లం షూటింగుల్లో ఖాళీగా వున్నప్పుడు ఏవో మాట్లాడుకునే వాళ్లం. "వీరాభిమన్యు" తీస్తున్న టైములో అందరం కలిసి, ఆ రోజు పేపర్లో వచ్చిన రాజకీయవార్తలు చర్చిస్తూ వుంటే - షాటు పూర్తి చేసుకుని వచ్చారు ఎన్.టి.ఆర్. "ఏమిటి?" అన్నారు. చెప్పాం. "ఎందుకు బ్రదర్ మనకి రాజకీయాలు? అవేం కూడెట్టాలా, గుడ్డెటాలా? మన పని మనం చేసుకుంటే చాలు. ఇండోనేషియాలో ఏం జరిగితే మనకెందుకు? నైజీరియాలో ఏం జరిగితే మనకెందుకు? మన పాత్రలు, మన నటన, మన కుటుంబాలూ చూసుకుంటే చాలు" అని మందలించారు, మందహాసంతో.

అలాంటి రామారావు ప్రపంచ విఖ్యాత రాజకీయ నాయకుడైనాడు! "అదీ జోక్" అంటాం. అది జోక్ కాదు - అకుంఠితమైన దీక్ష, కృషీ. అదీ ఎన్.టి.ఆర్!

# 'గుండమ్మ కథ'లో ఓ హాస్యదృశ్యం

**పనివాడి వేషంలో రామారావు బస్తా మోసుకుంటూ వచ్చి సోఫాలో బస్తా పడేస్తాడు. రమణారెడ్డి వెంట వస్తాడు. సూర్యకాంతం లబోదిబో మంటుంది.- రామారావు పనిమానేసి వెళ్ళి పోతానంటాడు.**



**రామారావు** : అసలు నేనిక్కడ ఉండనులే గుండక్కా.. నాకు పెళ్ళి మీద గాలి మళ్ళింది. పోతా

**సూర్యకాంతం**: ఒరే, ఒరే, ( ఆపమని రమణారెడ్డికి సైగ చేస్తుంది)

**రమణారెడ్డి** : (రామారావుని ఆపి)(ఆశ్చర్యంగా) ఒరే నీకు పెళ్ళా?

**రామారావు** : లేకపోతే ఎన్నాళ్ళు ఇలా పడి వుండమంటావ్, ఒంటరిగా?

**సూర్యకాంతం** : ఒరే, నువ్వుపోతే ఇంట్లో పనంతా ఎలాగురా? నీకు కడుపు నిండా బువ్వపెట్టిస్తా గానీ..ఇక్కడే పడి వుండరా

**రామారావు** : నాకు బువ్వా వద్దు, గివ్వా వద్దు! పెళ్ళి కావాలి

**రమణారెడ్డి** : (వెక్కిరిస్తూ ) నీకు పెళ్ళెందుకోయ్?

**రామారావు** : నువ్వెందుకు చేసుకున్నావ్?

**రమణారెడ్డి** : బుద్ధి లేక!

**రామారావు** : నేను అందుకే అనుకోరాదూ ! పెళ్ళి చేసుకుంటేనైనా బుద్ధి వస్తదేమోనని, (సూర్యకాంతంతో) ఇదిగో గుండక్కా..., నాకు పెళ్ళి చేస్తావా లేదా? చేస్తే ఉంటా! లేకపోతే పోతా!



**సూర్యకాంతం** : ఒరే, ఒరే..(రమణారెడ్డిని పిలుస్తూ) ఇదిగో అన్నయ్యా

**రమణారెడ్డి** : (అడ్డుపడి) బాబ్బాబు.. గడ్డం పట్టుకుంటా. మళ్ళీ నేనిప్పుడు ఇంకోణ్ణి ఏం వెతకను?

**రామారావు** : ఇదిగో గుండక్కా, మరి పెళ్ళి చేస్తావా?

**సూర్యకాంతం**: అలాగే చేస్తాలే. (ర.రెడ్డితో) ఇదిగో అన్నయ్యా.. వీడికో పిల్లను చూడు.

**రమణారెడ్డి** : (హేళనగా) వీడి కెవడిస్తాడు పిల్లను?

**రామారావు** : ఏం ? నీకంటే ఎదవనా నేను ? ఏం.. నీకిచ్చినోడు నాకెందుకు ఇవ్వడంట? (సూర్యకాంతంతో) ఇదిగో గుండక్కా నాకు పెళ్ళి చేస్తే నిన్ను డోలి కట్టుకుని తిరపతి కొండకు మోసుకుపోతా!

**రమణారెడ్డి** : (తీసిపారేస్తూ) తిరపతికి డోలి ఎందుకు లేవోయ్? బస్సులున్నాయి!

**రామారావు** : అరె, బస్సుల్లో ఎళితే మోక్షం రాదయ్యా !



# రామారావుగారూ-నేనూ

-డి.వి.నరసరాజు



**యన్.టి.ఆర్.తో- నా పరిచయ- స్నేహాల- వయసు 45 సంవత్సరాలు.**

ఆయనతో- నా ప్రథమ పరిచయం- 1951లో - విజయవాడలో- 'పాతాళభైరవి' శతదినోత్సవాలకు- 'విజయ' వారి బృందం- ఆంధ్ర పర్యటనకు- వచ్చినప్పుడు.

అప్పుడు- నా 'నాటకం' ప్రదర్శించాం- విజయవాడ- దుర్గాకళామందిరంలో.

ఆ తరువాత ఆరు నెలలకు- నేను- 'వాహినీ' సంస్థలో చేరాను- 'పెద్దమనుషులు' చిత్ర రచయితగా.

వయసులో- రామారావుగారి కంటె- నేను- మూడేళ్లు పెద్దయినా-

ఆయనకంటె- మూడు నాలుగేళ్ళు- ఆలస్యంగా- సినిమారంగ ప్రవేశం చేశాను.

ఏదో మాటల సందర్భంలో- "నరసరాజుగారూ! మీ వయసెంత?" అని అడిగారు.

"తొందరపడి- మీకంటె మూడేళ్లు ముందు పుట్టాను రామారావుగారూ!" అన్నాను. నవ్వుకున్నాం.

1951లో- ఆయన- నేను- విజయ- వాహినీ సంస్థలలో పని చేస్తుండడం వల్ల- అప్పుడప్పుడు కలుసుకుంటుండే వాళ్లం!

అది 'పరిచయమే'గాని- 'స్నేహం' అని చెప్పలేం.

ఆయన నటించిన చిత్రానికి- నేను స్క్రిప్టు రాసిన మొదటి చిత్రం- వాహినీ వారి- 'రాజ కుటుంబం'. బి.యన్.రెడ్డిగారి దర్శకత్వంలో.

ఆ తరువాత- 1961లో విజయావారి



'గుండమ్మకథ'- సురేష్- రామానాయుడుగారి- మొదటి చిత్రం. 'రాముడు-భీముడు' వగైరా చిత్రాలతో

రామారావుగారితో నా 'పరిచయం' క్రమంగా 'స్నేహం'గా పరిణమించింది.

మొదటిసారిగా- 'గుండమ్మకథ' పూర్తి స్క్రిప్టు చదివి వినిపించమని - చక్రపాణిగారు చెబితే -

విజయ ప్రొడక్షన్స్- చక్రపాణిగారి గదిలో- రామారావుగారికి- చదివి వినిపించాను.

అప్పుడు- యస్.వి.రంగారావుగారు- రామారావుగారి తమ్ముడు- త్రివిక్రమరావుగారు గూడా వున్నారు.

అప్పటినుంచి- ఆయన నటించే చిత్రానికి- ప్రొడ్యూసర్ ఎవరయినా సరే- నేను స్క్రిప్టు రాస్తే-

నా చేత- పూర్తి స్క్రిప్టు - చదివించుకుని- వినేవారు- రామారావుగారు!

నాకు నాటకానుభవం వుండడం వల్ల- డైలాగ్ వుచ్చారణ- ఏ పాత్రకు- ఎలా వుంటుందో- గమనించి- దానిని- అనుసరించే వారు- రామారావుగారు.

ఉదాహరణకి- ఆయన సొంత చిత్రం- 'కోడలు దిద్దిన కాపురం' పూర్తి స్క్రిప్టు చదివి వినిపించాను.

అందులో- ఆయనది- తాగుబోతు పాత్ర.

'తాగినవాడు ఎలా మాట్లాడతాడు'- అంటే- అంతవరకు- 'దేవదాసు'లో నాగేశ్వరరావుగారి డైలాగ్ డెలివరీయే ప్రమాణం.

'కోడలు దిద్దిన కాపురం' చదివేటప్పుడు- తాగినవాడి డైలాగులు- నేను మరోరకంగా చదివాను.

అది గమనించి- రామారావుగారు-

"ఏదీ! ఏదీ! మరొకసారి చదవండి" అన్నారాయన.

చదివాను!

"కొత్తరకంగా వుంది!" అని - ఆయన ఆ డైలాగ్ నేను చదివినట్టు- రిపీట్ చేశారు!

ఆ తరువాత- ఆ చిత్రం- షూటింగు ప్రారంభం రోజు వచ్చింది.

వాహిని స్టూడియోలో- బయట 'లాన్స్' మీద.

అతిథులంతా వున్నారు!

మొదటి షాట్- ఆయన 'కుక్క'కు సన్మానం చేసే సీను! తాగుబోతు డైలాగ్!

షాట్ అయిపోయింది!

అక్కడనుంచే- ఆయన- బిగ్గరగా-

"ఏం నరసరాజుగారూ డైలాగ్ కరెక్టేనా?" అని అడిగారు.

నేను "కరెక్ట్" అన్నాను.

"ఏమైనా మార్పు వుంటే యిప్పుడే చెప్పండి! సరిదిద్దుకుంటాను" అన్నారాయన- అంతమందిలో!

యీ విషయం- ఎందుకు చెబుతున్నానంటే-

ఆయనకు- 'కాంప్లెక్స్' వుండేది కాదు.

అంతమందిలో- డైలాగును గురించి రచయితను అడిగి తెలుసుకున్నందువల్ల- తనకు- చిన్నతనం- అనుకునేవారు కాదు ఆయన!

ఎవరు- ఏ 'సజెషన్' చెప్పినా - బాగుంటే వెంటనే- ఆమోదించేవారు.

యిందులో- చిన్న తిరకాసు వుంది!

'సజెషన్స్' ఎవరు చెప్పినా- స్వీకరించే వారా? అంటే-

ఒక చిన్న వుదాహరణ!

కొందరు అసిస్టెంట్సు -కొందరు కొత్త డైరెక్టర్లు గూడా- ఆయనకు- ఏదైనా-సజెషన్ చెప్పాలంటే- భయపడేవారు.

ఏదైనా చెబుదామని- సెట్‌మీద- దగ్గరకు పోయి- చెప్పబోతే- ఆయన- "ఏమి?" అని గద్దించి అడిగితే- వాళ్లు తగ్గి 'ఏమీ లేదండి' అని వెళ్లిపోయేవారు!

ఈ విషయం- నాకు- యిద్దరు ముగ్గురు అసిస్టెంట్స్- ఒకరిద్దరు డైరెక్టర్లుగూడా చెప్పారు.

నాకు ఆయనతో చనువు వుందిగనుక- ఒకసారి- ఆయనతో ప్రస్తావించి.

"ఎందుకు వాళ్లని అలా అదరగొడతారు?" అని అడిగితే-

ఆయన- "మీరు బలేవారే! నా బాధ మీకేం తెలుసు! నేను యాక్షన్- డైలాగ్- కరెక్ట్‌గా చెబితే- వాళ్లు వచ్చి- నాకు- తప్పుడు సజెషన్స్ యిస్తున్నారు! అప్పుడు నన్ను ఏం చేయమంటారు?" అని కాస్త తీవ్రంగా- జవాబు చెప్పారు!

అదీ నిజమే! నటుడుగా- డైరెక్టరుగా- ఆయన అనుభవం ముందు- వాళ్లు- (డైరెక్టరే అయినా) చిన్నవాళ్లే గదా! అనుకునే వాణ్ని.

'కోడలు దిద్దిన కాపురం' ప్రస్తావన వచ్చింది గనుక- ఆ చిత్రం గురించి కొన్ని జ్ఞాపకాలు!

అది- ఆయన సొంత చిత్రం!

ఆయన సొంత చిత్రానికి నేను రచన చేయడం అదే మొదటిసారి. 1967 చివరలో అనుకుంటాను!

తన సొంత చిత్రానికి స్క్రిప్టు రాయమని అడిగారు. సరేనన్నాను.

"ఎప్పటినుంచి కూర్చుందాం?" అన్నారు.

'మీ యిష్టం' అన్నాను.

"వచ్చే నెల- ఒకటో తారీఖు నుంచి! వరసనే 15 రోజులు"




"ఓకె."

"ఉదయం- 6 గంటల నుంచి- 9 గంటల వరకు".

"నా వల్లగాదు" అన్నాను.

"ఏం?" అన్నారాయన- ఆశ్చర్యంగా!

"నేను- నిద్రలేచేదే- ఆరు గంటలకి! ఒకవేళ- 5 గంటలకే- లేచాననుకోండి! మీ దగ్గరకు వచ్చి- కునికిపాట్లు పడతాను!

ఏదో ఒకరోజు- అర రోజు అయితే- ఫర్వాలేదు! వరసనే- 15 రోజులంటున్నారే!

రమ్మంటే వస్తాను! నాకేం అభ్యంతరం లేదు! వచ్చి- మీముందు- కునికి పాట్లు పడుతూ- కూర్చుంటాను!" అన్నాను... నవ్వుతూ.

"పెద్ద చిక్కే తెచ్చిపెట్టారే! నేను 3 గంటలకే లేస్తాను! 4 గంటలకు- పీతాంబరం వస్తాడు (మేకప్ చేయడానికి) మేకప్ రూంలో నుంచే - నాసొంత పనులు ప్రారంభిస్తాను. 6 గంటల నుంచి- 9 గంటలదాకా- ఆఫీసులో- నా సొంతపనులు చూచుకుంటాను.

9నుంచి- ఒంటిగంట దాకా- షూటింగ్, 2 గంటల నుంచి- రాత్రి 9 దాకా- రెండో షిఫ్టు షూటింగ్! మీకు తెలుసుగా!" అన్నారు!

"తెలియకేం? తెలుసు! కాని వున్న విషయం చెప్పాను" అన్నాను.

ఆయన ఒకటి రెండు నిముషాలు ఆలోచించి-

"దటీజ్ ఆల్‌రైట్ (అది ఆయన వూతపదం) ఆ 15 రోజులూ- మార్నింగ్ కాల్‌షీట్స్- కేన్సిల్ చేస్తాను.

మీరు ఎన్నిగంటలకు రాగలరు?" అన్నారు.

"ఎనిమిదిన్నర- లేక తొమ్మిది" అన్నాను.

"అయితే- తొమ్మిది నుంచి- 12 దాకా కూర్చుందాం."

"అలాగే"

మేమిద్దరం- ఆయన యింట్లో (మదరాసు- బజుల్లారోడ్డు) ఆఫీసురూంలో కూర్చుని మాట్లాడుకుంటున్నాం!

ప్రొడ్యూసర్లు- బయట వరండాలో కూర్చుని వున్నారు!

ఆ ప్రొడ్యూసర్ని లోనికి రమ్మని పిలిచారు. ఆయనొచ్చాడు!

"చిన్న చిక్కు వచ్చింది! వచ్చే నెల నుంచి- నా సొంత చిత్రం- ప్రారంభించాలి! నరసరాజుగారితో 15 రోజులు- రోజూ వుదయం- సిట్టింగ్స్" అని వున్న విషయం చెప్పి- "15 రోజులు- వుదయం కాల్‌షీట్స్ కేన్సిల్ చేస్తున్నాను! క్షమించాలి! యీ కాల్‌షీట్స్ తరువాత షెడ్యూల్స్‌లో- ఎడ్జస్టు చేస్తాను!" అన్నారాయన.

అందుకా ప్రొడ్యూసరు- "అలాగేనండి!" అని సంతోషంగానే ఒప్పుకున్నట్టు నటించి-

ఆ తరువాత- బయటికి వెళ్లిన తరువాత- నాతో-

"నా ప్రాణం మీదకి తెచ్చారుగదండీ" అన్నాడు.

"తరువాత షెడ్యూల్స్‌లో- ఎడ్జస్టు చేస్తానంటున్నారుగా!" అన్నాను.

"ఈయన- ఎడ్జస్టు చేస్తారు సరే! మిగతా ఆర్టిస్టుల కాంబినేషన్లు దొరకవద్దూ?" అని-

"అయినా- ఆయన సొంత పిక్చరుకోసం- అన్నప్పుడు తప్పదులెండి" అని సరిపెట్టుకున్నాడు ఆ ప్రొడ్యూసరు!

మదరాసులో రామారావుగారి యింట్లో- వారి ఆఫీసు గదిలో "కోడలు దిద్దిన కాపురం" కథాచర్చలు ప్రారంభమైనయ్.

రోజూ- తొమ్మిది గంటలకు- నా కారు నేనే డ్రైవ్ చేసుకుని వెళ్లే వాణ్ణి.

టైం విషయంలో- నేను చాలా 'పంక్చువల్' అని- ఆయనకు తెలుసు.

అందుకే- 8.55 నిమిషాలకు- ఆయన- తన ఆఫీసులో- ఎవరితో మాట్లాడుతున్నా-

గడియారం చూసుకుని-

"8.55 అయింది! 9 గంటలకి నరసరాజుగారు వస్తారు! యిక పదండి!" అని లేచి- తలుపుతీసి- వాళ్లతోపాటు- వరండాలోకి- రాగానే-

నాకారు- గేటులోంచి-లోపలికి వస్తుంటే- చూచి-

"అదుగో! చూశారా! నరసరాజుగారు వస్తున్నారు" అని వాళ్లను పంపించి- నన్ను గదిలోకి తీసుకువెళ్లేవారు!

9 నుంచి 12 వరకు- ఎంతో అర్జంటు అయితే తప్ప-

ఫోన్లు ఏమి వచ్చినా- తనను డిస్టర్బ్ చేయవద్దని- రుక్మాంగదరావుగారితో ముందే చెప్పివుంచేవారు.

(రుక్మాంగదరావుగారు - రామారావుగారి బావమరిది. ఆయనే- వారి ఆఫీసు వ్యవహారాలన్నీ చూస్తుండే వారు)

ప్రతిరోజూ- వుదయం- నేను రామారావు గారి

యింటికి వెళ్లేసరికి-

యింటిముందు దృశ్యం-

తిరుపతి ప్రయాణీకుల బస్సులు- రెండు! మూడు!

రామారావుగారి దర్శనార్థం!

నేను లోనికి వెళుతుంటే- నా కారు ఆపి- నన్ను బ్రతిమాలేవాళ్లు ఆ బస్సు డ్రైవర్లు-

"గంటకు పైగా అయింది సార్ వచ్చి. ఆడవాళ్లు- పిల్లలు! యింకా టిఫిన్లు గూడా చేయలేదు!

వారిని ఒకసారి బయటికి వచ్చి- దర్శనమివ్వమని చెప్పండి!" అనేవాళ్లు.

"తిరుపతి దేవుడి దర్శనం కాకపోయినా ఫర్వాలేదుగాని- మదరాసు తీసుకుపోయి- యన్.టి.రామారావుగారిని- చూపకపోతే- మీకు బస్సు డబ్బు పూర్తిగా యివ్వము" అని ప్రయాణీకులు- ముందే కండిషన్



వుండి- అడిగి- వెళ్లిపోయేవారు!

పిల్లాడు మాత్రం- కాసేపు ఒళ్లో కూర్చుని- మేము మాట్లాడుకుంటుంటే- డిస్టర్బ్ చేయకుండా- మధ్యలో- మెల్లగా- తలయెత్తి- తండ్రి చెవిలో- ఏదో గుసగుసలాడేవాడు.

రామారావుగారు విని-

"చూశారా నరసరాజుగారూ! బయట బస్సుల్లో- జనం వున్నారని చెబుతున్నాడు!

బహుశా- వాళ్లు- గుర్ఖా చేతిలో రూపాయో- అర్థో- పెట్టివుంటారు.

గూర్ఖా- వీడి రికమెండేషన్ అడిగి వుంటాడు. వీడు వచ్చి - నాకు రికమెండ్ చేస్తున్నాడు. వుండండి!" వాళ్లని పంపించి వస్తాను! అని- లేచి- కుమారుణ్ణి- ఎత్తుకుని- వెళ్లి వరండాలో నిలబడి- అభిమానులను రమ్మని- వాళ్లను పరామర్శించి- పంపించి- వచ్చేవారు!

ఇది- ఆయనకు- కొన్ని సంవత్సరాలు- దినచర్య-

పెడతారని- బస్సు కంట్రాక్టర్లు చెప్పేవాళ్లు!

నేను లోనికి వెళ్లేసరికి- రామారావుగారు ఒక్కరే కూర్చుని వుండేవారు ఆఫీసురూంలో- కథా చర్చలకు సిద్ధంగా!

"రామారావుగారూ! మన స్టోరీ డిస్కషన్ తరువాత ప్రారంభిద్దాం! ముందు- వెళ్లి- మీఫాన్స్‌ని- పంపించి రండి! పాపం! ఎండలో- బస్సుల్లో కూర్చుని వున్నారు" అనేవాణ్ణి.

ఆయన- 'దటీజ్ ఆల్‌రైట్' అని- లేచి వెళ్లి- తలుపు తీసుకుని- వరండాలో నిలబడి- గేటు వద్ద వున్న- గూర్ఖాకి-సైగజేసేవారు- వాళ్లని లోనికి పంపమని!

గూర్ఖా గేటు తీయగానే - బస్సులోంచి దిగి తిరుపతి ప్రయాణీకులు- ఆడ- మగ- బాల- యువ- వృద్ధులందరూ- తోసుకుంటూ- లోనికి వచ్చేవారు.

నేను- ఆయన వెనక- గది వాకిట్లో నిలబడి- చూస్తుండేవాణ్ణి.

ఆయన్ని చూస్తుంటే- వాళ్ల ముఖాల్లో ఎక్స్‌ప్రెషన్స్!

సాక్షాత్తూ- భగవంతుణ్ణి- ప్రత్యక్షంగా చూస్తున్నంత ఆనందం! భక్తి!

కొందరు నమస్కరిస్తూ- అలాగే- నోళ్లు వెళ్లబెట్టుకుని- ఆయన వంకే- చూస్తూ నిలబడితే- మరికొందరు- ఆయనకు- పండ్లు- పువ్వులు- యిచ్చి- సాష్టాంగ ప్రమాణాలు- చేసేవారు.

ఆయన- వారిని-

"మనది ఏవూరు? ఈ ఏడు పంటలు ఎలా వున్నయ్! మీరు ఏం చేస్తుంటారు?"

యీయన పూర్వజన్మలో- ఏం పుణ్యం చేసుకున్నాడో! లేకపోతే- యింతమంది- యిలా- భక్తి- అభిమానాలతో- పాదాభివందనాలు చేస్తారా?

మనం- "వంద రూపాయలిస్తాను! పాదాలకు నమస్కరించమంటే - ఒక్కడూ చేయడే" అనుకునేవాణ్ణి!

ఒక్కొక్కరోజు- ఒకసారి ఆయన- అభిమానుల్ని- పరామర్శించి- పంపించి- వచ్చిన తరువాత- గదిలో- కథాచర్చలు- ప్రారంభించేవాళ్లం!

మళ్లీ- ఒకటో- రెండో- బస్సులు వచ్చేవి!

రామారావుగారి ఆఖరి కుమారుడు - అప్పుడు చాలా చిన్నవాడు- మూడు నాలుగేళ్లుండేవేమో! మెల్లగా- తలుపు తీసుకుని- లోనికి వచ్చేవాడు.

నేరుగా వెళ్లి- తండ్రి ఒడిలో కూర్చునేవాడు!

"చూశారా నరసరాజుగారూ- వీడి చొరవ!" అనేవారు రామారావుగారు!

నిజమే! ఆయన కుమారులుగాని- కుమార్తెలుగాని- ఎవరూ- అంత చొరవగా- దగ్గరకు వచ్చేవారు కాదు! ఏదైనా కావాలంటే- తలుపు దగ్గరే

"కోడలు దిద్దిన కాపురం" కథాచర్చలు 1967 డిసెంబరు ఆఖరుకు- ముగిసినయ్!

రిలీజుకు ముందు- "కోడలు దిద్దిన కాపురం" సెన్సారు విషయంలో కొంత గొడవ జరిగింది.

సెన్సారు సభ్యులు- చిత్రం చూస్తున్నారు- యింటర్వెల్‌లో- సభ్యులు బయటకు- వస్తూనే చాలా కోపంగా కనిపించారట!

సినిమాలో- సత్యసాయిబాబాను కించపరిచినట్టు ఫీలయి- చాలా కోపంతో-

పిక్చరు 'బ్యాన్' చేయిస్తామంటూ- కొందరు కేకలు వేశారట!

సభ్యులు- వారివారి రిపోర్టులు- సెన్సారు ఆఫీసరుకు యిచ్చి వెళ్లిపోయారు!

మరునాడు- ప్రొడ్యూసరును రమ్మని- సెన్సారు ఆఫీసు నుంచి కబురు!

విషయం తెలిసిన రామారావుగారు- తాను వెళ్లకుండా- నన్ను- పిక్చరు డైరెక్టరు- యోగానంద్‌గారిని- సెన్సారు ఆఫీసుకు పంపారు.

డి.రామలింగంగారు- అసిస్టెంటు సెన్సారు ఆఫీసరు! తెలుగు చిత్రాలు ఆయనే చూసేవారు.

మాకు బాగా పరిచయం.

వెళ్లగానే- చిరునవ్వుతో- "చాలా చిక్కుల్లో పడేట్టున్నారు- నరసరాజుగారూ" అన్నారు.

"ఏం?" అన్నాను.

"దాదాపు- సెన్సారు బోర్డు సభ్యులందరూ- ఏకగ్రీవంగా- అభ్యంతరం పెడుతూ- రిపోర్టులు రాసి యిచ్చారు" అని-

వాళ్ల పేర్లు చూపకుండా- రిపోర్టులు మాత్రం చూపించారు.

"అయితే- యింతకూ ఏమంటారు?" అన్నాను.

"బ్రతికి వున్న ఏ మనిషితోనైనా- పోలికలు గల పాత్రను సృష్టించి- గేలిచేయగూడదు" అని సెన్సారు రూల్సులో వుంది" అని- రూల్ చూపించారు!

"పిక్చరులో- స్వాములవారి పాత్రకు- సత్యసాయిబాబా

పోలికలున్నాయని- సభ్యుల అభ్యంతరం" అన్నారాయన.

నేనన్నాను- "అసలు పోలిక అంటే ఏమిటి?" నిర్వచించాలిగదా.

ఏ వ్యక్తినైనా విమర్శించ దలుచుకున్నప్పుడు- ఆ వ్యక్తిని- ప్రేక్షకులకు- స్ఫురింప చేయడం కోసం- కొన్ని ప్రయత్నాలు చేస్తాం!

ఆ ప్రయత్నాలు- ఏమిటంటే-

ఒకటి- ఆ వ్యక్తి- పేరుకి దగ్గరగా వున్న- పేరు- పాత్రకి పెట్టడం! అటువంటి ప్రయత్నం మేమేమీ చేయ లేదు!

ఏదో 'బాబా' అని పెట్టకుండా- ఏదో 'ఆనంద స్వాముల వారు' అని పేరు పెట్టాం!



రెండు! దుస్తులతో- పోలికకు ప్రయత్నం చేయలేదు!

మా స్వాములవారికి- పైజమా- లాంగ్‌కోటు వేశాం! బాబా డ్రెస్సుకు దీనికి ఏమీ సంబంధం లేదు!

మూడు: భాష!

డైలాగుల విషయంలో- 'బాబా' గారి వుపన్యాసాల- భాషను అనుకరించడానికి- మేము ప్రయత్నించలేదు.

నాలుగు: వుచ్చారణ! డైలాగుల వుచ్చారణలో గాని- హావభావాలలో గాని- నడకలోగాని- అనుకరించడానికి ప్రయత్నించలేదు.

రూపంలో గూడా- బాబాను పోలిన వ్యక్తిని ఎన్నుకోలేదు.

బాబాకంటే- సత్యనారాయణ చాలా పొడగరి!

యిలా- పది-పదకొండు- విషయాలు వుటంకించి- వీటిలో- ఎక్కడా- బాబాను స్ఫురింపజేయడానికి మేము ప్రయత్నించలేదు!

యిక- మీరు చెప్పగలిగిన- ఒకే ఒక్క పోలిక- తలపైన విగ్గు! అది- అసలు మావిగ్గు! సినిమా విగ్గు! 'బాలనాగమ్మ' సినిమాలో - మాయలమరాఠీ విగ్గు!

యిప్పుడు మేము కొత్తగా సృష్టించింది కాదు... బాబాగారి జుట్టును పోలి వుండటం- కేవలం- యాదృచ్ఛికం! కోయిన్సిడెన్స్!

కాబట్టి-బాబాగారిని గేలి చేయడం కోసం- మేము పాత్రను సృష్టించామనడం- 'అబద్ధం!'

పైగా- బాబాగారంటే- మా ప్రొడ్యూసరు రామారావుగారికి- చాలా గౌరవం!" అన్నాను.

"మీరు చెప్పిన ఆర్గుమెంట్స్ అన్నీ వ్రాసి యివ్వండి! సెంట్రల్ సెన్సారు బోర్డు - బొంబాయికి పంపుతాను" అన్నారు సెన్సారు ఆఫీసరు! అలాగే- అక్కడ కూర్చుని వ్రాసి యిచ్చాను.

సెంట్రల్ బోర్డుకు పంపారు!

సెంట్రల్ బోర్డు- మా వాదనలతో- పూర్తిగా ఏకీభవించి- పిక్చరుకు- క్లీన్ సర్టిఫికెట్ యిచ్చారు!

'కోడలు దిద్దిన కాపురం' చిత్రంలో- మరో విశేషం-

చిత్రంలో హీరో- రామారావుగారు- కోటీశ్వరుని కుమారుడు! అందువల్ల 'రిచ్'గా కనబడాలిగదా!

కేవలం దుస్తుల్లోనేగాక- ఆభరణాలలో గూడా- రిచ్‌నెస్ వుండాలని-

రామారావుగారు- తన పాత్రకు- నడుముకు కట్టుకునే బెల్టు- రిస్ట్‌వాచ్ గొలుసు-

కుడి- ముంజేతికి పెట్టుకునే- గొలుసు- అన్నీ- నిజమైన బంగారంతో- రాళ్లు పొదిగించి- చేయించారు- మదరాసులో- ప్రఖ్యాత నగల వర్తకులు- ఉమ్మిడియార్స్‌లో- ఆర్డరిచ్చి మరీ చేయించారు.

ఏడాది క్రితం- సకుటుంబంగా- హైదరాబాద్‌లో- వారి యింటికి- బ్రేక్‌ఫాస్ట్‌కు వెళ్లినప్పుడు.

మా అమ్మాయి- రామారావుగారిని అడిగింది- 'కోడలు దిద్దిన కాపురం'లో మీ కేరక్టరుకు- నిజమైన బంగారు నగలు చేయించారని- చెప్పుకునేవారు! నిజమేనా" అని.

"నిజమే!" అన్నారు రామారావుగారు- చిరునవ్వుతో!-

1980లోనో- 81లోనో- రామారావుగారికి- వూటీలో- షూటింగ్‌లో- చిన్న యాక్సిడెంట్ జరిగి- చెయ్యి ఫ్రాక్చర్ అయింది!

కట్టు కట్టుకుని (మదరాసులో)- యింట్లో కూర్చుని వుంటే- చూద్దామని వెళ్లాను.

యిండస్ట్రీకి సంబంధించిన వాళ్లు-చాలా మంది- వచ్చి వెళుతున్నారు.

చాలా రద్దీగా ఉంది.

కాసేపు కూర్చొని- "వస్తాను! రామారావుగారూ" అని లేచాను.

"అప్పుడే వెళతారా?" అన్నారాయన!

"ఎందుకు? చాలామంది వున్నారు!...."

"ఎప్పుడూ మీతో కాస్త కాలక్షేపం చేసే అవకాశం రాదు! ఎప్పుడూ- షూటింగులే!" అని నవ్వుతూ

"యిప్పుడు- యీ అవకాశం వచ్చింది! సద్వినియోగం చేసుకుందాం!

వీలు వున్నప్పుడు- రండి" అన్నారు.

"నేను ఎప్పుడయినా- వీలు చేసుకోగలను! మీరే బిజీ! ఎప్పుడూ- వచ్చే వాళ్లు- పోయేవాళ్లు!" అన్నాను.

"నిజమే!" అని క్షణం ఆలోచించి- "రేపు- ఎవరూ లేకుండా చూచుకుని- ఫోన్ చేస్తాను! రండి" అన్నారు.

మరునాడు ఫోన్ చేశారు!

వెళ్లాను.

మేడమీద ఒక్కరే కూర్చుని వున్నారు! భార్య-బసవతారకం గారు- యిద్దరికీ- కాఫీ యిచ్చారు!

ఏవో కబుర్లలో పడ్డాం!

కుటుంబం కబుర్లు! పిల్లలు- చదువులు! సంసారం- సమస్యలు!

అంతకుముందే- 1980- జనవరిలో- నా భార్యపోయింది.

భార్యాభర్తలు- అనురాగాలు- అనుబంధాలు- బాధ్యతల గురించి-

వేదాంత ధోరణిలో- కాసేపు మాట్లాడుకున్నాం! మధ్యమధ్యలో-

"భార్యాభర్తల- అసలైన దాంపత్యం- 60 ఏళ్ల తరవాతనే!

యవ్వనంలో- భార్యాభర్తలు- ఒకరి నుంచి ఒకరు ఏదో ఒకటి ఆశిస్తారు.

60 ఏళ్ల తరువాత- ఒకరు- రెండోవారికి- ఏం చేద్దామా? ఎలా సుఖపెడదామా అని చూస్తారు.

వృద్ధాప్యంలో తాను బ్రతికుండగానే- భార్య తనకంటే ముందుపోతే- అదృష్టవంతురాలు అని భర్త అనుకుంటాడు.

తను వుండగానే- భర్త ముందు పోతే అదృష్టవంతుడు- అని భార్య అనుకుంటుంది".

యిలా- చెప్పుకుంటూ పోతున్నాను.

"యివన్నీ- ఎక్కడివి! ఎందులో రాశారు?" అని అడిగారు రామారావుగారు!



'బస్తీలో బహుకుటుంబీకుడు' అనే పేరుతో- రేడియో సీరియల్ రాశాను! బ్రాడ్‌కాస్ట్ అయింది" అన్నాను.

"టేప్ దొరుకుతుందేమో కనుక్కుంటారా? విందాం" అన్నారాయన.

"టేప్ ఎందుకు? నా దగ్గర మాన్యుస్క్రిప్ట్ వుంది! మీరు వింటానంటే- చదివి వినిపిస్తాను" అన్నారు!

మరునాడు- మాన్యుస్క్రిప్టు తీసుకువెళ్లి- 8 భాగాలు- చదివి వినిపించాను!

మొదటి భాగాల్లో- హాస్యం పాలు ఎక్కువ వున్నా- చివరి నాలుగు భాగాల్లో- సెంట్‌మెంటు ఎక్కువగా ఉంది.

అప్పుడు- నా భార్య - పక్షవాతంతో- హాస్పిటల్లో- 1 1/2 సంవత్సరాలు వుంది.

అందువల్ల- నా సబ్జక్టివ్ ఎలిమెంట్- ఆత్మాశ్రయ గాథ కొంత వుంది- అందులో!

కొన్ని సందర్భాలలో- చదువుతూంటే- రామారావుగారు- కంట తడిపెట్టుకున్నారు!

అంతా చదివిన తరువాత అన్నారు-

"సినిమా తీస్తే- చాలా బ్రహ్మాండంగా వుంటుంది! యిప్పుడు- నాకు 10-12 లక్షలు యిచ్చి- ఈ ముసలి వేషం వేయించి- ఏ ప్రొడ్యూసరు తీస్తాడు సినిమా!?

మనమే తీద్దాం! సినిమాకు ఎడాప్టు చేసి రాయండి" అన్నారు.

అలాగే- సినిమాకు ఎడాప్టు చేసి పూర్తిగా స్క్రిప్టు రాశాను!

1982 జనవరిలో - స్క్రిప్టు ఫైనలైజ్ చేశాం!

అనుకోకుండా- అదే సంవత్సరం- మార్చిలో- ఆయన- రాజకీయ రంగప్రవేశం చేశారు!

'పుణ్యదంపతులు' స్క్రిప్టుగా- అలాగే యిప్పటికీ- మిగిలిపోయింది.

('అక్షింతలు' నుండి - ఈనాడు సౌజన్యంతో)

















**మహానటుడు యన్.టి.రామారావు**
**ప్రాణప్రతిష్ట చేసిన కొన్ని పద్యాలు,**
**శ్లోకాలు,దండకాలతోపాటు**
**మరికొన్ని అరుదైన అందాల గీతాలు...**



## నర్తనశాల

సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి. గానం : ఘంటసాల. మూలం: భారతం

సీ॥ ఎవ్వాని వాకిట ఇభమద పంకంబు
రాజభూషణ రజోరాజినడగు
ఎవ్వాని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
ఎవ్వాని కడకంట నివ్వటిల్లెడుచూడ్కి
మానిత సంపదలీనుచుండు
ఎవ్వాని గుణలత లేడు వారాసుల
కడపటి కొండపై కలయబ్రాకు
తే॥ అతడు భూరిప్రతాప మహాప్రదీప
దూర విఘటిత గర్వాంధకార వైరి
వీరకోటీరమణి ఘృణి వేష్టితాంఘ్రి
తలుడు కేవల మర్త్యుడే ధర్మసుతుడు

## నర్తనశాల

సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి. గానం : ఘంటసాల. మూలం: భారతం

సీ॥ కాంచన మయ వేదికా కనత్కేతనోజ్జ్వల
విభ్రమమువాడు కలశజుండు
సింహలాంగూల భూషిత నభోభాగ
కేతు ప్రేంఖణమువాడు ద్రోణసుతుడు
కనక గోవృషసాంద్ర కాంతి పరిస్ఫుట
ధ్వజ సముల్లాసంబువాడు కృపుడు
లలితకంబు ప్రభాకలిత పతాకా
విహారంబువాడు రాధాత్మజుండు
తే॥ మణిమయోరగ రుచి జాల మహితమైన
పడగవాడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖరఘన తాళతరువగు సిడమువాడు
సురనదీ సూనుడు ఏర్పడ జూచికొనుము

## నర్తనశాల

సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి. గానం : ఘంటసాల. మూలం: భారతం

సీ॥ ఏనుంగు నెక్కి, పెక్కేనుంగు లిరుగడ రా
పురవీధుల గ్రాలగలదె
మణిమయంబైన భూషణజాలముల నొప్పి
యొడ్డోలగంబున నుండగలదె
కర్పూరచందన కస్తూరి కాదుల నింపు
సొంపార భోగింపగలదె
అతి మనోహరలగు చతురాంగనల తోడి
సంగతి వేడ్కలు సలుపగలదె
తే॥ కయ్యమున నోడిపోయిన కౌరవేంద్ర
వినుము నాబుద్ధి మరలి, యీతనువువిడిచి
సుగతి వడయుము తొల్లింట చూఱగలదె
జూద మిచ్చట నాడంగరాదు సుమ్ము.

## పాండురంగ మహత్మ్యం

సంగీతం: టి.వి. రాజు పాడినది : ఘంటసాల

ఏపాదసీమ కాశీప్రయాగాది ప
విత్ర భూములకన్న విమలతరము
ఏపాదపూజ రమాపతి చరణాబ్జ
పూజలకన్నను పుణ్యతమము
ఏపాదతీర్థము పాప సంతాపాగ్ని
ఆర్పగా జాలిన అమృతఝరము
ఏపాదస్మరణ నాగేంద్రశయను
ధ్యానమ్ము కన్నను మహానందకరము
అట్టి పితరుల పదసేవ ఆత్మ మరచి
ఇహ పరమ్ములకెడమై తపించువారి
కావగలవారు లేరు లేరు యీజగాన వేరే
నన్ను మన్నించి బ్రోవుమో అమ్మా... నాన్నా.

## దండకం

శ్రీ కామినీ కామితాకార సాకార కారుణ్యధారా నవాంకూర సంసార సంతాప నిర్వా పణా - పాప నిర్వాపణోపాయ నామ ప్రశంసానుభావా భవా భావ హే వాసుదేవా - సదా నంద గోవింద సేవించుమావిందవై డెందమానంద మొందింప ఎందున్ విచారంబు లేమిన్ - వచోగోచరా గోచరత్వంబు లూహింప లేమైతిమో దేవా - నీపాద సేవాదరంబున్ మదిన్ గోరుచున్ వేదవాదుల్ శమాదుల్ కడుంజాల నార్జించి భోగేచ్ఛ వర్జించి నానాతపశ్చర్య తాత్పర్య పర్యాకు లత్వంబునన్ గైకొనన్ మాకునే యత్నముల్ లేకయే నీకృపాలోక సంసిద్ధి సిద్ధించుటల్ బుద్ధి తర్కింప నత్యంత చిత్రంబుగాదే జగన్నాథ,
ఈరీతి చెన్నార మున్నే ఋషుల్ నిన్ను గన్నార కన్నారు - నా కన్ను లెన్నంగ యే పుణ్యముల్ జేసెనో నిన్ను దర్శింపగా - భవ్య యోగీంద్ర సాంద్రాదరా - కాంక్షితైకాంత సంసేవనా - భావనాతీత - కల్యాణ నానా గుణ శ్రీ సముద్భాసితాంగా - దయాపూర రంగత్త రంగాంతరంగా నమో రుక్మిణీసంగా - హే పాండురంగా ...

నమస్తే - నమస్తే - నమః

## భీష్మ

సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: ఘంటసాల మూలం: భాగవతము

కుప్పించి ఎగసిన కుండలంబుల కాంతి
గగనభాగం బెల్ల గప్పి కొనగ
ఉరికిన నోర్వక ఉదరంబులోనున్న
జగముల వ్రేగున జగతి కదల
చక్రంబు చేపట్టి చనుదెంచు రయమున
పైనున్న పచ్చని పటము జార
నమ్మితి నాలావు నగుబాటు సేయకు
మన్నింపుమని క్రీడి మరల తిగువ
కరికి లంఘించు సింగంపు కరణి మెరసి
నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు
విడువు మర్జునా యని నాడు విశిఖవృష్టి
తెరలి చనుదెంచు దేవుండు నాకు దిక్కు

## సీతారామ కళ్యాణం

సంగీతం: గాలిపెంచల నరసింహారావు (1) పాడినది : ఘంటసాల.

జయత్వద భ్రవిభ్రమ
భ్రమ ద్భుజంగ మస్ఫుర
ధ్ధగ ధ్ధగ ద్వినిర్గమ
త్కరాళ ఫాలహవ్యవాట్
ధ్ధిమి ధ్ధిమి ధ్ధిమిధ్వనన్
మృదంగ తుంగ మంగళా
ధ్వనిక్రమ ప్రవర్తిత
ప్రచండ తాండవశ్శివహో
ఓం నమః శ్శివాయ
అగర్వ సర్వమంగళా కళా కదంబ మంజరీ
రస ప్రవాహమాధురీ విజృంభణా మధువ్రతం
స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం
గజాంతకాంధ కాంతకం తమంత కాంతకం భజే
ఓం నమః హరాయ
ప్రఫుల్లనీల పంకజ ప్రపంచకా విమచ్ఛటా
విడంబి కంఠకంధరా రుచి ప్రబంధ కంధరం
స్మరఛ్ఛిదం పురఛ్ఛిదం భవఛ్ఛిదం మఖఛ్ఛిదం
గజఛ్ఛికాంధ కఛ్ఛిదం తమంత కఛ్ఛిదం భజే

### 2

పరమ శైవాచార పరులలో నత్యంత
ప్రియుడన్న యశము కల్పించినావు
తల్లికోరిక దీర్చ దలచి వేడగ ఆత్మ
లింగమ్ము ప్రేమ నొసంగి నావు
ముసు కుబేరుడు దోచుకొనిన లంకాపురీ
విభవమ్ము మరల యిప్పించినావు
తలచుటే తడవుగా దర్శన భాగ్యమ్ము
కరుణించి నీడవై కాచినావు
స్వామీ భవదీయ దర్శనోత్సాహి నగుచు దరియ
యీవేళ యీ నిషేధమ్ము లేల
వైర మేలయ్య మరచి నా నేరములను
కరుణ గనవయ్య కైలాస గిరినివాస.

### 3

హే పార్వతీనాథ కైలాస
శైలాగ్రవాసా
శశాంకార్ధ మౌళి ఉమాదేవతో
ల్లాసీ సవ్యాంగ భాగా
శ్రితానందదాయి స్మితా పాంగా
భస్మీకృతానంగ గంగాధరా
సర్వసంతాప హరా హరా
శివా సదాశివా - నీయున్న చందంబు నేనెంత
యూహింపగా వచ్చు - వేదములున్నీ వ వాదమ్ములున్నీ వ
ధైర్యంబులున్నీ వ మర్మంబులున్నీ వ
సర్వంబులున్నీ వ - నీ లెంకనైనట్టి దాసుండనైనట్టి
నన్నున్ దయాళుండవై ప్రీతి రక్షింపవే
తప్పు సైరింపవే దేవ మన్నింపవే - దేవదేవా మహాదేవ దేవ
నమస్తే నమస్తే నమః

## సీతారామ కళ్యాణం

సంగీతం: గాలిపెంచల నరసింహారావు (4) పాడినది : ఘంటసాల.

దానవకుల వైరి దర్పంబు వర్ణించు
చదువు లెవ్వరుగాని చదువరాదు
సురపక్షపాతి విస్మరణకై గావించు
యాగంబు లేవియు సాగరాదు
అమరుల మేలుకై ఆచరించెడి యజ్ఞ
గుండంబులం దగ్ని మండరాదు
హర నామమేగాని హరి నామధేయంబు
త్రిజగాల నెవ్వరు స్మరించరాదు

అమరలోక విజేత లంకాధినేత
రావణుని శాసనంబు నిరాకరించు
విష్ణుదాసుల బట్టి కేల్ విరచికట్టి
చెఱను నెట్టుడు దానవ శ్రేష్ఠులారా!

### 5

నెలత యిటువంటి నీమాట నీదు పాట
నీ వలపుచూపు నీ నడల్ నెమ్మి వినగ
కనగ దొరకునే సామాన్య కాముకునకు
బహు తపంబులు గావించి బడయకున్న.

### 6

జనకుండు సుతుడును జన్మంబు చేసిన
వనితా వారేమి కావలయు నీకు
అన్నదమ్ములు సోమయాజులై వెలసిన
లలనా వారేమి కావలయు నీకు
బావయు మరదియు బవరాన గూలిన
చెలువా వారేమి కావలయు నీకు
అల్లుండు మామయు అని త్రెళ్ళి వచ్చిన
పొలతీ వారేమి కావలయు నీకు
వావి వరుసలు గణియింప వచ్చి తేని
పడతీ మాతోడ మాటాడ వశమె నీకు
చాలు ఇక చాలు వెర్రి వాదాలు మాని
వగలు దీరిచి ఏలవే చిగురుబోణీ.

## భీష్మ

సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: ఘంటసాల

నా జన్మంబు తరింప చేసెద ప్రతిజ్ఞన్
దిక్కృతుల్ సాక్షిగా
రాజై ఏలగ నాకు గల్గు నధికారంబున్
విసర్జింతునీ
రాజీవాక్షి సుతుండు వాని సుతులున్
రాజ్యంబు పాలింపనే
నీ జన్మాంతము బ్రహ్మచారినయి
సేవింతున్ సదా రాజ్యమున్

## పాండవ వనవాసము

సంగీతం, గానం : ఘంటసాల.

ఉ॥ ధారుణి రాజ్య సంపద మదంబున గోమలి గృష్ణ జూచి రం
భోరు నిజోరు దేశమున నుండగ బల్చిన యిద్దురాత్ము దు
ర్వార మదీయ బాహుపరివర్తిత చండ గదాభి ఘాత భ
గ్నోరు తరోరు జేయుదు సుయోధను ఉగ్ర రణాంతరంబునన్.

మ॥ కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ సూచుచుండన్ మధో
ద్ధురుడై ద్రౌపదినిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఘర ముర్వీపతి సూచుచుండ అని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

-- 0 --

శ్లో॥ మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానర యూధ ముఖ్యం
శ్రీరామదూతం శిరసానమామి॥

శ్లో॥ భజే రమ్య రంభావని నిత్యవాసం
భజే బాల భాను ప్రభా చారుభాసం
భజే చంద్రికా కుంద మందార హాసం,
భజే సంతతం రామ భూపాల దాసం॥

దండకము:
జయ జయ మహా సత్వబాహో మహా వజ్రదేహో
పరీభూత సూర్యా కృతామర్త్య కార్యా
మహావీర, హంవీర, హేమాద్రి ధీరా
ధరాజాత. శ్రీరామ, సౌమిత్రి సంవేశ్థితాత్మా మహాత్మా
నమో వాయుపుత్రా నమో సచ్చరిత్రా
నమో జానకీ ప్రాణదాతా భవిష్యద్విధాతా
హనూమంతా కారుణ్య వంతా ప్రశాంతా
నమస్తే నమస్తే నమస్తే నమః॥

శ్లో॥ శ్రీరామచంద్రం శ్రితపారిజాతం
సలక్ష్మణం భూమి సుతా సమేతం
లోకాభిరామం రఘువంశ శోమం
రాజాధిరాజం శిరసానమామి॥

## శ్రీకృష్ణావతారం

రచన: తిరుపతి వెంకటకవులు  సంగీతం: టి.వి. రాజు  గానం: ఘంటసాల

గీ. నిదుర వో చుంటివో! లేక బెదరి పల్కు
చుంటివో? కాక నీవు తొల్లింటి భీమ
సేనుడవో కావా? యెన్నఁడీ చెవులు వినని
కనులు చూడని శాంతంబు గానవచ్చె.

చ. "కురుపతి పెందొడల్విరుగఁ గొట్టెద తొమ్ము పగిల్చి వెచ్చ నె
త్తురుకడుపారఁగ్రోలి యని దున్మెద దుష్టుని దుస్ససేను భీ
కర గదచేత" నంచును బ్రగల్భము లాడితి వల్ల కొల్వులో
మరల నిదేల? యూపిటికి మానిసి పల్కులు మృష్టభోజనా!

## శ్రీకృష్ణ తులాభారం

సంగీతం: పెండ్యాల.  గానం : ఘంటసాల.

ఎన్నడు వేడరాని వనజేక్షణ రుక్మిణివచ్చి నిన్నునున్
నన్నును నేడు పుట్టిన దినంబని యెంతయు ప్రేమతోడ
మృష్టాన్నము లారగింప స్వగృహంబునకున్ దయసేయ వేడుచో
కన్నడ సేయబూనెదవు కంజదళాక్షి యిదేటి న్యాయమే

మెట్టిన దినమని సత్యయు
బుట్టిన దినమనుచు భీష్మపుత్రియు, నన్ని
ప్పట్టున బిలుతురు విందునకు
ఇట్టియెడల ఎచట కేగ హితవో చెప్పుమా

ప్రమదల కూడి మాడగనె వారి మనోగతు లెల్ల తేట తె
ల్లముగ స్ఫురించెనంచును తలంతురు పో మగవారలు ఔరా స
త్యము కనుగొన్న ఎంత రసికాగ్రణికైనను నారి కేళ పా
కము గదా కామినీ హృదయ కావ్య రస గ్రహణంబు నెచ్చెలీ

అన్నుల మిన్న ఓ
అన్నుల మిన్న భీష్మ సుత
ప్రార్థన ద్రోయగ లేక యెట్టులో
కన్నులు మూసికొంచు తమ
కంబును చిక్కగ బట్టి భీతి పై
కొన్నటులు ఒండురెండు మెతు
కు ల్దిని నీ విరహానలంబు నీ
విన్నదనంబు బాప అతి
వేగమే వచ్చితి ఆదరింపవే ఓ
అన్నులమిన్న.

## శ్రీకృష్ణ తులాభారం

సంగీతం: పెండ్యాల.  రచన: ముత్తరాజు సుబ్బారావు  గానం: ఘంటసాల.

సీ॥ కస్తూరికా తిలకమును పోనాడి
ఊర్ధ్వ పుండ్రమ్ముల నుంచి మనునో
మౌక్తిక హరినీల మణిహారముల మాని
తులసి పేరుల మెడ తొడుగు మనునో
పీతాంబరంబును వీడ్కోలు గావించి
కాషాయ వస్త్రంబు గట్టు మనునో
లలనామణీ సంగలౌల్యమ్ము విడనాడి
సంయమి వ్రతమునే సలుపు మనునో

తే॥గీ॥ ఇంక నేమి వల్వదనునొ యేమి సేయు
మనునొ యా కలహాశనుండు ఆ త్రిలోక
గమనుడు ఆ సంయమీంద్రుండు కలికీ అతని
వశము నను చేయగా నీకు పాడి యగునే

## దేవాంతకుడు

రచన: ఆరుద్ర. సంగీతం: అశ్వత్థామ గానం : పి.బి. శ్రీనివాస్, ఎస్.జానకి

అ: జగమంతా మారినది
జవరాలా నీవలన ॥జగ॥
ఆ: జన్మమే తరించినది
జతగాడా నీవలన ॥జన్మ॥
అ: అణువు అణువునా అందమే
తొణికిస లాడినది
తొణికిస లాడినది ॥అణువు॥
కనులముందు స్వర్గమే ॥కనుల॥
గజ్జెకట్టి ఆడినది గజ్జెకట్టి ఆడినది
ఆ: దివినుండి దేవతలే
దిగివచ్చి దీవించిరి ॥దివి॥
తీయని హాయిలో మనసు ॥తీయని॥
తేలితేలి సోలినది
తేలితేలి సోలినది ॥జన్మమే॥
రెక్కవిప్పి హృదయాలే
ఎక్కడికో ఎగిరినవి
రెక్కవిప్పి హృదయాలే
ఎక్కడికో ఎగిరినవి
అ: చక్కని లోకాలు జయించి ॥చక్కని॥
సామ్రాజ్యా లేలినవి ॥సామ్రాజ్యా॥
ఇ: జగమంతా మారినది
నిజమైన ప్రేమవలన ॥జగ॥

## దేవాంతకుడు

రచన: ఆరుద్ర. సంగీతం: అశ్వత్థామ. గానం : పి.బి. శ్రీనివాస్, ఎస్. జానకి

ఆ: ఎంత మధురసీమ ప్రియతమా
సంతతము మనమిచటే ॥సంత॥
సంచరించుదామా ॥ఎంత॥
అ: విను వీధుల తారకలే
విరజాజుల మాలికలై ॥విను॥
కనులముందు నిలువగా ॥కనుల॥
నీ... కురులలోన ముడిచెదనే ॥ఎంత॥
ఆ: గగన గంగ అలలలోన
కదలి ఆడు తామరలే ॥గగన॥
కరములందు వచ్చిచేర ॥కర॥
నీ చరణ పూజ చేయుదును ॥ఎంత॥
అ: ఎటు చూచిన అందమే
చిందును మకరందమే ॥ఎటు॥
ఈ వన్నెల వెన్నెలలో ॥ఈ వన్నెల॥
ఓలలాడి సోలుదమా ॥ఎంత॥
ఆ: కమ్మని ఈ వనమందున
కలసి మెలసి పాడుదమా ॥కమ్మని॥
కల్పవృక్ష ఛాయలోన ॥కల్ప॥
కాపురమే చేయుదమా
ఇ: ఎంత మధురసీమ ప్రియతమా

## షావుకారు

రచన: సముద్రాల సీనియర్. సంగీతం, గానం : ఘంటసాల.

ఏమనెనే
ఏమనెనే చిన్నారి ఏమనెనే ఏమనెనే
వన్నెల సిగపువ్వా కనుసన్నలలో భావమేమి ॥వన్నె॥
ఏమనెనే... ఏమనెనే...
ఆమని కోయిల పాటల
గోమును చిలికించు
వలపు కిన్నెర తానేమని రవళించెనే
ఏమనెనే చిన్నారి ఏమనెనే ఏమనెనే
వనరుగా చనువైన నెనరుగా
పలుకె బంగారమై కులుకె సింగారమై
మావాడ రాచిలుక
మౌన మౌనముగా ॥ఏమనెనే॥

## తిరుపతమ్మ కథ

రచన: సి. నారాయణరెడ్డి. సంగీతం: పామర్తి గానం : ఘంటసాల.

పూవై విరిసిన పున్నమి వేళా
బిడియము నీకేలా బేలా
చల్లని గాలులు సందడి చేసే
తొలి తొలి వలపులు తొందర చేసే
జలతారంచుల మేలి ముసుగులో
తలను వాల్చువేలా బేలా ॥పూవై॥
మొదట మూగినవి మొలక నవ్వులు
పిదప సాగినవి బెదరు చూపులు
తెలిసెనులే నీ తలపులేమిటో
తొలగిపోదు వేలా బేలా ॥పూవై॥
తీయని వలపుల పాయసమాని
మాయని మమతల ఊయలలూగి
ఇరువురమొకటై పరవశింపగా
ఇంకా జాగేలా బేలా ॥పూవై॥

## దేశద్రోహులు

రచన: ఆరుద్ర. సంగీతం: యస్. రాజేశ్వరరావు. గానం : ఘంటసాల.

జగమే మారినది మధురముగా ఈ వేళ
కలలూ కోరికలు తీరినవి మనసార
మనసాడెనే మయూరమై
పావురములు పాడె ఎల పావురములు పాడె
ఇదె చేరెను గోరువంక
రామచిలుక చెంత అవి అందాల జంట
నెనరు కూరిమి ఈనాడె పండెను
జీవితమంతా చిత్రమైన పులకింత ॥జగమే॥
విరజాజుల సువాసన
స్వాగతములు పలుక సుస్వాగతములు పలుక
తిరుగాడును తేనెటీగ తీయదనము కోరి అనురాగాల తేలి
కమ్మని భావమే కన్నీరై చిందెనే
ప్రియమగు చెలిమి సాటిలేని కలిమి ॥జగమే॥

## విమల

రచన: ముద్దుకృష్ణ. సంగీతం: యన్.యమ్. సుబ్బయ్యనాయుడు
గానం: ఘంటసాల, జయలక్ష్మి

### 1

అ: కన్నుల బెళుకే కలువలురా ॥కన్నుల॥
కన్నియ తళుకే కనకమురా ॥కన్నుల॥
కలవోలే కనిపించే ॥కల॥
కలలోనె వలపించే ॥కల॥
కనులలో ఆరూపే కాపురమైపోయే ॥కను॥ ॥కన్నుల॥
ఆ: కనరాని అందాలనే
కనులార కనినంతనే ॥కనరాని॥
వనమేమొ ఈ వేళనే ॥వన॥
నందనమనిపించెనే ॥నందన॥
విరులన్ని కనువిప్పెనే ॥విరు॥
చిరునవ్వు చిలికించెనే ॥చిరు॥
ఎనరాని శృంగారమే ॥ఎన॥
హృదయాలు కదిలించెనే ॥హృద॥ ॥కనరాని॥
ఆ: ఇటు చూడు ఇటు చూడవే ॥ఇటు॥
ఇది ఏమి మటుమాయమే ॥ఇది॥ ॥ఇటు॥
అ: వనరాణి వగలాడిగా
కనుసైగ కావించగా ॥వన॥
విరికన్నె కనువిప్పగా ॥విరి॥
చిరునవ్వు చిలికించగా ॥చిరు॥
ఎనరాని శృంగారమే
హృదయాలు కరిగించెరా ॥ఎనరాని॥వనరాణి॥
అ: కోరికోరి నీరూపము కనగా ॥కోరి॥
తీరును ఆకలి దాహములే ॥తీరును॥
చేరి చేరి నీ పాటలు వినగా ॥చేరి॥
చిందును అమృతబిందువులే ॥చిందును॥ ॥కోరి॥
అ: కలలు ఫలించె కాలములో ॥కలలు॥
కలిసిన ప్రేమలు శాశ్వతమే
ఆ: కలనైనా మెలకువనైనా ॥కల॥
లోకము సుందరనందనమే ॥లోకము॥ ॥కలలు॥

### 2

అ: కన్నుల్లో నీ బొమ్మచూడు
నా... కన్నుల్లో నీ బొమ్మచూడు
అవి కమ్మని పాటలు పాడు ॥కన్నుల్లో॥
ఆ: పున్నమ వెన్నెల వన్నెలతో
కన్నుల కట్టిన రూపముతో
నీవే మనసున తోచగా ॥నీవే॥
నను నేనే మరిచిపోదురా ॥కన్నుల్లో॥
అ: కోయిల పాటల తీరులతో ॥కోయిల॥
సరికోయిల రాగాలల్లుదమా
నచ్చిన పూవుపొదలేమో
కోరి వచ్చిన తుమ్మెద నీవెరా ॥కన్నుల్లో॥
అ: రాగమాలికల వీణనీవే ॥రాగ॥
అనురాగము లేలే జాణవెలే
అనురాగము లేలే జాణవెలే
నీవే వలపుల జాబిలిరా ॥నీవే॥
సరినేనే కులుకుల వెన్నెలరా ॥కన్నుల్లో॥

## పెండ్లి పిలుపు

రచన: శ్రీ శ్రీ. సంగీతం: ప్రసాదరావు గానం: ఘంటసాల, సుశీల

అ: పాడవే... రాధికా
ఆరంభించిన ఈ రాగమునే
అలపించవే బాలికా
ఆ: చాలులే... మాధవా
ఆలోచించక రాగము పాడే
బేలను కానోయ్ బాలకా
అ: రమణీమణి నీ రాగమునందు
రసభావములే లేవుసుమా ॥రమణీ॥
ఆ: రసభావముల మాధురి తెలిపే
రసికత తమరికి లోపించె ॥చాలులే॥
అ: నవ మోహన మీ గానములోనే
నవనీతమునే చూచెదవే ॥నవ॥
ఆ: వినదగు నదియే గానముగానీ ॥విన॥
కనుగొన దగునది కాదోయి ॥చాలులే॥
మ మ రి మ రి స ని స
ని ని ప ని ప మ పా
మ మ రి మ రి స ని స
ప ని స రి మా

## రాజనందిని

రచన: మల్లాది రామకృష్ణ శాస్త్రి. సంగీతం: టి.వి. రాజు గానం: జిక్కి, ఎ.ఎం. రాజా

ఆ: అందాలు చిందు సీమలో
ఉందాములే హాయిగా ॥అందాలు॥
ఆ: చూసిన చూపు నీకోసమే
నన్నేలు రాజు నీవే నీవే ॥చూసిన॥
చిన్నారి బాలుడా... ॥అందాలు॥
అ: ఆనంద సీమ ఈ లోకము
ఈ తీరుగానే నీవూ నేనూ ॥ఆనంద॥
ఏలేము హాయిగా ॥అందాలు॥
ఆ: నిలువెల్ల నిండె ఆనందము
అ: నీ మోము గోము నాదే నాదే ॥నిలువెల్ల॥
ఆ: ఔనోయి బాలుడా
ఇ: అందాలు చిందు సీమలో
ఉందాములే హాయిగా

## కార్తవరాయుని కథ

రచన: మల్లాది రామకృష్ణ శాస్త్రి. సంగీతం: అశ్వత్థామ. గానం : పి.బి. శ్రీనివాస్

ఆనందమోహన ఖగరాజవాహన
అవతార లీలా విలాసా లోకేశా ॥ఆనంద॥
దరిచేరు వారి కరుణించు దైవరాయ
శరణంటినయ్యా స్వామీ వరమీయ వయా
చిరునవ్వు దేవర ॥ఆనంద॥
అందరినీ ఓ ఆటాడించుట నీకు వేడుక
నిను కొనియాడుట నాకు వేడుక
కోరిన కోరిక సఫలముగా చే
దోడు కావయా, తోయజనయనా ॥ఆనంద॥
పాల కడలిలో పాప పానుపున
సిరుల జవరాలు సరసను నిలువగ
సరసాలలో మైమరచే మీ
పరవశమే దీవెన కావలె ॥ఆనంద॥


‘ఉమ్మడి కుటుంబం’ సినిమా పాట రికార్డింగ్‌లో ఘంటసాలతో పాటు
గొంతు కలిపి ఆలపిస్తున్న ఎన్టీఆర్. ఫొటోలో సంగీత దర్శకుడు టి.వి.రాజు
ఎన్టీఆర్ సోదరుడు త్రివిక్రమరావు కూడా ఉన్నారు.
జనవరి 18
ఎన్టీఆర్ వర్ధంతిని
పురస్కరించుకుని...
హాసం

